# హిందూ మతము

# HINDUISM



BY

REV. A. M. BOGGS



THE CHRISTIAN LITERATURE SOCIETY FOR INDIA
(U. S. C. L.)
MADRAS BANGALORE SECUNDERABAD COLOMBO
1939
వెల, 12 అణాలు] [3 E. 1 M.

## రెండవ కూర్పునకు వ్రాయబడిన ఉపోద్ఘాతము

**సు**మారు పది సంవత్సరముల క్రిందట నీ పుస్తకముయొక్క ప్రథమ సంపుటము నచ్చొత్తించితిని. అప్పటినుండి దీనిని వేదాంతపాఠశాలలలో బఠనీయగ్రంథముగా వాడుచున్నారు. కాని మొదటి ప్రతియందు కొన్ని లోపములు గానవచ్చుటచే వాటిని సవరించుచు క్రొత్త ప్రతియొకటి తయారుచేయుట యుక్తమని తోచెను. పాత ప్రతియందు కొన్నిచోట్ల సంక్షేపముగ వివరించిన యంశములను మరింత పెంచి వ్రాసితిని. మరికొన్ని స్థలముల కొన్ని విశేషాంశములను బూర్వగాథలను నూతనముగా జేర్చితిని.

హైందవమతమునుగూర్చి పూర్వముకన్న మరింత విపులముగ దెలిసికొని ఎక్కువ హెచ్చరికతోను ధైర్యముతోను సువార్త ప్రచారముచేయుటకై గ్రంథ బాహుళ్యముజేసి రెండవ పర్యాయము ముద్రించుచున్నాను.

ప్రప్రథమమున హిందూమతబీజముల నాటిన దీ మతాచార్యుడనిగాని, యెవరో యొక ప్రాచీన యార్య మతస్థాపకుడున్నాడనిగాని నిశ్చయించుట సులభసాధ్యముకాదు. వేదకర్తలగు మహర్షులుగాని వారి శిష్యప్రశిష్యులుగాని వేలకొలది సంవత్సరములవరకు తమ మతభావములను గ్రంథరూపముగ రచియించినవారుకారు. కాని భారతమతసిద్ధాంతములును, సాంప్రదాయములును, ఆయా మతశాఖలవారిలో వంశపారంపర్యానుగతములై దేశమంతయు వ్యాపించియుండెను. హిందూమతము పెక్కుమతముల సంపుటియగుటచే, శ్రౌత, స్మార్త, పురాణాదిగ్రంథములలో నొకదానినిగాని, అన్నిటినిగాని పరిశీలించినను ప్రస్తుత భారతమతమును సంపూర్తిగ గ్రహించితిమని చెప్పుట కష్టసాధ్యము. కనుక ఆర్యమతముయొక్క పుట్టుపూర్వోత్తములు సంపూర్ణముగ దెలియగోరుదుమా, మధ్యాసియా ప్రాంతమున వసతు లేర్పరచుకొనిన హైందవైరోపియనుల కాలమున చిన్న మొలకగనుండి, కాలక్రమమున భిన్నభిన్న మతాచార్యుల యుపదేశములను, సాంప్రదాయములను, మతసాంఘీక యాచారములను తనయందిముడ్చుకొని శాఖోపశాఖలుగ విస్తరించియుండిన నవీన హిందూమతముయొక్క చరిత్ర నాలుగువేల సంవత్సరములవరకు సమూలముగ బరిశీలించవలెను.

ఈ గ్రంథము హిందూమతసిద్ధాంతములను గూర్చినది. కనుక వాటి ఖండనలు గ్రంథమందుగాక గ్రంథాంతమందు అనుబంధములుగా చేర్చితిని.

# CONTENTS



**Appendix**

పెక్కు గ్రంథములనుండి సమకూర్చి యనేక విషయము లీ సంపుటయందు జేర్చితిని. కావున నాకు సహకారులయినట్టి యీ గ్రంథకర్తలను, విశేషప్రయాసపడి నా యాంగ్లపుస్తకము నాంధ్రీకరించిన నెల్లూరుపట్టణవాసులగు అసురు రంగాచార్యులుగారును, నర్సాపురము కాపురస్థులగు కస్తూరి సాంబమూర్తిగారును ఈ పని యందు నా కనేకవిధములుగా తోడ్పడిన రామాయపట్టణమునందలి వేదాంతపాఠశాలోపాధ్యాయకులగు బేతము బెంజమిన్ గారును నా కృతజ్ఞతాపూర్వక వందనముల కర్హులు.

పరమార్థ తత్త్వవిచారణ చేసి చేసి, తుదముట్టలేక విసిగి, వేసారిన పురాతన ఋషీశ్వరులయొక్కయు, సత్పదార్థమును వెదకుచు సత్యస్వరూపియు, ఆత్రితరక్షకుండునగు పరిశుద్ధదేవుని సందర్శింప నువ్విళ్లూరుచుండిన భగవద్భక్తులయొక్కయు, ఆత్మదాహము నడంచి, వారిని తన యందును జేర్చుకొని శాశ్వత మోక్షానందభక్తులుగ జేయ సత్యావతారియగు శ్రీ యేసుభగవానుల బ్రార్థించుచు నీ హిందూమత గ్రంథమును సమర్పించుచున్నాడను.

ఏ. ఎం. బాగ్స్,
రామాయపట్టణము.

జూలై 1, 1935

4 3 83

# CONTENTS

# విషయసూచిక

# హిందూమతము

# HINDUISM

## మొదటి యధ్యాయము

## CHAPTER I

## ఆర్యుల ప్రాచీన మతోత్పత్తి

## The Origin of the Religion of the Aryans

### A. THE PREHISTORIC UNDIVIDED INDO-EUROPEANS AND THEIR RELIGION. చరిత్రకాలమునకు ముందు నేకకుటుంబముగానుండిన హైందవైరోపియనులును, వారి మతమును.

I. The Aryans. ఆర్యులు.—మొదట యేకకుటుంబముగనుండి, తరువాత ననేక భిన్నభిన్న శాఖలుగ జీలిపోవుటకు పూర్వము ప్రాచీన హైందవైరోపియను జాతివారవలంబించిన మతమునే, హిందువుల పూర్వీకులగు హైందవ యార్యులుగూడ ననుసరించుచుండిరి. వారివారి మత, సాంఘికనియమములకును, వారుపయోగించుచుండిన సామాన్య భాషాపదములకునుగల పరస్పర సంబంధములనుబట్టి చూడగా, హిందూ పారసీక ఐరోపియను జాతులవారికిగల పూర్వపు బాంధవ్యము తేటతెల్లమగుచున్నది. ఆర్య యను పదమును జాతినామముగ హిందూదేశములోనేగాక బాక్ట్రియ, పారసీకదేశములలోగూడ వాడుచుండిరి. పారసీకరాజగు దర్యావేషు అనునతడు తాను ఆర్యుడనని చెప్పుకొనియున్నాడు. మరియు ఆర్యయను పదము జెండ్ అవెస్ట యను పారసీక మతగ్రంథమున పలుమారు కానవచ్చుచున్నది. పారసీకులు తమ దేశమునకు ఐరాన్ యను పేరుపెట్టుకొనిరి.

హిందువుల సంస్కృతమునకును, పారసీకుల జెండ్ యను భాషకు నన్యోన్య సంబంధముండినను, ఈ రెండు భాషలును ఐరోపాదేశ భాషలతో సంబంధించి యున్నవి. ఈ భాషాపదములన్నిటిని పోల్చి చూచినయెడల, ఇవన్నియు హైందవైరోపియను లేకమైయుండినకాలమున మాటలాడుచుండిన మాతృభాషనుండియే పుట్టినవని స్పష్టమగును. హైందవైరోపియను భాషలకన్నింటికిని పునాదియగు నాది

భాష యంతరించిపోయినను, ఈ క్రిందిభాషలన్నియు దానికి సంబంధించినవే. (1) సంస్కృతము. (2) పారసీకదేశపు జెండ్ భాష. (3) ఆర్మీనియన్. (4) గ్రీకు. (5) ఆల్బేనియన్. (6) పూర్వము ఇటలీవారి భాషయగు లాటిన్ యును, ప్రస్తుతము వారుమాటలాడు ఇటలీభాషయును. (7) పెక్కుదేశములలో నివసించుచుండు కెల్టిక్ జాతులవారు మాటలాడు కెల్టిక్ భాషలు, అనగా ఫ్రాన్సుదేశములోని పురాతన గాలిష్ భాష, వేల్సులోని వేల్ష్ భాష, ఇంగ్లాండు దేశములోని కార్నిష్ బ్రిటన్ భాషలు, ఐర్లాండులోని ఐరిష్ భాష, స్కాట్లెండులోని స్కాచ్ గేలిక్ భాష. (8) యూరోపు ఖండమందనేక దేశములయం దొకానొక కాలమున వాడబడుచు, ప్రస్తుత మంత రించియుండు గోథిక్ భాషయు, స్వీడన్, నార్వే, డెన్మార్కు దేశభాషలును, జెర్మన్ ఇంగ్లీష్ భాషలును. (9) రష్యా బాల్కన్ రాష్ట్రవాసులు మాటలాడు లెటిష్, స్లావోనిక్ భాషలును.

II. Their Home. వారి మాతృభూమి.—కాస్పియను, నల్లసముద్రములయొక్కయు, హిందూకుష్ పర్వతములయొక్కయు, నుత్తరభాగమునుండి, మధ్యాసియా, రష్యా గడ్డిబైళ్లమీదుగ, జర్మనీదేశ యుత్తర మైదానములవరకును వ్యాపించియుండు భూభాగమందు హైందవయూరోపియనులు ప్రథమమున తమ వసతులేర్పరచుకొని యుండి నట్లు కనబడుచున్నది. ఈ ఆర్యజాతివారు బహు పరాక్రమశాలురు. తమ పశువుల మందలను రక్షించుకొనుచు, వ్యవసాయమువలన జీవించుచుండిరి.

III. Their Religion. వారి మతము.

1. Their Gods. వారి దేవతలు.—వారారాధించు దేవతలలో గొందరు సుగుణదేవతలు, మరిగొందరు దుర్గుణదేవతలు. ఇంతేగాక ప్రకృతిశక్తులలో ప్రాముఖ్యములగు వాటినిగూడ తమ యిష్టదైవములుగ భావించుచుండిరి. పరమాత్మకు పెట్టిన ప్రాచీన నామమగు **దేవుడు** అను పదముయొక్క భావము కొంతకాలమునకు దరువాత **దేవ** యను సంస్కృతపదమందును, **డేయుస్** యను లాటిన్ పదమునందును కానవచ్చుచున్నది. ఈ కాలమున ఏక కుటుంబముగానుండిన హైందవయూరోపియనులు (1) ఆకాశపితను అనగా ద్యోస్‌పితర్ అని సంస్కృతము; జ్యూపిటర్ యని లాటిన్; జియుస్ పాటెర్ అని గ్రీకు, (2) భూమాతను, (3) పై నావరించియుండు ఆకాశమును అనగా వరుణ యని సంస్కృతము; ఔరనాస్ యని గ్రీకు, (4) మేఘుని, (5) గగన పుత్రులు అనగా గగనపుత్రపు రౌతులను, (6) సూర్యుని, (7) చంద్రుని, (8) నక్షత్రములను, (9) నిప్పును అనగా అగ్ని యని సంస్కృతము; ఇగ్నిస్ యని లాటిన్ ఈ దేవతలను పూజించెడివారు. ఈ దేవతలనందరిని ఆకాశపితయొక్క పుత్రులుగ భావించుచుండిరి.

2. Their Worship. వారి యారాధనక్రమము.—వారి పురోహితులు ఈ దేవతలకు బలుల నర్పించి, స్తోత్రము చేయుచుండిరి. ఆ కాలమున హీనజాతి వారి మతము కేవలము మాంత్రికముగ నుండినదనుటకు సందేహములేదు. అగ్రజాతులును వేదమతముతోపాటు మాంత్రిక విద్యలనుగూడ నభ్యసించుచుండిరి.

**3. Ancestor Worship.** పితృదేవతల నారాధించుట. — హైందవైరోపియన్ ఆర్యశాఖల మతములన్నిటిలోను పితృదేవతల నారాధించుట ప్రాముఖ్యాంశమై యుండెనని విశదమగుచున్నది. అంతేగాక సాంఘిక విధులన్నియు నట్టి యారాధనముమీదనే యాధారపడియుండెను. చనిపోయి ప్రేతరూపముననున్న వారి పితరులు అన్నపానములకు దమ సంతానముపై నాధారపడియుండునట్లు వారను కొనుచుండిరి. కాబట్టి పితృదేవతలకు బిండప్రదానము జేయుచుండిరి. ఆ పితృదేవతలు మిగుల మహత్తుగలవారని నమ్మియుండినందున, వారిని దేవతలతో సమానులుగ భావించి, వారి యనుగ్రహము లభించుటకై వారిని పూజించుచుండిరి. ఈ పితృకార్యము చేయుట గృహయజమానునికి విధియైయున్నది. అతని యనంతరము తండ్రికి బదులుగా కుమారుడు పితృకర్మ లాచరించుచుండవలెను. ఆ కారణముచే బుత్రసంతానము కలుగుటకు మిగుల ఆశపడుటచేత స్త్రీ శిశువులను నిర్లక్ష్యభావముతో జూచుటయేగాక ఆ బిడ్డలను భ్రూణహత్యలు చేయుటకు వెనుకదీయకుండిరి.

## B. THE INDO-IRANIANS AND THEIR RELIGION.

## హైందవైరేనియనులును, వారి మతమును.

**I. History.** చరిత్ర.—హైందవైరోపియనుల సంఖ్య మిక్కుటమై వారి పూర్వికుల దేశము నివసించుటకు చాలకపోయినందున, వారిలో నొక తెగవారు పశ్చిమముగ యూరోపునకును, మరియొక శాఖవారు దక్షిణముగ ఐరాన్ అనగా పారసీక పీఠభూములకును బోయిరి. ఈ దేశత్యాగము బహుశా క్రీ. పూ. రెండు మూడు వేల సంవత్సరముల మధ్యను సంభవించియుండును. మరికొంత కాలమునకు పారసీక హైందవులు రెండు గొప్ప తెగలుగ జీలిపోయిరి. వీరిలో నొక శాఖనుండి హిందూమతమును, వేదములును, మరియొకదానినుండి జొరోస్ట్రియ మతమును, జెండ్ అవెస్టయును పుట్టెను. వేదములను, జెండ్ అవెస్టను సరిపోల్చి చూచిన పక్షమున నీ రెండు శాఖలవారును వేరైపోవుటకు ముందు వీరి జీవిత విధానములనుగూర్చియు, ప్రాచీన మతాచారములనుగూర్చియు ననేక విషయములు మనకు విశదమగుచున్నవి.

### II. Religion of this Period. ఆ కాలపు మతము.

**1. Their Gods.** వారి దేవతలు.—ఆ కాలమున నీ రెండు శాఖలవారును సమముగా నంగీకరించిన ప్రాముఖ్య మతాభిప్రాయములు కొన్ని బయలువెడలుచున్నవి. అప్పటి ప్రధానదేవత లెవరనగా ద్యౌస్‌పితర్, వరుణుడు, మిత్రుడు, ఆర్యమనుడు, భగుడు, దక్షుడు, ఇంద్రుడు, సూర్యుడు, చంద్రుడు, గ్రహములు, యముడు, యాగకాలమున దేవతలు పానముచేయు సోమరసాధిపతియగు సోముడు, అనువారు. ప్రారంభమున నీ దేవతలు కేవలము ప్రకృతిశక్తులై యుండిరి. కాని యటు తరువాత సూక్ష్మశరీరములను ధరించి, యీ ప్రకృతిశక్తుల మూలమున ప్రత్యక్షమగుచున్న దేవతలని భావించిరి. వీరందరిలో ప్రధానుడు వరుణుడు. ఇతడు దివ్య ధర్మములకు మూలకారకుడని జెండ్ అవెస్టలోను, ఋగ్వేదములోను జెప్పబడియున్నది. ప్రకృతి

యంత్రమును నడపుచు, దేవతలను మానవకోటిని ధర్మమార్గమునకు ప్రేరేపించుచుండు నొక యుత్కృష్ట ధర్మస్వరూపుడుండవలయునని క్రీ. పూ. 1600 సంవత్సరమునకు ముందు నేకకుటుంబములుగానుండిన కాలముననే యీ రెండు శాఖలవారును నమ్మిరి. ఈ భావము సంస్కృతపదమగు ఋతయందును, జెండుభాషాపదమగు అష లేక అర్త యందును కాన్పించుచున్నది. క్రూరభూతములే భూకంపములు, తుపానులు, శరీర వ్యాధులు మొదలగువాటికిని, దుష్టతలంపులకును, దుష్టకార్యములకును కారకులనెడి నమ్మకము ఈ కాలముననే ప్రబ్బుచుండెను.

2. Sacrifices and Priests. యాగములును, యాజకులును.—ఆ కాలమున వేదకర్మలు పెక్కు మంత్రస్తోత్ర గానములతో విస్తరించియుండెను. యజ్ఞయాగాదికర్మలు చేయించు నధికారము యాజకులకుమాత్రమే యుండుటచే, వారగ్రస్థానములను వహించియుండిరి. యజ్ఞములలో నర్పించు వస్తువులు అగ్నిదేవుడు అగ్నిజ్వాలల ద్వార పరలోకమందుండెడు దేవతలకు జెందించుచుండెనని నమ్ముచుండిరి.

3. Immortality. అమరత్వము.—మనము వర్ణించుకాలమున మృతులైన వారిని దహనముచేయుట సర్వసామాన్యమైయుండెను. కాని యింతకు బూర్వము దహన భూస్థాపనలు రెండును ఆచారమైయుండెను. హోమముచేయు వస్తువులు అగ్నిదేవునిచే నగ్నిజ్వాలల ద్వార పరలోకవాసులగు దేవతలకడకు దీసికొనిపోబడునని యార్యులు నమ్మినట్లే, మరణానంతరము ప్రేతదేహులను అగ్నిదేవుడు స్వర్గలోకవాసులగు పితృదేవతలకడకు నగ్నిజ్వాలలద్వారా తీసికొనిపోవుననికూడ భావించిరి. అచ్చట వీరు చిరంజీవులై దేవతలతోపాటుగ పరమానంద మనుభవించుచుండిరి. ఇంతేగాక పంచభూత బంధవిముక్తులై దివ్య ప్రభావముతో నుండిరి. గనుక దేవతలతో గూడ వారిని యజ్ఞయాగాదులకు నాహ్వానించుచుండిరి.

# రెండవ యధ్యాయము

# CHAPTER II

# వేదమతము

# Vedism

## A. CHARACTERISTICS OF THE VEDIC AGE. వేద యుగలక్షణములు.

I. **History.** చరిత్ర.—సుమారు క్రీ. పూ. 1500-వ సంవత్సరమున హైందవైరేనియనులు గొప్ప జనాంగములుగ జీలినపిమ్మట ఐరేనియనులు పారసీకమునందు నిలిచిపోయిరి. బలపరాక్రమశాలులును, శూరులునునగు హైందవార్యులు మొట్ట మొదట ఏడు నదులుగలిగి సప్తసింధు అనబడు పదమ్మటి పంజాబుదేశములోను, ఆ నది కవతల ఆఫ్ఘనిస్థాన ప్రాంతములలోను కాపురమేర్పరుచుకొనిరి (ఋగ్వేదము 10: 75). ఈ యేడు నదులేవిగా నుండవచ్చుననగా: పశ్చిమ సరిహద్దగు కాబూలు లేక సింధునదియును, పంజాబులోని అయిదు నదులు అనగా జీలం, చీనాబ్, రావి, బియాస్, సట్లెజ్ యును, తూర్పు సరిహద్దగు సరస్వతియు ననునవి. ఆర్యులు హిందూదేశములో ప్రవేశించి, దేశమును స్వాధీనపరచుకొనుచుండిన కాలములో నెప్పుడో యొకప్పుడు ఇశ్రాయేలు సంతతివారు ఐగుప్తుదేశమునుండి కానానుదేశమునకు ప్రయాణమైపోయిరి. ఆర్యులీ దేశమునకు వచ్చునప్పటికి ఇచ్చట నల్లనివర్ణముగల మరియొక జాతివారు నివసించుచుండిరని వారు తెలిసికొనిరి. అప్పటి నుండి ఆర్యులకును, ఈ నల్లనివారికి నెడతెగక ఘోరయుద్ధములు జరుగుచుండెను. వాటిలో నాదిమ హిందూదేశవాసులు సాధారణముగా నోడింపబడి బానిసలుగ పట్టుబడుచుండిరి. ఆర్యులు వీరిని దస్యులు లేక దాసులనుచుండిరి. ప్రథమమున వసతులేర్పరచుకొనిన యార్యులలో గొందరిని వారికితరువాత వచ్చిన యార్యశాఖల వారు ఓడించి, ఆదిమవాసులగు దస్యులతో సమానముచేసి, వారికి నీచస్థానము లొసంగినట్లు కనబడుచున్నది. కావున ఈ ఆదిమనివాసులగు దస్యులును, హీన స్థితికి వచ్చిన ప్రాచీన యార్యులును కలసి ప్రస్తుత శూద్రజాతిగ నేర్పడిరని కొందరభిప్రాయమైయున్నది.

అచ్చటినుండి యార్యులు క్రమక్రమముగా క్రొత్తప్రదేశమునకు సాగిపోవుచుండిరి. అయితే యార్యులందరు నిట్లు ఒక్కసారిగా పోయియుండలేదు. తాము జయించిన దేశములో గొందరుమాత్రము స్థిరపడి, తక్కినవారిని నూతన ప్రదేశమునకు బంపివేసిరి. ఈ విధముగా నార్యులు తూర్పు ప్రదేశమువరకు వ్యాపించిరి. ఋగ్వేదములో నుదాహరింపబడియుండు ముఖ్యనదులు సింధు, సర

స్వతి యనునవి. కాని యమునా, గంగానదులనుగూర్చి తరువాత చెప్పబడియున్నం దున, మనము వర్ణించు కాలాంతమున నార్యులు కొరకు పుణ్య క్షేత్రమగు కురుక్షేత్రము యొక్క తూర్పుప్రాంతములవరకైనను వచ్చియుండవలెనని స్పష్టమగుచున్నది. సముద్రమునుగూర్చి వారికి భ్రాంతిగా దెలియనట్లున్నది. వేదములలో జెప్పబడిన పర్వ తములు హిమవంతమను హిమాలయములేగాని వింధ్యపర్వతములనుగూర్చి యేమియు కనబడదు. అధర్వవేదము నాటికి నార్యులు బంగాళాదేశమువరకు వ్యాపించి యుండిరి.

ఆర్యసంఘములో నైదు తెగలవారు చేరియుండిరి. ఈ తెగలలో నొండిం టికి యుద్ధములు జరుగుచుండెను. వీరు వంశపారంపర్యముగ వచ్చుచుండిన రాజుల యధికారమునందుండిరి. వారు పల్లెటూళ్లలో నివసించుచుండిరి. పశువులును, పంటలును వారికి ప్రధాన జీవనోపాధియైయుండెను. అప్పటికి వారు వ్రాత కోతలయందు పరిశ్రమ చేసియుండలేదు. కాని కొన్ని కళలుమాత్రము నేర్చి యుండిరి.

II. The Patriarchal Family. కుటుంబ యజమానుడు సర్వాధికారము వహించియుండుట.—ఆర్యులు చనిపోయి ప్రేతదేహమందున్న తమవారు అన్న పానాదులకు తమ కుటుంబమువారిమీద నాధారపడియుండిరని నమ్ముచుండిరి. కావున వారు ప్రేతలకు పిండములు వేసి యారగింప రమ్మని వారిని వేడుచుండిరి. ఈలాగు పితృదేవతల నారాధించుట ప్రారంభమయ్యెను. ఆ కాలమున దండ్రియే కుటుంబ మునకు బురోహితుడుగ నుండెను. ఈ పారంపర్య శ్రాద్ధకర్మవిధాన మతడెరిగి యుండెను. అతడు పితృ మాతృదేవతల యనుగ్రహముబొందుటకు పితృదేవతల నారాధించు క్రమమంతటిని దన కుమారునికి నేర్పవలసియుండెను. ఈ పైన చెప్పి నట్లుగా తండ్రి ఈ కర్మలు చేయవలసియుండెను గనుక అతడు కుటుంబపాలకుడుగ నుండుటయేగాక పురోహితుడుగను నుండెను. ఈ పితృకర్మలను జరిగించుటకు కుమారుడు కావలసియుండుటచే బ్రతివాడును పుత్రసంతానమునకై వివాహమాడ వలసినవాడైయుండెను. ఇందుకొరకే భార్య కావలసియుండుటవలన స్త్రీలకు గౌరవ స్థానము లొసంగకుండుట సహజమాయెను. దీనికి వెంబడిగా నొక పురుషుడనేక స్త్రీలను వివాహమాడుటయు స్త్రీ శిశుహత్యయు వాడుకలోనికి వచ్చెను.

పితృదేవతారాధనమునుగూర్చి ఋగ్వేదములో కానవచ్చుచున్నది. ఇందు పితృదేవతల నార్యులు ఆహ్వానించుచుండిరని యున్నది. బ్రాహ్మణములు శ్రాద్ధ పిండ ప్రదానకర్మలనుగూర్చి చెప్పుచున్నవి. జన్మల నెత్తించెడు ప్రారబ్ధకర్మ మనుభ వింపవలయుననియును, బాహ్యకర్మలు తాను చేసిన పూర్వజన్మకర్మను మార్చుట దుర్లభ మనియును బోధించు జన్మాంతరసిద్ధాంతము ఆర్యులలో వ్యాపించియుండినను, ఈ శ్రాద్ధకర్మలు పారంపర్యముగ నిప్పటికి నాచరించుచునే యున్నారు.

III. Marriage. వివాహము.—వివాహమాడుట యార్యులలో సర్వసాధా రణమై యుండెను. బ్రహ్మచర్యదశలో జనిపోయినవారు నరకము పాలుగాకుండు

టకై, వారి శవములను బెండ్లిచేయు నాచారము ఋగ్వేదకాలమున కద్దు. పుత్రికలు కలుగుట యిష్టములేనందుచేత నాడశిశువులను దరుచుగా వృద్ధులతోబాటుగ క్రూర మృగములవాత బడవేయుచుండిరి. ఆ కాలమున నతి బాల్యవివాహములును, స్త్రీ పునర్వివాహముల నిషేధించు జట్టములును, ఘోషాకట్టుబాట్లును, సహగమనవిధియు లేనేలేవు. స్త్రీలు తాము కోరినవారిని దరుచుగా బెండ్లాడుచుండిరి. అచ్చటచ్చట గొందరికి ననేక భార్యలుండినను, ఏకపత్నీ వ్రతము శాస్త్రనియమమై యుండెను.

IV. Beef and Intoxicants. మధుమాంసాహారములు. — ఆర్యులు గోమాంసభక్షకులును, సోమ యను మద్యము బానము చేయువారునై యుండిరి. విందు నకువచ్చెడు నతిథిని బూజించుటకు గోవును జంపవలసియుండెను. కావున నీ యతిథి గోఘ్న (అనగా గోవును చంపువాడు) అను మారుపేరు గలిగియుండెను. ఇట్లు చంపిన గోవుయొక్క మాంసమును వండి, యతిథికి వడ్డింపవలెనని ధర్మశాస్త్రము విధించుచున్నది. శతపథబ్రాహ్మణము 11: 7, 1, 3 లో "మాంసమే యుత్తమ యాహారము" అని యున్నది.

V. Caste. కులభేదము.—శ్రౌతమహాయుగ ప్రారంభమున కులభేదములు లేవు. కాని ఈ యుగసమాప్తియందు, ఋగ్వేదముయొక్క పదియవ మండలములో తొంబదవ సూక్తములో కులనిర్ణయము చేయుచున్న శాస్త్రప్రమాణము కనబడుచున్నది. పురుషసూక్తము ఆదిపురుషుడును పరమాత్ముడునైన పురుషుని వర్ణించుచున్నది. ఈయన తన శరీరాంగములనుండి నాలుగు వర్ణములవారిని పుట్టించెను. అనగా శిరస్సు నుండి బ్రాహ్మణుని, బాహువులనుండి యుద్ధవీరుడగు రాజన్యుని, ఊరువుల అనగా తొడల నుండి వ్యవసాయకుడగు వైశ్యుని, పాదములనుండి సేవకుడగు శూద్రుని పుట్టించెను. మొదటి మూడు వర్ణములవారు ఆర్యసంతతివారు. వీరు కొంతికాల మైనపిమ్మట ద్విజులనబడిరి. కాని శూద్రులు ఆర్యులకు నోడిపోయి, లోబడి యుండుటచే వారిని యనార్యులని భావించుచుండిరి. శూరశిఖామణులగు నార్య సంఘములోని యాజకుడు, యుద్ధవీరుడు, వ్యవసాయకుడు అను నీ మూడు తరగతులవారును ప్రతిదేశమునందును గలరు. కాని ఈ దేశమందువలె కుల కట్టుబాట్లు లేక యున్నారు. ఆర్యులలో నిట్టి జాతిభేదములుండుటచేతనేగదా యాజకులు మతాధికారులుగను, క్షత్రియులు పరిపాలకులుగనుండి, జనసామాన్యమును నీచముగ జూచుట సంభవించెను. కాని బ్రాహ్మణ క్షత్రియు లొండొరులయెడల భయ భక్తులు కలిగియుండిరి. మొదటి మూడు వర్ణములవారును ఋగ్వేదదేవతల నారాధించుచుండుటచే, సామాన్యజనులు పూజించెడు క్షుద్రదేవతలను గౌరవముచేయ కుండిరి.

VI. Austerities. కఠినవ్రతములు.—ఆర్యులద్భుత యోగసిద్ధులను, యుద్ధ నైపుణ్యమును, స్వర్గపదవిని నందగోరి, కఠినవ్రతములను, తపములను, శరీరము కృశింప జేయు యోగాభ్యాసములను జేయుచుండిరి. ఇప్పటివలె నా కాలమునగూడ ముని అనగా తపస్వియైనవాడు కాషాయవస్త్రములను ధరించుట కద్దు. సంసారసుఖము లనుభ

వించుచు, సంతోషముగ గాలముగడుపుకొనుచుండు నా ప్రాచీన యార్యులు, మానవకోటిని దుఃఖసముద్రమున ముంచివేయు పునర్జన్మసిద్ధాంతమునం దెట్టి విశ్వాసములేక, హాయిగా నూరేండ్లు జీవింప గోరుచుండిరి.

## B. THE VEDIC BOOKS. వేదగ్రంథములు.

### I. Dates and Authors of the Vedas. వేదములు పుట్టిన కాలములును, వాటి గ్రంథకర్తలును.

హిందువుల యతి పురాతనగ్రంథములు వారియొక్క నాలుగు వేదములే. అవేవనగా ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, అథర్వవేదము అనునవి. ఇవి దాదాపు క్రీ. పూ. 1500-వ సం॥ నుండి, క్రీ. పూ. 800-వ సం॥ వరకు గల కాలములో బుట్టియుండును. ఋగ్వేదమందలి ప్రాచీన సూక్తములు ఆర్యులకు, తమ జన్మభూమియగు మధ్యాసియాలోనుండిన కాలముననే లభించియుండెను. అయితే అథర్వవేదము, తక్కిన మూడు వేదములు ప్రమాణగ్రంథములుగా లెక్కించిన బహుకాలమునకు పిమ్మటనే నొక వేదముగా నెన్నికలోనికి వచ్చెను. క్రీస్తునకు బూర్వము అయిదువేల సంవత్సరములక్రిందటనే వేదకాల మారంభమాయెనని కొందరును, వేదములకు ఆద్యంతములు లేవని మరికొందరును నమ్ముచున్నారు. కాని ఐరేనియనులయొక్క యాచారములను, హైందవార్యుల యాచారములతోను, జెండ్ అవెస్ట అను పారసీకగ్రంథమును ఋగ్వేదముతోను పోల్చి పరిశీలించినయెడల, ఈ వేదకాలప్రారంభము క్రీ. పూ. 1500-వ సంవత్సరమునకు ముందే యని తీర్మానించుట కష్టసాధ్యమగును. అంతేగాక హైందవైరోపియను జనులలో గొందరియొక్క అనగా గ్రేకులు, రోమీయులు, పారసీకులవంటివారియొక్క యతి పురాతనగ్రంథసముదాయమును సరిపోల్చి చూచినయెడల, అవి క్రీ. పూ. 1000 సంవత్సరములకంటె పురాతనములుకావని తేటపడును. కావున హిందువులు అంతకు ననేకవేల సంవత్సరములకుముందే ఋగ్వేదములోని రమ్యములైనట్టియు, తత్వశాస్త్ర సంబంధమైనట్టియు కావ్యములను జేయగలిగిరను విషయము నమ్ముట కష్టముగనుండదా?

వేదములలోను, రామాయణాది కావ్యములలోను ఒకే సంస్కృతభాష వాడినను, ఈ యుభయగ్రంథముల రచనయందు గొప్ప వ్యత్యాసము కాన్పించుచున్నందున నిట్టి భేదము కలుగుటకు విశేషకాలము పట్టునని కొందరు వాదింతురు. అయినను ఇట్టి గొప్పభేదము కొలది శతాబ్దములలోనే కలిగియుండవచ్చును. ఇందుకు దృష్టాంతముగా ప్రాతరూపముననున్న పారసీక, గ్రేకు, ఆంగ్లేయభాషలు కొంత కాలములోనే గొప్పగా మారెనని మనకు దెలియును. వేదములు తుదకు గ్రంథరూపము నొందినకాలము క్రీ. పూ. దాదాపు నాల్గవ శతాబ్దమో, అయిదవశతాబ్దమోయై యుండవచ్చును.

ఈ వేదసూక్తకర్తలు ఋషులు. దివ్యజ్ఞానమను అర్థమిచ్చు ఈ గ్రంథములకు వేదములు అను నామము కలిగెను. వీటికి శ్రుతులు అను నామాంతరము కలదు.

శ్రుతి యనగా వినవచ్చిన దేవునివాక్కు గనుక వేదములకు ఆది లేదని వాదించుచున్నారు. ఈ శ్రుతులు పుట్టినకాలమును శ్రౌతయుగమనుచున్నారు. ఈ వేదములలో గొన్నిటికి స్త్రీలును కొన్నిటికి రాజులును, మరికొన్నిటికి రాజర్షులును కర్తలై యుండిరి. అనేక గ్రంథకర్తల నామములు వేదములలో గానవచ్చుచున్నవి.

వేదముల యుత్పత్తివిషయమై పెక్కు హిందూగ్రంథములు పరిపరివిధముల చెప్పుచున్నవి. ఋగ్వేదము 10: 90 లో ఆదిపురుషుని బలిగా నిచ్చుటచే నందుండి వేదములు పుట్టెననియు, అథర్వవేదము 10: 7, 20 లో స్కంభువను దేవత దేహము నుండి కత్తిరింపబడినట్టిగాని క్షౌరము చేయబడినట్టిగాని రోమములో లేక అతని నోరో యనియు, శతపథబ్రాహ్మణము 14: 5, 4, 10 లో నివి పరమాత్మయొక్క శ్వాసమనియు, ఆ గ్రంథములోనే 7: 5, 2, 52 వచనములలో వీటిని దేవతలు మనస్సు అను సముద్రములోనుండి త్రవ్వి, పైకితీసిరనియు, తైత్తిరీయ బ్రాహ్మణము 3: 39, 1 లో నివి ప్రజాపతియొక్క గడ్డములోని వెండ్రుకలనియు, విష్ణుపురాణము 3: 13, 19 లో నివి విష్ణురూపములనియు, తైత్తిరీయ బ్రాహ్మణము 2: 8, 85 లోను, శాంతిపర్వము 12,920 లోను వాక్కును, సరస్వతియును వీటికి దల్లులనియు, భాగవతపురాణము 3: 12, 34, 37 లోను, హరివంశము 11,516 లోను, అథర్వవేదము 13: 4, 38 లోను, 19: 54, 3 లోను, 11: 7, 24 లోను ఇవి బ్రహ్మ ముఖమునుండి పుట్టెననియు, గాయత్రికి బుట్టెననియు, ఇంద్రునికి బుట్టెననియు, యజ్ఞమునుండి కలిగెననియు, కాలమునకు బుట్టెననియు, యజ్ఞశేషములనియు చెప్పుచున్నవి. ఛాందోగ్యోపనిషత్తు 4: 17 లో మొదటి మూడు వేదములును అగ్ని, వాయు, సూర్యులనుండి కలిగెనని యున్నది.

II. Divisions of the Vedas. వేదవిభాగము.—వేదములు నాలుగు ఇవి ఒకేకాలమునందు పుట్టినట్టివి గావు. వీటిని క్రమక్రమముగా నొకటివెంబడి యొకటిగా రచించియుండను లేదు. ఏలననగా వీటిలోని గడపటివాటియందలి కొన్ని భాగములు మొదటివాటియందలి కొన్నిభాగములకు బూర్వము పుట్టియుండెను. వేదములలో నొక్కొక్కదానికి మూడు భాగములు గలవు. అవి యేవనగా, (1) సంహిత లేక మంత్రభాగము. ఇది యతిపురాతన భాగము. ఇందు స్తోత్రములును గానములు నున్నవి. (2) బ్రాహ్మణము. ఇందు చాలవరకు వచనరూపములగు వ్యాఖ్యానములుండును. ఇది యజ్ఞములజేయువేళ సంహితల నుపయోగపరచవలసిన విధానమును తెలుపు గ్రంథము. (3) ఉపనిషత్తులు. ఇవి సంహిత నాధారముచేసికొని రచియించిన తత్వశాస్త్రములు. ఇందు అరణ్యములందు వాడుకొనవలసిన ఆరణ్యకములు గలవు.

III. The Rig Veda. ఋగ్వేదము.—వేదములన్నిటిలో నతిప్రాచీన గ్రంథము ఋగ్వేదము. ఇది నాలుగింటిలోను ప్రాముఖ్యమైనది. ఇది స్తోత్రములకును, గానములకు నిధియైయున్నది. ఋగ్వేదమనగా గీతావేదము. వేదములలో నొక్కొక్కదానియందలి గీతముల సముదాయమునకు సంహిత యని పేరు. ఈ

ఋగ్వేదము వరుసగావచ్చిన కొన్ని తరములవారి కార్యఫలితము. ఇందు వేరువేరు మతశాఖల భిన్నభిన్నాభిప్రాయములు కానవచ్చుచున్నవి. దీనియందు పదిమండలములు గలవు. మొదటి మండలము, ఎనిమిదవ మండలము, పదియవ మండలము ఈ మూడింటిని ముగ్గురు గ్రంథకర్తలు రచించిరి. తొమ్మిదవ మండలమందలి స్తోత్రములన్నియును సోమదేవతకు జెందియుండును. రెండవ మండలము మొదలుకొని యేడవమండలమువరకు గల భాగములకు భిన్నభిన్న యాజక కుటుంబములవారు కర్తలైయుండినట్లు కనుపించుచున్నది. ఋగ్వేదములోని పది మండలములలో గలసి 1,028 గీతములును, 10,000 కంటె నెక్కువగ మంత్రములును గలవు. క్రైస్తవ వేద గ్రంథమగు బైబిలులోని కీర్తనలగ్రంథమందు 2,256 వచనములుమాత్రము గలవు. పై చెప్పిన సూక్తములు లేక మంత్రములు ఆకాలపు ప్రధానదేవతలను, పితృదేవతలనుగురించి రచియించిన స్తోత్రములును, గానములునై యున్నవి.

IV. The Yajur Veda. యజుర్వేదము.—యజుర్వేదము యాగకర్మవిధానముల దెలుపునట్టి గ్రంథము. దీనియందుండెడు మంత్రము లనేకములు ఋగ్వేదమునుండి తీసికొనిరి. భిన్నభిన్నాభిప్రాయములుగల మతాచార్యులు దీనిని రెండు భాగములుగ విభాగించుకొనిరి. అందొకటి శుక్ల (తెల్లని) యజుర్వేదము మరియొకటి కృష్ణ (నల్లని) యజుర్వేదము. ఇందలి మంత్రములను, సూత్రములను యజ్ఞకాలమున హీనస్వరముతో జెప్పవలసియుండెను. ఈ వేదములోని యంశములనుబట్టి యప్పటికి హిందువుల మతసాంఘిక పరిస్థితులును, వారు నివసించుచుండిన దేశస్థితిగతులును మార్పు చెందియుండెనని మనము గ్రహింపగలము. కురుక్షేత్రము వారికి ముఖ్య నివాసస్థానమై యుండెను. విష్ణువును, ప్రజాపతియును వారి ప్రధానదేవతలై యుండిరి. రుద్రునికిగూడ నగ్రస్థానమిచ్చిరి. అతనికి శివుడు, శంకరుడు, మహాదేవుడు అను నామములిడిరి. కాలక్రమమున ఋగ్వేద దేవతలలోజేరిన జలదేవతలగు ఉపదేవతలు పరాక్రమముడిగిన యార్యుల దృష్టికి కామోద్రేకము గలిగించు దేవతాకన్యకలైరి. నానాటికి యజ్ఞయాగాది కర్మకాండ కేవలము బాహ్యాచారమాయెను. కావున రానురాను రామచిలుకవలె మంత్రములు చదువుటయును, శాస్త్రీయముగ కర్మలాచరించుటయును ప్రాముఖ్యవిధియై యుండెను. మతాచార్యులను దేవతలతో సమానులుగా నెంచిరి. దైవభక్తి పూర్తిగ అడుగంటుటచే, మంత్రతంత్ర శాస్త్రములయందాసక్తి మెండగుచుండెను. సుబ్బారాయుడు మొదలగు నాగుబాములను బూజింప నారంభించిరి. కులభేదములు జనులలో గట్టిగ బాదుకొనెను.

V. The Sama Veda. సామవేదము.—సోముడను దేవతకు జెందిన గీతముల గ్రంథము. సోమ యను మద్యము సోమలతనుండి తీసిన రసము. ఈ రసాధిపతిని సోముడని భావించిరి. ఈ వేదమందలి 1,549 మంత్రములలో 75 తప్ప తక్కినవన్నియు ఋగ్వేదములోనివే.

**VI. The Atharva Veda.** అథర్వవేదము.—అథర్వన్ యను నొక ప్రాచీన మహర్షిపేరు ఈ వేదమున కీయబడెను. ఇతడు పుల్లల రాపిడిచే నగ్నిని పుట్టించి, ఆ యగ్నిహోత్రమందు హోమముచేసి, తద్వారా దేవతలను తృప్తి పరచు యజ్ఞవిధానమును ప్రథమమున ఉపదేశించిన యథర్వణమహర్షియే యని ఋగ్వేదము చెప్పుచున్నది. సామవేదకాలమునకు గొన్ని శతాబ్దములకు బిమ్మట అనగా అథర్వవేదకాలమునందు కాశీప్రాంత మార్యులకు బ్రధాననివాసస్థానమై యుండెను. అరేబియాసముద్రమును, బంగాళాఖాతమును అప్పటికి వారు బాగుగా నెరిగియుండిరి. ఋగ్వేదములో నెచ్చటను లేని పెద్ద, చిరుతపులుల పేర్లు ఈ వేద కాలమున నార్యు లెరింగియుండిన ట్లగపడుచున్నది. కావున వారు బంగాళాదేశము లోను, గంగానదీ ప్రాంతములందునుండెడు అరణ్యములవరకు వ్యాపించియుండినట్లు కానవచ్చుచున్నది. కాని ఋగ్వేదములోని సింహనామ మీ గ్రంథమందు కానరాదు.

ఈ వేదకాలములోని మతమునకును, ఋగ్వేదకాల మతమునకును చాల భేదముకలదు. ఈ మతము హిందూదేశ యాదిమనివాసులగు కోలేరియనుల యొక్కయు, ద్రావిడులయొక్కయు సిద్ధాంతములను, ఆచారములను, అనుసరించి యుండెనని కొందరనుకొనుచున్నారు. గాని హైందవైరోపియనులు అవిభక్త కుటుంబముగ తమ మాతృభూమియందుండినప్పు డతిప్రాచీనకాలముననే పామరుల యొక్క నీచదేవతారాధనయును, వారి మూఢవిశ్వాసములును, ఆర్యులలో వ్యాపించి యుండెననియు, ఈ పురాతన పామరమతమును నిటీవల అథర్వవేదరూపముగ రచించి రనియును, మరికొందరభిప్రాయమైయున్నది. ఈ యథర్వవేదమతము ఆదిమ నివాసులమతమును, ప్రాచీనార్యులలో పామరజనులమతమును కలసిన యొక సంకర మతమనుట యుక్తియుక్తముగ నుండును. ఈలాగున నీ పైనచెప్పిన పండితుల భిన్న భిన్న యభిప్రాయములను సమన్వయము చేయవచ్చును.

ఋగ్వేదమును రచియించిన కాలముననే యథర్వవేద మంత్రములుగూడ నుండెను. కాని చాలకాలమువరకు నవి గ్రంథరూపముగ వెలువడియుండలేదు. చాలకాలమువరకు నార్యులచే నీ వేద మనాదరణచేయబడినను, ఋగ్వేదాది ప్రాచీనగ్రంథములతో బెనుగులాడి, పెనుగులాడి, తుదకు తన ప్రభావమువలన త్రివేదములతోబాటుగ తానుకూడ నగ్రస్థానమును వహించెను. ఈ ప్రకారముగ ననేక సంవత్సరములవరకు మొదటి మూడు వేదములతో సమానముగ నీ యథర్వ వేదమును గౌరవించకుండుటకు గారణము, అవిభక్త హైందవైరోపియనుల పామర మతభావములను, ఈ దేశ యాదిమనివాసుల మతభావములను, ఈ వేదమున సంగ్రహించియుండుటయై యుండవచ్చును. అయినను దీనిని బ్రమాణముగ నంగీకరించిన పిమ్మట దీనికి బ్రాహ్మణవేదమని పేరిడిరి. ఏలననగా ఇందలి తంత్రములును శత్రువులను నాశనముచేయు మంత్రములును బ్రాహ్మణులకు మిక్కిలి యుపయోగకరములై యుండెను.

ఈ వేదము మంత్రములును, తంత్రములును, దయ్యములను వెడలగొట్టు విధానములను, శత్రువులను సంహారించు సూత్రములను విశదీకరించుచున్నవి. వీటియందద్భుత శక్తి గలదని నమ్ముచున్నారు. భూత పిశాచ రాక్షస పీడాపరిహారము చేసికొనుటకును, విషజంతువులనుండియు క్రూరమృగములనుండియు కాపాడుకొనుటకును, విషూచి మశూచి జ్వరాది వ్యాధిబాధితులైనవారిని ఆరోగ్యవంతులుగ జేయుటకును, మంత్రములు ఈ వేదమందు కానబడుచున్నవి. కావుననే దీనికి శత్రుసంహార వేదమను నామ మీయబడెను. పిశాచ తంత్రవిద్యలు ప్రబలమాయెను. ఈ క్రూర దేవతల యారాధన ఘోరహింసలతో గూడియుండెను. ఇంతేగాక సర్పములను గోవులనుకూడ నారాధించెడివారు. ఈ యారాధనము చాలమట్టుకు గూఢమై గ్రహింప శక్యముగాకుండును. ఈ వేదములలో గొన్ని భాగములు విసుగుపుట్టించును. మరికొన్ని క్రైస్తవులకు నసహ్యాకరములుగ నుండును. ఈ వేదమందు 20 మండలము లున్నవి. స్తుతిగానములు 730, మంత్రములు 6,000 ఉన్నవి. వీటిలో 1,200 ఋగ్వేదమునుండి సంగ్రహించినవైయున్నవి. ఈ వేదము తక్కినవాటికంటె నూతనమైనదై యుండినను, ఇందలి మంత్రతంత్రప్రకరణము లతి ప్రాచీనములును, అజ్ఞానకాల మతాచారములు నగుటచే, ప్రస్తుతకాలమున నవి మూఢవిశ్వాసముగల పామరజనుల కత్యంత ఆకర్షణీయములైయున్నవి.

## C. THE VEDIC RELIGION. వేదకాలపు మతము.

I. Nature Worship. ప్రకృతిపదార్థముల నారాధించుట.—ఆర్యులు మిగుల సూక్ష్మబుద్ధియు, దైవభక్తియు గలవారైయుండిరి. వారు గంభీరమగు హిమవంతప్రాంతవాసులగుటచే, ప్రకృతి శక్తులయొక్క దివ్యప్రభావము వారి హృదయముల నాకర్షించెను. నలుదిక్కుల నావరించి నేత్రోత్సవము గావించు ననంతకోటి యద్భుత సుందరరూపముల ధరించి, ప్రకృతి మహాశక్తి వారి మనస్సులను దైవధ్యానముమీదికి మరలించి, వారియందు భక్తిబీజములు నాటెను. అమానుషప్రభావముగల పంచభూతములు వారి దృష్టికి మానవశరీరధారులుగ గాన్పించెను. వీటిని కోపప్రసాదాది గుణములుగల దివ్యపురుషులుగ భావించి, తేజోరాసులగు దేవతలని సంబోధించుచువచ్చిరి. ఆకాశపిత, సూర్యుడు, మేఘుడు, తుపానుదేవతలు, అరుణుడు, అగ్ని యెల్లయెడలను కానవచ్చుచుండుటవలన, ఆర్యులు వారిని పూజించుచు వారి ప్రీతికై యజ్ఞములు చేయుచుండిరి. ఇట్టివారికి దేవాలయములెందుకు? గనుక ఆ ప్రాచీనకాలమున గుడులు లేనేలేవు గాని యచ్చటచ్చట కొన్ని విగ్రహములుమాత్రముండెను. ఆ కాలపువారిమతము ప్రకృతిసంబంధమైన బహుదేవతారాధనమైయుండెను. విగ్రహములనుగూర్చిన ప్రస్తావన ఋగ్వేదము 2: 33, 9 లోను, 1: 25, 13 లోను, 5: 52, 15 లోను; ఇంద్రుని ప్రతిమలనుగూర్చిన ప్రస్తావన ఋగ్వేదము 8: 1, 5 లోను, 4: 24, 9, 10 లోను గలవు.

## II. The Gods. దేవతలు.

1. **Divisions of the Gods.** దేవతాగణములు.—దేవతాకోటిని హిందువులు త్రిగణములుగ విభాగించిరి.

(*a*) మొదటి గణమునందు జేరిన దేవతలు. పైనున్న జ్యోతిర్మండల నివాసులగు వరుణుడు, సూర్యుడు, సవిత్రుడు, విష్ణువు, ఉష, అదితి, ఆర్యమనుడు, మిత్రుడు, అశ్వినీదేవతలు.

(*b*) రెండవ గణమునందు జేరిన దేవతలు. మధ్యప్రదేశమగు వాయుమండలమునందుండెడు వాత, వాయు, ఇంద్ర, రుద్ర, పర్జన్య, మరుత్తులు.

(*c*) మూడవ గణమునందు జేరిన దేవతలు. క్రిందిది యగు భూమండలమునందలి అగ్ని, సోముడు, యముడు. వీరిలో నడిమి, క్రింది మండలములందుండెడు ఇంద్రుడు, అగ్ని, సోముడు మొదలగు దేవతానామములు వేదములందు తరుచుగా గానబడుచుండును. ఈ దేవతలందు నార్యులకు నెక్కువ ప్రీతి.

2. **Number of the Gods.** దేవతల సంఖ్య.—ఋగ్వేదము 1: 34, 11; 1: 45, 2; 7: 28, 1; 9: 92, 4 లలో ముప్పదిముగ్గురు దేవతలనుగూర్చి చెప్పియున్నది. గాని మరికొన్నిచోట్ల వారి సంఖ్య 3,339 (ఋగ్వేదము 3: 9, 9 లో) అని యున్నది. అంతేగాక ఋగ్వేదము 1: 28; 8: 47; 3: 53; 6: 75; 6: 28; 4: 27; 7: 103; 10: 97; 1: 162, 163; 10: 96; 1: 187; 4: 58; 1: 91; ఈ భాగములలో ననేక వాడుకవస్తువులను, సృష్టియందలి వస్తువులనగా రోళ్లను, బండ్లను, యుద్ధోపకరణములను, జంతువులను, వృక్షములను, యజ్ఞములను, దేవతలకు నర్పించు యాహారపదార్థములను, వెన్నను, మత్తుపుట్టించెడు సోమరసమును దేవతాస్వరూపులని భావించి యారాధించిరి.

3. **Description of the Principal Gods.** ప్రధాన దేవతానామములు, వారివర్ణన.

(*a*) **Dyaus Pitar and Prithivi.** ద్యౌస్ పితరుడును, పృథివియు.—"ద్యౌస్" యను పదము ప్రకాశించుట యను భావమిచ్చు "దివ్" యను పదమునకు సంబంధించియున్నది. ఆర్యులీ నామము ఆకాశమునకు అనగా ఆకాశపితకు బెట్టియుండిరి. వేదములకు బూర్వముండిన ద్యౌస్ పితరుడను ఆకాశపితను (అనగా గ్రీకుభాషలోని జీయూస్ పాటేరును, లాటిన్ భాషలోని జ్యూపిటర్‌ను) కొంతకాలమునకు మరిచిపోయినను, శ్రౌతమహాయుగ ప్రారంభమున నతడు దేవతలకు దండ్రియనియు, జగత్పతియనియు ననుకొనిరి. ఈ దేవతానామము వేదములకు బూర్వమార్యులు బహు దేవతలనుగాక నొక దేవతనే కొల్చుచుండిరని సూచించుచున్నది. ఈ ఏకదేవతారాధన యేసుప్రభువు "పరలోకమందున్న మా తండ్రి" యను నామమున దిరిగి వాడుకలోనికి దెచ్చెను. ద్యౌస్ పితర్ యను దేవత మధ్యాశియా పీఠభూములందలి యతి శీతల గడ్డిబయళ్లయందు నివసించువారికి నుత్కృష్ట దేవతయై

యుండెను. కాని హిందూదేశ యుష్ణప్రదేశములకు వచ్చినప్పుడు ఆర్యులాతనిని విసర్జించి, యతనికి బదులుగ సకల ప్రాణులకు జీవము నిచ్చుచు, చల్లని వర్షములు కురిపించు ఇంద్రుని తమ ప్రధానదేవతగా నెంచుకొనిరి.

పృథివి యనబడు భూమిని వారు దేవమాత యనిరి. ద్యౌసపితరతో పాటు భూదేవినిగూడ కొనియాడెడు గీతము లారుగలవు. ఆకాశపితయు, భూమాతయు ననాదిదంపతులనియు, వారికి తక్కిన దేవతలు పుట్టిరనియు నప్పటి జనులు నమ్మియుండిరి. విశాలవ్యాప్తియు, దీప్తియు గల ఆకాశదేవుడు ఫలవతియు, ఉదారవతియునగు భూదేవిని తన కౌగిట జేర్చగా వారిరువురును భార్యాభర్తలైరని ఐతరేయ బ్రాహ్మణము 4: 27 చెప్పుచున్నది.

(*b*) The Adityas. ఆదిత్యులు.—వీరు విశ్వరూపము, అనంతము, శాశ్వతము, అపారము—అను యర్థమిచ్చు అదితి యను దేవతయొక్క కుమారులు. వీరేడుగురు. వీరు దేవతలలో నత్యుత్తములు. వీరెవరనగా వరుణుడు, మిత్రుడు, ఆర్యమనుడు, సవితృడు, భగుడు, దక్షుడు, అంశుమంతుడు అనువారు. తర్వాత కొంతకాలమునకు ఇంద్రుని సూర్యునిగూడ నాదిత్యగణములో జేర్చిరి. వరుణుడు, మిత్రుడు అనువారు తక్కిన దేవతలకందరికి నాధారభూతులైయుండిరి.

(*c*) Varuna. వరుణుడు.—వరుణ యను పదము కప్పుట యను భావము నిచ్చు వర్ యను సంస్కృతక్రియనుండి పుట్టినది. వరుణ యను పదమునకు సర్వము నావరించియుండు నాకాశమని యర్థము. ఈ దేవత హైందవ యూరోపియను లేకకుటుంబముగ నుండినప్పుడారాధించుచుండిన ప్రాచీనదేవతలలో నొకడు. ఋగ్వేదదేవతలందతి గౌరవనీయుడైన యీ వరుణుని సృష్టికర్త యనియు, సంరక్షకుడనియు, అందరిని బరిపాలించెడు సర్వజ్ఞుడగు రాజనియు, ధర్మమును స్థాపించి కాపాడువాడనియు, పరమపావనమూర్తియనియు, ఋత యనగా ప్రకృతియంత్రమును నడుపువాడనియును, అధర్వవేదము 4: 16 లో నున్నట్లు దుష్టశిక్షకుడును, శిష్టరక్షకుడును, ఋగ్వేదము 1: 24 లో నుండులాగున పాపపరిహారకుడనియు నెంచి, ఆ దేవునకు స్తోత్రము లర్పించుచుండిరి. సూర్యుడును, నక్షత్రకోటియు నితనికి నేత్రములు. వాటిద్వారా భూలోకమున జరుగుచుండుదాని నంతయు గనిపెట్టుచుండెను.

కొన్నిసూక్తములందు వరుణునిగూర్చిన భావమును పాతనిబంధనయందలి యెహోవానుగూర్చిన భావమును కొన్నివిషయములలో దాదాపుగా నేకరీతిగా నున్నవి. వరుణునికిని వాని నారాధించువానికిని మిక్కిలి సామీప్యసంబంధ ముండెను. దృష్టాంతముగా ఒక సూక్తములో విరోధమేమియు లేకుండ మన మొకరితోనొకరము కలిసి నడచినప్పుడు మన ప్రాచీనస్నేహము లేమాయెను! అని వ్రాసియున్నది. మరొకదానిలో "నీ నిజస్నేహితుడొకడు నీకు విరోధముగా నేదైన పాపము చేసినను, ఓ వరుణా, అతడు నీ వింకను ప్రేమించుచున్న నీ స్నేహితుడే," అని కనబడుచున్నది. ఇది పాతనిబంధనయందలి కీర్తనలలో కనబడు మారుమనస్సునుగూర్చిన

సిద్ధాంతమువంటిది. ఇది ఋగ్వేదమునందలి వరుణునిగూర్చిన సూక్తములలో కొంత మట్టుకు కనబడుచున్నది.

శీతలప్రదేశములందుండు కాలమున నార్యులకు బరమపవిత్రుడును, ధర్మమూర్తియునగు నీ వరుణుడు ఇష్టదైవమై యుండినను, వారు ఉష్ణప్రదేశములగు యమునా గంగానదీప్రాంతములకు వచ్చినప్పు డీ దేవతయొక్క పరమోత్కృష్టగుణములు వారు సహింపజాలక పోవుటచే కాబోలు ఇతని నా యున్నతపదవినుండి తొలగించి యతి నీచమగు జలదేవతాస్థానమునకు ద్రోసివేసిరి. ఇతనికి హీనదశ వచ్చినతోడనే తత్పూర్వము హిందువుల మనస్సునకు గోచరించుచుండిన ఋతు, ధర్మము, ప్రపంచక్రమము—ఈ మూడింటిని గూర్చిన గంభీరభావమంతయు నంతరించిపోయెను. అందుచే దేవతలుకూడ మానవులవలె ధర్మసూత్రములకు లోబడినవారేయనియు, ధర్మము ననుసరించుటయు, అధర్మమును విసర్జించుటయు దేవతలకును మానవులకును విధియనియు, హిందువుల కంతగ విశదపడియుండలేదు.

(*d*) Mithra. మిత్రుడు.—ప్రాచీనకాలమునుండియే వరుణునితో కలిపి మిత్రునారాధించుచుండిరి. ఇతడు మనుష్యులు సత్యము పలుకుటకును, తమ వ్యాపారములను యథార్థముగ జరిగించుటకును, మనుష్యులు వెలుగులో నడచి నమ్మకముగా నుండుటకును సహాయముచేయు దేవుడు. ప్రారంభమున మిత్రుడు పూర్యతేజస్సయి యుండెను. కావున నితడు కాలక్రమమున సమస్తము నావరించియున్న ఆకాశమగు వరుణునితో నేకమాయెను. ఐరేనియనులు సహ మిత్రుని పూజించిరి. తరువాత జొరాస్టరితనిని గౌరహీనముగా నెంచెను. అయినను పిమ్మట రోమియాయు లితని నొక దేవతగా స్వీకరించిరి. ఆ రాజ్య యుద్ధభటు లతని బహు గౌరవముగా నెన్నుకొనిరి. క్రీ. వె. 100—300 వరకు ఆ రాజ్యములో నతడు బహు ప్రఖ్యాతి నొందినందున మిత్రు నారాధించువారికిని, క్రీస్తునారాధించువారికిని గొప్ప పోరాటము కలిగెను.

(*e*) Indra. ఇంద్రుడు.—ఇతడు ద్యౌస్ పితరుని కుమారుడు. అగ్నిదేవుడును ఇంద్రుడును కవలబిడ్డలు. వాయుమండల అధిపతి, అనంతశక్తిమంతుడు, ఊరిమెడువాడు, అను ఈ నామములుగల ఇంద్రుడు ఋగ్వేద దేవతలందరిలో సర్వజనప్రియుడై యుండెను. వర్షము నాటంకపరచు అహి, లేక వృత్ర అను రాక్షసునితో బోరాడి తన యురుములతోను, మెరుపులతోను, భయంకరుడగు రుద్రదేవుని పుత్రులగు మరుత్తుల సహాయముతోను, ఆ రాక్షసుని జయించి యెండిపోయిన భూమిపై వర్షము కురిపించుట యితని ముఖ్యకార్యము. ఇంద్రుడు తన యాయుధముతో కొట్టినప్పుడు ఆ దెబ్బలుతినిన రాక్షసుని గర్జనములే యురుములట. ఈ విధముగా ఇంద్రుడు యుద్ధదేవు డాయెను. ఆర్యులకు నాయకుడై, హిందూదేశమును జయించుటకు సహకారియగుచు, వారిని జయోత్సవముగా నడిపించుచుండెను. ఇతడు సోమపానప్రియుడును, కామాసక్తుడును, మహా బలశాలియునై యుండెను. గాని ఇతడు లోకమిత్రుడుగను, పరోపకారిగానున్నాడు. ఈ దేవుడు మేరుపర్వత

మందున్న దేవగాయకుల కధికారియై దేవతలకు నమృతము నిచ్చి, ఆనందగానములచే వారి నానందింప జేయుచుండువాడు. అమరావతి యను నతని పట్టణమునందు మానవ హృదయముల నాకర్షించి, వారిని దుర్మార్గవర్తనులుగ జేయుచుండు అప్సరస లను దేవకన్యకలు గలరు.

(*f*) Agni. అగ్ని.—ఇతడు ప్రధానదేవతా గణములో రెండవవాడు. వేద ములలో నొక ఇంద్రునికి తప్ప తక్కిన దేవతలలో నెవనికిని ఇతని పేరటనుండు నన్ని గీతములు లేవు. ఇతడు యజ్ఞవేదికయొద్ద రెండు పుల్లల రాపిడివలనను నల్లని కఠిన శిలలనుండియు పుట్టెడువాడు. కాని యితడు జ్యోతిర్మండలమందలి సూర్యుని యందును, మెరుపునందునుగూడ వసించియుండెను. త్రివిధ జన్మముగలవా డగుటచే ఋగ్వేదము 3: 26, 7 లోను, 3: 16, 11 లోను, 3: 3, 7 లోనున్న రీతిని నితడు పరమపవిత్రుడని భావించిరి. ఇట్లితడు మూడు జ్యోతులుగల త్రివిధరూపు డని యెంచియుండిరి. ఇతడు దేవతలకును మానవులకును బురోహితుడైయుండి, హోమద్రవ్యములను స్వర్గమునకు గొనిపోవుచుండెను. ఇత డిహపరలోకములకు మధ్యవర్తియైయుండెను. రాత్రికాలమందు భయోత్పాతములను పారదోలుటకు అగ్ని దేవుడు మాత్రమే భూమిపైనుండెను.

(*g*) The Sun-God. సూర్యదేవుడు.—ఇతడు ద్యౌసపితరుని పుత్రుడు. ఇతడు తెల్లని గిట్టలుగల యెర్రని గుర్రము లేడింటిచే లాగబడు రథమునెక్కి యాకాశమార్గమున సంచరించును. అశ్వినీదేవత లితనికి రథసారథులు. ఇతడు గొప్ప ప్రభావముగలవాడు. ఇతనికిగల వేరువేరు రూపములనుబట్టి యితనికి భిన్న భిన్న నామములు కలిగెను. అవేవనగా: సూర్యు డనగా తేజోరాశి; సవిత్ర డనగా జీవింపజేయువాడు; పూషణు డనగా గొల్లలదేవుడు; విష్ణు వనగా అనంతశక్తిమంతుడు; భగు డనగా వర్షములనిచ్చువాడు. ఉషస్సు అను దేవి యితనికి తల్లియు భార్యయునైయుం డును. ప్రతిదిన మామె పుట్టుచుండుటచే, సర్వదా యౌవనవతిగా నుండెనని ఋగ్వేదము 3: 61, 4; 7: 63, 3; 1: 115, 1, 2 లో గనబడుచున్నది. ఆ కాలమునను నార్యు లింకను ఉత్తర శీతలప్రదేశములందే నివసించుచుండినందున వారు ఋగ్వేదము 4: 54, 2 లో నున్నట్లు అతనిని మిత్రునిగ భావించుచుండిరి. కాని వారు హిందూదేశములో మలమల మాడ్చెడు ఉష్ణ సమప్రదేశములకు చేరినపిమ్మట అధర్వ వేదములో జెప్పియుండులాగున నతనిని మృత్యు వనుచుండిరి. మరికొంతకాలమున కతడు త్రిమూర్తులలో నొక డాయెను. విష్ణు అగ్ని వాయుదేవతల తోబాటుగ నొకడైయుండెను. కాని త్రిమూర్తులలో నొక డగు శివుని నామ మీ వేదమం దెచ్చటను గానరాదు. ఇంక కొంతకాలమైనపిమ్మట యీ నామము ఋగ్వేదములో గర్జించువాడును, వినాశకుడును, తుపానుదేవతయు నగు రుద్రదేవత నామమునకు బదులుగా వాడియున్నారు.

భక్తిపరుడగు ప్రతి హిందువుడును, ప్రతి యుదయమున లేచి, తూర్పువైపుగ దిరిగి, ఋగ్వేదము 3: 62, 10—12 లో నున్నట్లు రెండు చరణములుగల గాయత్రి

లేక సావిత్రి యను మంత్రమును సూర్యదేవునిగూర్చి జపముచేయును. రెండు పాద ములుగల నీ మంత్రము ఋగ్వేద మంత్రములన్నిటిలో బవిత్రమైనది. దీనిని జపించుటవలన ఋగ్వేదము యావత్తును పఠించుటవలన గలుగు ఫలము లభించునని హిందువులు నమ్ముదురు. ఈ విషయమై స్కాందపురాణము "వేదములలో గాయత్రికి మించిన మంత్రమును, దానికి సమానమైన ఉపాసనయు లేనేలేవు" అని చెప్పు చున్నది. ఈ ద్విపాద మంత్ర మీ క్రిందివిధముగా నున్నది.

ఓం, భూః, భువః, స్వః (సువః), తత్సవితుర్వరేణ్యం భర్గోదేవస్య ధీమహి । ధియోయోనః ప్రచోదయాత్ ॥ దీని యర్థమేమనగా: ఏ దేవుడు మాయొక్క బుద్ధి వృత్తులను (ఆయా విషయములను గ్రహించుటకు) ప్రేరేపించునో (అట్టి) ప్రేర కుడును, పరమేశ్వరునియొక్క దివ్య తేజస్సునగు సూర్యుని ధ్యానించుచున్నాము.

(*h*) Soma. సోముడు.—సోమలతనుండి తీసిన రసమునకు సోమయని పేరు. ఇది మత్తుపదార్థము. ఈ రసమును దేవతగా నెంచి సోముడు అను పేరుపెట్టిరి. దేవత లును, మానవులును దీనియం దాశగలిగి త్రాగుచుండిరి. దేవతలకుకూడ ఇది త్రాగుట వలననే అమరత్వము గలిగెను. సోమ యను నామమునకు బ్రతిరూపమగు హావోమ యను నది జెండవెస్త యను గ్రంథములో గానవచ్చుచున్నందున నితనిని వేదపూర్వ కాలపు దేవత యనదగును. ఋగ్వేదములోని తొమ్మిదవ మండలమంతయును, ఇతర భాగములలోని మరికొన్ని సూక్తములును సోమునికి చెందుచున్నవి. వేదములలో గొన్నిచోట్ల నితడే చంద్రుడు అని యున్నది. ఇతనికి ముప్పదిముగ్గురు భార్యలు. వారందరును ప్రజాపతి కుమార్తెలు. ఇతడు వీరిలో రోహిణి యను నామెను నెక్కు వగ బ్రేమించినందున, ఇతడు క్షయవ్యాధిగ్రస్తుడయ్యెను. అందుచే చంద్రునికి వృద్ధిక్షయములు గలుగుచున్నవని వారనుకొనిరి.

(*i*) The Asvins. అశ్వినీదేవతలు.—వీరు స్వర్గలోకమందలి వైద్యులును, గుర్రపు రౌతులునైయుండిరి. వీరు అరుణోదయమునకు నివిటీలుం పట్టు కాలినడిగల దీపవాహకులు. వీరు సూర్యుని కవలబిడ్డలు. వీరికిద్దరికి భార్య యొక్కతే. దీనినిబట్టి యా పురాతనకాలమునందు నొక స్త్రీకి యనేక భర్తలుండిరని మన మూహింప వచ్చును.

(*j*) Brihaspati. బృహస్పతి. — ఇతనికి బ్రహ్మణస్పతియని మరియొక నామముగలదు. ఇతడు త్రిమూర్తులలో బ్రహ్మయాయెను. ఇతడు దేవతలకు బురో హితుడు.

(*k*) Prajapati. ప్రజాపతి.—ఇతడు సృష్టికర్త. బ్రాహ్మణములలో నితని గూర్చిన వర్ణనలనుబట్టి యితడు సగము మర్త్యుడుగను, సగము అమర్త్యుడుగ నుండెను. మర్త్యభావమున నితడు మరణమునకు భయపడెను. అయిన నితడు దేవతలకొరకు దన్ను బలిగా నర్పించుకొనెను.

(*l*) Visvakarma. విశ్వకర్మ.—ఇతడు విశ్వమును లేక ప్రపంచమును నిర్మించినవాడు. ఇతడు దేవతలకు శిల్పియైయున్నాడు. ఇతడు దేవతలకు నాయుధములను జేసెను. వాటిలో గొన్ని ఇంద్రుని భయంకరములగు పిడుగులు.

(*m*) Purusha. పురుష.—ఇతడే యాదిపురుషుడు. ఇతడు దేహధారియై తన్ను తాను బలిగా నర్పించుకొనగా ఇతనిలోనుండి విశ్వమంతయు నుద్భవించెను.

(*n*) Vak. వాక్కు.—వాక్కు అనునది యొక దేవి. ఈమె యోహాను 1: 1—4, వచనములలోని దేవుని వాక్య సూచకమైయున్నది. క్రీస్తునకుగల మూడు లక్షణములు—నిత్యుడగు పురుషుడు, ఆదివాక్కు, సృష్టికర్త—అనునవి పురుష, వాక్కు, ప్రజాపతి యను నీ ముగ్గురియందు వరుసగా గలవు.

(*o*) Yama. యముడు.—మృత్యువు నోటపడినవారిలో నితడు మొదటివాడు. ఇతడు దేవతలతోగూడ నివసించుటకు దేవలోకమునకు వెళ్లెను. మృతులందరు నితనికడకు పోవుదురు. వారు యమపురి జేరుటకు నాలుగుగంటల నలుబది నిమిషములు పట్టును. గనుక ఈ కాలములోగా శవములను దహనముచేయగూడదు. పిదప కొంతకాలమునకు ఇతడు నరకలోకమునకు రాజయ్యెను. యమి యను నామె యితనికి దోబుట్టువు. ఈమెయే యితనికి భార్యగానుండెను. వీరిరువురు సేకమగుటవలన మానవులు జన్మించిరి. ఆదియార్యులు ఒకే పరలోకమును, ఒకే నరకలోకమును గలవనినమ్మిరి. కాని ప్రస్తుతకాలమున మోక్షలోకము లయిదు గలవని హిందువులు నమ్ముచున్నారు. అవేవనగా:—ఇంద్రుని స్వర్గము, శివుని కైలాసము, విష్ణుని వైకుంఠము, కృష్ణుని గోలోకము, బ్రహ్మాయుండే బ్రహ్మలోకము. ఇవిగాక నరకలోకము లిరువదియొకటి గలవు. వాటికన్నిటికిని యముడే యధిపతి.

(*p*) Ka. కా.—దేవతలలో నుత్తముడెవడో యను విషయమునుగూర్చియు, అగోచరుడగు దేవునిగూర్చియు తెలిసికొనవలయునని యార్యులకు గలిగిన కోరిక నుండి యీ దేవత పుట్టెను. "కా" యనగా నెవడో లేక తెలియనివాడని యర్థము.

(*q*) Visvedevas. విశ్వేదేవతలు.—ఈ దేవతలలో నిద్దరిని కలిపి స్తోత్రము చేయుచున్న కొన్ని వేదసూక్తములు గలవు. కాని మరికొన్ని వీరినందరిని గలిపి విశ్వేదేవా యను నామముచే గొనియాడుచున్నవి.

(*r*) The Pitris. పితృదేవతలు.—మనము వర్ణించునాటికి బితరుల నారాధించుట సర్వసామాన్యమైయుండెను. ఆర్యులు తమ పితృదేవతలకు బలు లర్పించి వారిని బ్రార్థించుచుండిరి.

మృతినొందిన పితరు డదృశ్యలోకమునకు బోయి పితృదేవతయై తన కుటుంబమును రక్షించుచుండు ననెడి నమ్మిక ఆర్యులకుండెను. కుటుంబమునకు బ్రధానుడగుటచే నతడు చనిపోయినపిమ్మటగూడ దన గోత్రికుల యోగక్షేమముల విచారించుచు, వారిని కాపాడుచుండెను. వేదములయందలి భూస్థాపనాది ప్రేతసంస్కారము

లన్నియు నార్యులు తమలో మృతినొందినవారి నెక్కుడగ గౌరవించుచుండిరని తెలుపుచున్నవి. ప్రేతసంస్కారకాలమున వారు కొన్ని మంత్రముల జదువుచుండిరి. కాని బ్రాహ్మణముల కాలమున ఈ మంత్రముల నప్పటికి వాడుకలోనికి వచ్చిన దహనసంస్కారమునకు దగినట్లు మార్చి చెప్పుచుండిరి.

దహనాది సంస్కారము లైనపిమ్మట వారు శ్రాద్ధకర్మలు చేయుచుండిరి. ఈ యుత్తరక్రియలు చనిపోయినపిమ్మట పండ్రెండు పదమూడు దినములవరకు జరుగును. శ్రాద్ధకాలమున మృతులైనవారి ప్రేతల నాహ్వానము చేయగా కర్మ చేయు స్థలమునకు వచ్చెదరు.

ఈ యుత్తరక్రియల యుద్దేశ మేమనగా, వీటిలో నిచ్చెడు పిండములద్వార ప్రేత కొకవిధమైన సూక్ష్మశరీరము గలిగించుటయే. ఇట్టి దేహమును బొందనిపక్షమున మృతుని జీవాత్మ యపవిత్రమగు ప్రేతరూపమున—అనగా పిశాచమై యెట్టి శాంతియు లేక సదా దుఃఖములలో మునిగియుండును. కాని యీ పిండప్రదానమువలన లభించు దేహముద్వార ప్రేత పితృదేవత యగును. ఉత్తరక్రియలలో మొదటి పది దినములయందు నర్పించెడు నాహారముచే గలిగిన యీ నూతనదేహ మింకను రెండు దినములు భుజించుటచే సత్తువ పట్టి పదమూడవనాడు ఆ శరీరముతో మహా భయంకరమైన యమలోకయాత్రకు బయలుదేరును. ఈ శ్రాద్ధకర్మ క్రమముగా నొక సంవత్సరకాలమువరకు బ్రతినెలయు జేయవలెనుగాని యటుతర్వాత సంవత్సరమున కొకసారిమాత్రమే చేయుదురు.

గరుడపురాణమునందు క్రమమైన యుత్తరక్రియాహీనుడై మృతినొందినవాడు 2,58,000 మైళ్ల దూరముననున్న యాతనస్థానములకు దినమునకు 600 మైళ్లచొప్పున ప్రయాణము చేయవలసి యుండుననియు, మార్గమున నతని యాత్ర విశ్రాంతిలేక యుండు ననియు, మలమలమాడ్చు నెండయు, గడగడ వణికించు శీతవాయువులును బాధించుననియు, అడుగడుగునకు ముండ్లవలనను, భయంకర మృగములవలనను, సర్పములవలనను, తేళ్లవలనను దురవస్థ పడుచుండుననియు చెప్పుచున్నది. మరియు నీ జీవుడు గుంటలలోను, అంధకారబంధురమై జలగలతో నిండిన బురదనీటిలోను బారి పడుచుండు ననియును జెప్పుచున్నది. సగము దూరమున 300 మైళ్ల విశాలము గలిగి, మిక్కిలి లోతైన వైతరణీనది కలదు. రక్తముతో నిండియున్న యీ నదియందనేకచోరచేపలును, మొసళ్లును సంచరించుచుండును. నదికిపైగా గ్రద్దలెగురుచుండును. ఈ ప్రేత దప్పిగొనుటచే ఈ రక్తమును త్రాగవలసివచ్చును. అంతట ఆ నదిలోనుండి యగాధమగు నరకకూపములోబడి యమకింకరుల హింసలకు లోనగును. పై నుదహరించిన యంశములనుబట్టి దేవతలలోగూడ మనుష్యులలోవలె గొందరు సద్గుణవంతులనియు, కొందరు దుర్గుణవంతులనియు కనబడుచున్నది. కాని వారు మానవులను మించిన వారని జనులు నమ్మియుండిరి. అయితే ఆ ప్రాచీనదేవతలు తర్వాతవచ్చిన దేవతలకంటె నత్యుత్తములని మనకు విశదముకాగలదు. దేవుడు మానవులవలెగాక సదా పరిశుద్ధుడై యుండవలెనని హెబ్రీ క్రైస్తవ సత్యవేదములు

చెప్పుచున్నట్లు గాక, హైందవవేదములలో నొకచోట బరిశుద్ధమూర్తులుగ వర్ణింపబడిన దేవతలే సామాన్యమానవులవలె దుష్టస్వభావముగలవారుగ జూపబడిరి. కావున దేవుడు సర్వకాలమందును పోటు పాట్లులేక నిష్కళంకుడుగ నుండవలెనను సత్యము ప్రాచీనార్యులు గ్రహించినట్లు కనబడదు.

III. Demons. భూతగణములు.—అప్పటిజనులు భూతములకు నమితముగా భయపడుచుండిరి. ఈ దుష్టవర్గమునుగూర్చిన నమ్మిక వారికి నెక్కువగుచుండెను. వీ రతిబలాఢ్యులు, బహు క్రూరులు, హింసాత్మకులు. వీరికి అసురులు, రాక్షసులు, దస్యులు అను నామములు గలవు. ఈ రాక్షసులు రాత్రులందు చీకటిలో సంచరించుచు నరులకును, దేవతలకును శత్రువులైయుండిరి.

IV. Tendencies toward Monism. అద్వైతమత సూచనలు.—ఆయా దేవతల నారాధించువారు తమ దేవతకూడ తదితరదేవతలవలె దివ్యశక్తులు గలిగి యున్నాడనియు, వారు చేయు కార్యములే తమ దేవతకూడ జేయగలడనియు నమ్ముచుండిరి. ఈలాగున నార్యులు కొన్నికొన్ని విషయములలో దాము పూజించు దేవతలలో నంత యెక్కువ భేదములేనట్లుగా భావించిరి. ఈ దేవతలందరు భిన్నభిన్నమూర్తులుకారని చూపుటకు 'విశ్వేదేవా' యని, వీరినందరిని నొక దేవతగానెంచి యారాధించుచుండిరి. దేవతలందరు నేకమైయుండి రను భావము నానాటికి దృఢమగుచు తుదకు ఋగ్వేదము 1: 64 లో "ఒకే యాత్మపదార్థమును అనగా పరమాత్మను ఋషులు వేరువేరు నామములచే బిలుతురు," అను మంత్రరూపముగ బహిరంగమాయెను. అప్పుడప్పుడు వారు సర్వదేవతాస్వరూపుడగు నొక దేవుడు గలడని నమ్మినట్లు కానబడును. కాని మరికొన్ని సమయములందు బ్రతిదేవతయు సర్వోన్నతుడనియు, సర్వోత్కృష్టుడనియు, నమ్మినట్లు కనబడుచున్నది. ఈ విధమున బ్రతి యారాధకుడును, తన యిష్టదేవతయే యుత్కృష్టుడనియు, తదితరదేవతలు తన దేవతకంటె తక్కువవారనియును నెంచుచుండెను. ఈ విషయమునుబట్టి చూడగా బహు దేవతారాధకులగు ఋషులలోగూడ ననేకులు దేవతలందరికి నాధారభూతుడును, సృష్టికర్తయు, సంరక్షకుడును, ప్రపంచమంతటిమీద నధికారముగల సర్వజ్ఞుడు నగు బరమాత్ముడొకడు గలడను భావము గలిగియుండిరని రుజువగుచున్నది. ఇట్టి యాత్మను వారు సగుణస్వరూపియగు ప్రత్యక్షపురుషునిగా నెంచిరి గాని యితడు కాలాంతరమున వేదాంతశాస్త్రము చెప్పుచున్న నపుంసకశబ్దమగు నిర్గుణబ్రహ్మమని తలంచరాదు. సర్వాంతర్యామియు, సర్వసృష్టికి భిన్నుడైనవాడును, సగుణమూర్తియు నగు క్రైస్తవదేవునితో వేదములు వర్ణించుచున్న సగుణబ్రహ్మమును పోల్చి చూడుడు.

V. Sacrifices. యజ్ఞములు.—ఋగ్వేదమతము భక్తివిశ్వాసములతోగూడిన స్తోత్రములతోను, యజ్ఞములతోను కలగాపులముగ నున్నది. ఋగ్వేదమంతయు గానరూపమగు సూక్తముల సముదాయము. ఇది పద్యకావ్యమువంటిది. దీని ముఖ్యోద్దేశము, బ్రాహ్మణయాజకులకు నధికార మిచ్చుటయు, ఆరాధకులగు సామాన్యజనుల యొద్దనుండి ధనము సంగ్రహించుటయునై యున్నదని స్పష్టమగుచున్నది. అయిన

నిందలి స్తోత్రములలో గొన్నిటిని యజ్ఞాదులయందు నుపయోగించుటకు గాక కేవలము పారాయణచేయుటకే వ్రాసియున్నారు. యజ్ఞ యాగాది కర్మాచరణమందును, సూక్తపఠనమందును అతి శ్రద్ధాభక్తులు చూపుచుండిరి. యజ్ఞములందు దేవతలకు నర్పించవలసిన ద్రవ్యము లేవనగా—పాలు, వెన్న, పెరుగు, సోమరసము, గొర్రెలు, మేకలు, దున్నపోతులు, ఎద్దులు. ఇంతేగాక గోమేధమందు ఆవులను, అశ్వమేధమందు గుర్రములను, పురుషమేధమందు నరులనుగూడా బలిగా నర్పించెదరు. ఇట్టి బలులను పాపపరిహారమునకును, ధనలాభమునకును నర్పించుచుండిరి. కాలక్రమమున నీ స్తోత్రములకును, అర్పణలకును అద్భుతశక్తులు గలవనియును వీటిచే నారాధకులు తమ కోరికల నిచ్చుటకు దేవతలను బలవంతపెట్టవచ్చునని యును నమ్మిరి.

VI. Priests. యాజకులు.—వీరు బహు సమర్థులనియు, దివ్య జ్ఞానులనియు దేవతలను తమ యధీనమునం దుంచుకొనగల శక్తి సామర్థ్యవంతు లనియు, ప్రాచీన హిందువులు నమ్మిరి. రాజపురోహితుడు యాజకులందరిలో గొప్పవాడైయుండెను. తక్కిన యాజకు లెవరనగా: (1) హోత్రులు అనగా ఋగ్వేదసూక్తములు చదువువారు; (2) ఉద్గాతలు, అనగా సామవేద మంత్ర గాయకులు; (3) అధ్వర్యులు అనగా యాగకర్తలు. వీరు అధర్వవేదములోని యజ్ఞసూత్రములను హీనస్వరమున పఠించువారు. ఇట్లు మూడు తరగతులైయుండిరి. సుమారు శ్రౌతమహాయుగాంతమున ఆరు యాజకసమాజము లుండెను. ఇందొక్కొక్క తెగవారు నొక ప్రత్యేక వేదసూక్తభాగమును పాఠముచేయుచుండిరి. ఈ యారు స్తోత్రప్రకరణములను పిదప గొంతకాలమునకు ఋగ్వేదమందలి రెండవ, ఏడవ, మండలములాయెను. ఋగ్వేదభాష రానురాను సామాన్యజనులు గ్రహింపలేకపోగా అద్భుతశక్తిగల ఈ మంత్రోచ్చారణ బ్రాహ్మణులకే విడిచిపెట్టిరి. హిందూదేశ మతాచార్యులవలె నిన్ని శతాబ్దములు మరేదేశ మతాచార్యులును మితిమీరి సర్వాధికారము వహించియుండినట్లు కానవచ్చుటలేదు.

# మూడవ యధ్యాయము

# CHAPTER III

## బ్రాహ్మణ మతాంతర్భాగమగు నాచార కర్మకాండము

## Ritualistic Brahmanism

A. DIVISIONS. విభాగములు.—ఇంతకుముందటి యధ్యాయమందు వర్ణించిన వేదమతమునకు తర్వాతిది బ్రాహ్మణమతమని చెప్పవచ్చును. కాని దీనినే ఆర్యులమతమగు నార్యధర్మమనియు, వేదమతమగు వేదధర్మమనియు, ప్రథమమున ఋషులయొద్దనుండి పారంపర్యముగా వచ్చుటచే ఋషిసంప్రదాయ ధర్మమనియు బ్రాహ్మణులనుచున్నారు. ఈ బ్రాహ్మణమతము మూడు వేరువేరు విధముల నభివృద్ధియగుచు వచ్చెను. అవేవనగా: (*a*) బ్రాహ్మణములలో గానవచ్చెడు ఆచార కర్మకాండతోగూడిన బ్రాహ్మణమతము. (*b*) ఉపనిషత్తులలోను, ఆరణ్యకములలోను, తత్వసిద్ధాంతము లారింటను కానవచ్చెడు తత్వజ్ఞానముతోగూడిన బ్రాహ్మణమతము. (*c*) మానవ ధర్మశాస్త్రములోను తదితర ధర్మశాస్త్రములలోను వివరించినట్లు శాస్త్రవిధులతోగూడిన బ్రాహ్మణమతమును.

B. HISTORY. చరిత్ర.—ఇప్పుడు మనము వర్ణించు బ్రాహ్మణమతకాలమునందు ఋగ్వేదమునాటి కేవలము ప్రకృతిపదార్థముల నారాధించుట, ప్రస్తుత కాలపు హిందూమతరూపమునకు మారుచున్నట్లగుపడును. ఉత్తర హిందూస్థానమంతటను ఆర్యులు తమ నాగరికతను, అధికారమును, మతమును వ్యాపింపజేసిరి. హిందూదేశములోని యనార్య మతాచారములలో ననేకములను తాము స్వీకరించి ఈ అనార్యులను నాలుగవ జాతివారిలో జేర్చుకొనిరి. దేశమందంతట ననేక చిన్న రాజ్యములేర్పడెను. వారు క్రయవిక్రయములయందు నేర్పరులై బహుదూరమున నుండిన బబులోను దేశస్థులతోకూడ వ్యాపారము జేయుచుండిరి. ఆ బబులోను దేశీయులవలన తమ భాషను అక్షరరూపముగ లిఖించు పద్ధతిని నేర్చుకొనిరి.

స్త్రీలు పురుషులకన్న తక్కువవారను భావము వారికి కలిగినందున స్త్రీలతో బురుషులు కలసి భోజనముచేయుట మానుకొనిరి.

ఆ కాలమున ఏలీయా ఇశ్రాయేలులోను, యెషయా యూదాలోను ప్రసిద్ధులగు ప్రవక్తలై బోధించుచుండిరి.

C. THE BOOKS. గ్రంథములు.—ఇవి బ్రాహ్మణములును, సూత్రములును.

I. The Brahmanas. బ్రాహ్మణములు.

1. Number of Brahmanas. వాటి సంఖ్య.— ప్రాచీన యార్యమత మెట్లు శాఖోపశాఖలుగ విస్తరించెనో బ్రాహ్మణములలో ముఖ్యముగా గాన్పించును. నాలుగువేదములలో నొక్కొక్కదానితో నొక బ్రాహ్మణముగాని యంతకంటె నెక్కువగాని చేరియుండును. ఋగ్వేదమునకు రెండు బ్రాహ్మణములు గలవు. వాటిలో ఐతరేయబ్రాహ్మణ మన్నిటికంటె బురాతనమైనది. కృష్ణ యజుర్వేదమునకు తైత్తిరీయబ్రాహ్మణమును, శుక్ల యజుర్వేదమునకు శతపథబ్రాహ్మణమును గలవు. శతపథబ్రాహ్మణమన్నిటిలో ప్రధానమైనది. ఇటీవల పుట్టినవాటిలో నొకటిగాను యున్నది. సామవేదమునకు పంచవింశ, తళావకర, తాండ్యబ్రాహ్మణములు మూడును, అధర్వవేదమునకు గోపథబ్రాహ్మణమొకటియును గలవు. తక్కిన బ్రాహ్మణములు నశించిపోయెను.

2. Date. అవి లిఖితములైన కాలము.— బ్రాహ్మణములు వేదసంహితలకు వెనుకటికాలమందు వ్రాయబడినవైనను వీటిని వేదముల యంతర్భాగములని యెంచిరి. కావున వీటిని నాలుగువేదములయందలి మంత్రభాగములతో జేర్చిరి. మొట్టమొదట కఠినవిధులు లేక ప్రాచీనార్యులు స్వేచ్ఛగా ప్రకృతిపదార్థముల నారాధించుచు, తుదకు కేవల బాహ్యాచారములలోనికి దిగినవారలై, మానవకల్పిత కర్మకాండ యను సంకెళ్లతో దమ్మును బిగించుకొన నారంభించినకాలమున నీ బ్రాహ్మణములు తలచూపియుండును. కనుకనే ఈ గ్రంథములను ఋగ్వేదముకంటె ననేక శతాబ్దములకు దరువాత రచియించియుండవలెను. ఈ కాలము క్రీ. పూ. 800—500 సంవత్సరముల మధ్యనై యుండవచ్చును. బైబిలుగ్రంథములోని లేవీయకాండమునకు కీర్తనల గ్రంథముతో నెట్టి సంబంధము గలిగియున్నదో యట్టిదే బ్రాహ్మణములకును వేద మంత్రములకును గలదు.

3. Characteristics. బ్రాహ్మణముల లక్షణములు.— బ్రాహ్మణములందు యజ్ఞకర్మవిధానమును, ఆరాధనక్రమమును, తదితరకర్మల నాచరించువిధమును దెలుపు సూత్రములును గలవు. కావున దేవతాకార్యమందు వినియోగించు గ్రంథమునకు బ్రాహ్మణమని పేరుపెట్టిరి. దేవతాకార్యమనగా మంత్రములు, స్తోత్రములు, హోమద్రవ్యములు వీటిని నర్పించుట. ఈ గ్రంథములందు బ్రాహ్మణులు చేసెడు యజ్ఞయాగాది కర్మలనుగూర్చియు, దేవతలనుగూర్చియు వచనరూపముగు నుపన్యాసములు గలవు. ఇందు యజ్ఞవిధులును, వాటి యుద్దేశములును, వ్యాఖ్యానములును, శూరశిఖామణులనుగూర్చిన గాథలును, తర్క తత్వశాస్త్రవాదములును గలవు. ఈ కాలమున బుద్ధిశాలురగు పండితులు తమ కాలమునంతయు కేవలము యజ్ఞయాగాది కర్మకాండయందే గడుపుచుండిరి. యజ్ఞము అను మాటకు బ్రాహ్మణములలో వాడి నన్ని పదములు యూదుల గ్రంథములలోగూడ కానరావు. బ్రాహ్మణములను గూర్చి మాక్స్ ముల్లర్ గారిట్లు వ్రాసియున్నారు. "ఈ గ్రంథముల ముఖ్య లక్షణములేవనగా—నిస్సారపదాడంబరమును, పురోహితుల యహంభావములును,

పురాతన వృత్తాంతములనుగూర్చిన విద్యాగర్వమును. ఇటువంటి పాండిత్యాడంబ మును, వ్యర్థమైన తర్కవాదములును, మరియే గ్రంథమందును లేవు. సూక్ష్మదృష్టితో జూచినచో ఈ గ్రంథరచన తత్పూర్వకాల మనోవైభవమునకు అప్పుడు కలిగిన క్షీణదశను విశదీకరించుచున్నదని తేటతెల్లమగును.'' మరియు ఎడింబరోపట్టణ విశ్వవిద్యాలయమందుండిన కీర్తిశేషుడగు ఎగ్లింగ్ అను పండితుడు వీటినిగూర్చి యిట్లు చెప్పియున్నాడు. ''యుక్తాయుక్త వివేచనలేని తర్కవాదములు, అసందర్భ సాదృశ్యములు, పదబాహుళ్యమును ఈ గ్రంథములందుండినట్లు మరేగ్రంథము లందును గాన్పించవు.''

పామరజనమును తమ వశముజేసికొని సృష్టియందలి సమస్త శక్తులమీదను, వ్యాధులు పంటలు మొదలగువాటిమీదను, తుదకు దేవతలమీదను సహా అధికార మును సాగించుటయే బ్రాహ్మణముల ముఖ్యోద్దేశమని యీ గ్రంథములనుబట్టి గ్రహింపవచ్చును. అతిబాహుళ్యమగు వేదకర్మల నాచరించుటయందు బ్రాహ్మణుల సహాయము కావలసియుండుటచే, దేవతలకును మానవులకును మధ్యవర్తులై, బహు కాలమునుండి సర్వోత్కృష్టపదవిని వహించియుండిన బ్రాహ్మణులను భూదేవతలగా భావించిరి. అంతేగాక జనులు పరలోకమందలి దేవతలకుకంటె వీరికే యెక్కువగ భయపడుచుండిరి.

II. The Sutras. సూత్రములు. — బ్రాహ్మణములలోని నియమముల యొక్కయు, నీతివిధులయొక్కయు సంగ్రహరూపములే సూత్రములనునవి. వేద పాఠశాలలలో నేర్చుకొనవలసిన యంశము లెక్కువకాగా అవన్నియు జ్ఞాపకముంచు కొనుట యసాధ్యమైనందున నుపాధ్యాయులు ప్రతివిషయమును క్లుప్తపరచి, కంఠ పాఠముచేయు పద్ధతి నొకదానిని గనిపెట్టిరి. ప్రాముఖ్యభావములతోనిండిన నీ వచనములకు సూత్రములను పేరుపెట్టిరి. యజ్ఞయాగాది కర్మవిధానమును గ్రహిం చుటకే సూత్రము లవసరములు. ఇట్లు కానిపక్షమున నివి కేవలము నిస్సారగ్రంథ ములేయగును. సూత్రనియామకములైన యతివిస్తార కర్మకాండయు, ఆచారసము దాయమును, సోమరులగు బురోహితుల కృత్యములే. హైందవులయొక్క స్వాతం త్ర్య మపహరించి, అజ్ఞానులుగజేసి, వారిని మూఢత్వమందు నుంచవలెనని యాజకుల ముఖ్యోద్దేశమై యుండెను. ఈ కర్మకాండలో చాలాభాగము ప్రాచీన హైంద వైరేనియనుల కాలపునాటిదై యున్నది.

ఈ సూత్రములన్నియు నారు ప్రకరణములుగ విభజించిరి. వానికి వేదాం గములని పేరు. వేదాంగమనగా వేదముయొక్క యవయవము. ఇవేవనగా:— స్వరశాస్త్రము, ఛందస్సు, వ్యాకరణము, శబ్దముల యుత్పత్తిశాస్త్రము, ఆచారకాండ, జ్యోతిశ్శాస్త్రము. బ్రాహ్మణములయొక్క తత్త్వోపదేశములగు నుపనిషత్తులు వేదసిద్ధాం తమునకు మూలగ్రంథమైనట్లు, బ్రాహ్మణములయందలి కర్మకాండవిధులను సూత్ర గ్రంథరూపముగమార్చి, యజ్ఞయాగాదికర్మ లాచరించువారికి బ్రామాణిక గ్రంథముగ జేసి, శ్రౌతసూత్రములని పేరుపెట్టిరి. ఈ సూత్రములలోనెల్ల మిక్కిలి ప్రసిద్ధము

లైనవి గృహ్యసూత్రములు. ఇవి గృహయజమానుని కవసరమగు విధులను, గృహ మందు నాచరింపవలసిన నిత్యకర్మవిధానమును వివరించును. ధర్మసూత్రములు అనుదిన వ్యవహారధర్మములను బోధించును.

ఇందలి యతి ప్రాచీనసూత్రములను బౌద్ధమతోద్భవ కాలమునందుగాని అంత కును బూర్వముగాని రచియించియుండవలెను. ఏలననగా పాలిభాషలో లిఖితము లైన బౌద్ధమత గ్రంథములుగూడ నిట్టివిగానే యున్నవి. బహుశా ఇవి క్రీ. పూ. 600—200 ఈ మధ్యకాలములో వ్రాసియుందురు.

## D. GROWTH OF RELIGIOUS IDEAS. మతభావముల యభివృద్ధి.

### I. Sacrifices. యజ్ఞములు.

1. Their Importance. వాటి ప్రాముఖ్యత.—బ్రాహ్మణములకాలమున యజ్ఞకర్మల నాచరించుటయే ముఖ్యధర్మమై యుండెను. కొన్ని యజ్ఞములలో పాపికి బదులుగా యజ్ఞపశువే పాపప్రాయశ్చిత్తముచేసి తద్వారా పాపవిముక్తునిగావించి పరలోకమును బొందించును. కొందరు కేవలము రక్తబలులే పాపవిమోచన గావించు నని నమ్ముచుండిరి. ఈ యంశములనుబట్టి చూడగా వీటి యుద్దేశము పురాతన లేవీయ రక్తబలుల యుద్దేశమువంటిదేయని చెప్పవచ్చునుగాని హిందువుల యజ్ఞముల కును, లేవీయుల బలులకును మిగుల వ్యత్యాసముగలదు. దైవసాన్నిధ్యమువలననే యజ్ఞములకు ప్రభావముగలదను నమ్మకముగలవారగుటచే, యజ్ఞములయందు బలిగా నర్పించెడు జంతువే దేవుడని భావించుకొనిరి. మొదట కొంతకాలము ప్రజాపతి యజ్ఞపశువయ్యెననియు, తదనంతరము విష్ణువు బలిపశువురూపముదాల్చి తన్ను బలిగా నర్పించుకొనియుండుటచే నా దేవుడు దేవాదిదేవుడాయెననియు నమ్మిరి. పురాణము లన్నిటిలో గడపటిదియగు భాగవతపురాణము విష్ణువుయొక్క యిరువదిరెండు అవ తారములలో యజ్ఞమూర్తి యొకటని చెప్పుచున్నది.

2. The Efficacy of Sacrifices. యజ్ఞఫలితములు.—యజ్ఞములందు నద్భుతప్రభావముగలదనెడి నమ్మకము నానాటికి వృద్ధియగుచుండెను. అనార్య మూఢమతభావము లార్యులలో వ్యాపించినకొలదిని, ఇప్పుడు తమ దేవతలను బూర్వముకంటెను మిక్కిలి భయపడసాగిరి. కావున అమానుషప్రభావముగల దేవతలను బ్రీతిజేసి, లోబరచుకొను నుపాయము వెతుకుట యత్యవసరమయ్యెను. ఇట్టి సామర్థ్యము లభించుటకు యజ్ఞములును, మంత్రములును సాధనములనుకొనిరి. శాస్త్రీయముగ నాచరించినట్లయిన యజ్ఞయాగాదులం దపరిమితప్రభావము గలదని వారెంచుచుండిరి.

(*a*) ప్రథమదశయందు నార్యులు తమ కృతజ్ఞతను జూపుటకై యజ్ఞము లను జేయుచుండిరి.

(*b*) కొంతకాలమైన పిమ్మట నీ యజ్ఞములవలన దేవతలకు జగత్తును సంరక్షింపగలుగుటకు సామర్థ్యము గలుగునని భావింపసాగిరి.

(*c*) మరికొంతకాలమునకు యజ్ఞములద్వార, ఆరాధకుడు దేవతలను నిర్బంధించి, తాను కోరిన వరములన్నియు వారివలన బొందగలడను భావము పుట్టెను.

(*d*) తుదకు తైత్తిరీయబ్రాహ్మణము "దేవతలుకూడ యజ్ఞములవలన స్వర్గపదవి నొందిరి" యని చెప్పుచున్న ప్రకారమీ యజ్ఞములవలన నద్భుతసిద్ధుతే గాకుండా స్వర్గలోకప్రాప్తియు లభింపగలదని వారు నమ్మ నారంభించిరి. ఇంత మాత్రమేగాక యజ్ఞములవలన దేవతాపదవికూడ లభించునని నమ్మిరి. మరియు వీటి మూలముననే పితరులు పరలోకమునకు బోయి పరమానంద మనుభవించుచుండిరి.

యజ్ఞయాగాదికర్మలు కేవలము తమ స్వలాభముకొరకేగాని తమ కృతజ్ఞతను జూపుచు జేసినవారు కారు. యాజకులు జనులచే యజ్ఞములు చేయించి తద్వారా ధనసంపాదనజేయుటయే వేదకర్మలయొక్క ముఖ్యోద్దేశమయ్యెను. కావున గొంత కాలమునకు యజ్ఞములుచేయుట పేదలకు నసాధ్యముగనుండెను. కాలక్రమమున వేదకర్మలు కఠినవిధులతో గూడుకొనినవై మిగుల విస్తరించుటయు, ఈ కర్మలను జేయించుటకు నాచార్యసంఘమేర్పడి వేరుబారుటయు, వారు సర్వాధికారము వహించుటయు సంభవించెను. ఈ కర్మలను లేశమైనను విడిచిపెట్టక సక్రమముగా నాచరించుట ప్రాముఖ్య విధియయ్యెను. ఈ వేదకర్మలను శాస్త్రీయముగా నాచరించక పోయినట్లయిన, సూర్యచంద్రాదుల గతులు తప్పునని యు ప్రకృతియంత్రము తారుమారగుననియు తలంచుచుండిరి.

3. Varieties of Sacrifices. వివిధ యజ్ఞములు.—యజ్ఞములు పలువిధములైయుండెను. అవేవనగా: (*a*) రాజసూయము—అనగా పట్టాభిషేక యజ్ఞము; (*b*) పురుషమేధము, అనగా నరబలి; (*c*) అశ్వమేధము, అనగా గుర్రమును బలి యిచ్చుట. ఇది మిక్కిలి ధనవ్రయముగలది; (*d*) గోమేధము, అనగా ఆవును బలిగా నిచ్చుట. ఇవిగాక నితర జంతుబలులును గలవు; (*e*) సగము మర్త్యుడును, సగము అమర్త్యుడునైన మహాదేవుడగు ప్రజాపతి దివ్యపురుషుడగు యేసుప్రభువును బోలియున్నాడు. శతపథ బ్రాహ్మణము 2: 4, 1; 11: 1, 2 లో జెప్పియున్నలాగున దేవతలకొరకు దన్నుతాను బలిగా నర్పించుకొని, వారికి నమర్త్యమును గలుగజేసెను.

## II. History of the Word "Brahma." బ్రహ్మ అను పదము యొక్క యుత్పత్తి.

1. ప్రార్థనలు కాలక్రమమున హీనదశనొంది వట్టి మంత్రోచ్చారణములాయెను. బ్రహ్మ యను పదమునకు ఋగ్వేదము 1: 34, 18 లో నుండులాగున స్తోత్రము లేక గానములేక యజ్ఞవిధి యను నర్థములుపోయి పిమ్మట మరియొక యర్థము కలిగెను. సాధారణముగా హిందూ గ్రంథములలో స్తోత్రమును ప్రార్థనయును చాలామట్టుకు నొకటియే యర్థముగలవి.

2. మరియొక యర్థమేమనగా స్తోత్రములు లేక గానములుగల వేదసంహితలును, స్తోత్రవిధానమును దెలుపు బ్రాహ్మణములునై యున్నవి.

3. అటుపిమ్మట స్తోత్రములుచేయు యాజకులను బ్రాహ్మణులని పిలిచి, వీరుపయోగించిన స్తోత్రము లేక ప్రార్థనకు బ్రహ్మన్ అను పేరుపెట్టిరి. కాలక్రమమున 'బ్రహ్మన్'కు దేవతలకు మించిన శక్తి గలదని భావించిరి.

4. కావున దేవగురువును ప్రార్థనాపాలకుడునైన దేవతకు బ్రాహ్మణస్పతి లేక బృహస్పతి యను నామమిడిరి.

5. "బ్రహ్మన్ ప్రాధాన్యం" అను వచనమునుబట్టి కొంతకాలమునకు పిమ్మట దేవతలందరిలో నుత్తముడగు బ్రహ్మ యాదిసంభూతుడని యెంచిరి. తుదకు ఈ బ్రహ్మ సర్వోత్కృష్టుడగు స్వయంభువు ఆయెను.

III. The Gods. దేవతలు.—అతి ప్రాచీనకాలమందు బుట్టి వేదములందున్న ద్యౌస్‌పితర్ మొదలగు బురాతనదేవతలలో గొందరు బ్రాహ్మణములలో గనబడరు. మరికొందరనగా వరుణునివంటివారు తమ స్వభావ గుణలక్షణములయందు గొప్ప మార్పునొందిరి. స్త్రీ పురుషదేవతలలో ననేకులు కలహప్రియులును మద్యపానాసక్తులును, వ్యభిచారులునైయుండిరి. ఈ గ్రంథములలో గొందరు పురుష దేవతలును ఊర్వశివంటి కొందరు స్త్రీదేవతలును క్రొత్తగా గానవత్తురు. ప్రాచీన దేవతలలో ననేకులను వారివారి కార్యానుసారముగ విభజించి నూతన దేవతలనుగ జేసిరి. దేవతలు తేజస్సంబంధులనియు, అసురులును రాక్షసులును అంధకారసంబంధులనియు హిందువులు తలంచిరి. దేవతలు తమ యుక్తులచే ఈ దుష్టరాక్షసగణమును నోడింపకలిగిరి. దేవతలనుగూర్చిన కథలు చాలవరకు పిచ్చిగాథలైయున్నవి.

బ్రాహ్మణముల కాలాంతమున తత్పూర్వముకంటె దేవాలయముల నెక్కువగా కట్టి విగ్రహారాధనము చేసినట్లున్నది. బ్రాహ్మణులు దేవాలయములలో అర్చకులుగా నుండవచ్చునుగాని అర్చకవృత్తి గౌరవహీనమైనదని యప్పటినుండి యిప్పటివరకు జనులెంచుచుండిరి.

IV. Growth of Pantheism. సర్వము బ్రహ్మ మను మతాభివృద్ధి.—ఋగ్వేదములో చివరభాగమందుండెడు నీ భావము వృద్ధినొందుచు, తుదకు ఉపనిషత్తుల కాలమున బరిపూర్ణ స్థితికివచ్చెనని యా కాలపు దేవతాశ్రేష్ఠులగు పురుష, ప్రజాపతి, బ్రహ్మ యను ముగ్గురిలో నెవరు ప్రధానస్థానమున కర్హులను విషయమై కలిగిన పరస్పరవాదములనుబట్టి గ్రహింపవచ్చును. కొలదికాలములోనే పురుష యను దేవుడు హీనస్థితి నొందెను. శతపథ బ్రాహ్మణము 6: 1 లో వ్రాసియుండిన లాగున ప్రజాపతి యాదిసంభూతుడగు ప్రధానబ్రహ్మను తననుండిపుట్టించినందున నింకను సర్వాధిక్యుడైయుండెను. కాని మరికొన్ని పుటలకు వెనుక యీ బ్రాహ్మణమందే 13: 6; 10: 6 లో నీ ప్రజాపతి నిర్గుణస్వయంభువగు బ్రహ్మముయొక్క యంశా సంభూతుడని యున్నది. ఇందలి బ్రహ్మము సర్వవ్యాపకుడు, అగోచరుడు,

సర్వాంతర్యామి అను మొదలగు లక్షణములు గలిగి సర్వమునకు నాధారభూతుడై యున్నాడు.

V. Various Doctrines. పలువిధ సిద్ధాంతములు. — యజ్ఞములు ప్రాముఖ్యములైయుండిన కాలమున నాచారకాండకు విరుద్ధములైన కార్యములనే గాని నీతికి విరుద్ధములైనవాటిని హిందువులు పాపములుగ నెంచకుండిరి. సజ్జనులు శరీరబంధవిముక్తులై స్వర్గలోకమునందు శాశ్వతముగ సుఖమనుభవింతురను సిద్ధాంతమును, జీవాత్మ పరబ్రహ్మమునందు కలిసిపోవునని నూతన నిర్వాణ సిద్ధాంతమును నమ్ముచుండిరి. దుర్మార్గులైతే నరకమునకు బోవుదురు. ఈ కాలమున జన్మాంతర సిద్ధాంతము పరిపూర్ణస్థితికి వచ్చియుండలేదు. నాలుగు యుగములను గూర్చిన ప్రస్తాపన నక్కడక్కడ కానవచ్చును. సూర్యలోకము నీతిమంతులకు స్వర్గమని ఋగ్వేదమునందును, సూర్యకిరణములు మృతుల జీవాత్మలనియు, సుగుణములుగల స్త్రీ పురుషులు నక్షత్రములగుదురనియు శతపథ బ్రాహ్మణము 1: 9, 3, 10; 6: 5; 4: 8 లోను, తైత్తిరీయ బ్రాహ్మణము 1: 5; 2: 6 లోను గలదు. ఈ విషయము మత్తయి 13: 43; దానియేలు 12: 3 లోను జూడుము. స్త్రీలప్పటికింకను తమ భర్తలతో యజ్ఞకర్మలయందు పాల్గొనుచుండిరి. సన్యాసులలో ననేకతరగతు లేర్పడు చుండెను. యాత్రలవలన గొప్ప పుణ్యము లభించునని జనులు నమ్ముచుండిరి.

# నాలుగవ యధ్యాయము

# CHAPTER IV

## బ్రాహ్మణ మతాంతర్భాగమగు తత్వశాస్త్రము

## Philosophical Brahmanism

A. HISTORY. చరిత్ర.—బ్రాహ్మణములలో నిర్ణయించిన యతి విస్తారమైన కర్మకాండకు గొంతకాలమైనపిమ్మట ప్రజలు విసిగి వేసారుట తప్పదు. అర్థములేని యాచార కర్మలును, అనంతములైన యాగములును, పురోహితుల మాయాడంబరములును పరమాత్మయందు మనస్సుగలవారికి నసహ్యములుగ నుండుటచే, కర్మకాండను తృణీకరించి తత్వవిచారకులైరి. ఈ కాలపు గ్రంథములలో కొందరు క్షత్రియులు బ్రాహ్మణులకంటె తత్వశాస్త్రమునందు పాండిత్యము గాంచిరి. పంజాబు పశ్చిమోత్తర భాగమందలి తక్షశిల తత్వవిద్యలకు బ్రధానస్థానమయ్యెను.

హిందూదేశ యనార్యులతో నార్యులు చేయుచుండిన యెడతెగని యుద్ధ పరంపర ముగిసినపిమ్మట వారు తమ యాధిపత్యమును స్థిరపరచుకొని, ఉత్తర హిందూస్థానములో గొప్ప రాజ్యముల గొన్నిటిని స్థాపించుకొనిరి. వీటిలో మగధ, కోసల రాజ్యములు ముఖ్యములై యుండెను. ఇట్లు వారికి తీరిక కలిగినందున గంగానదీ యున్న ప్రాంతముల చుట్టుపట్లనుండు అరణ్యములకు బోయి, అచ్చట తత్వవిచారణ జేయుటకు నార్యులకు నవకాశము కలిగెను.

కాని వారిట్టి నెమ్మదిస్థితియందు బహుకాలముండినవారు కారు. భయములును, గండములును తరుచుగా సంభవించుచుండినందున, అప్పటివారు వేదకాలయార్యులకుండిన సంతోషమును, ఉత్సాహమును లేక సంసారయాత్రనుగూర్చి నిరాశజెందియుండిరి. సుమారు క్రీ. పూ. 600 సం॥లకు బూర్వమే సిథియనులు ఉత్తర హిందూస్థానముపై దండెత్తిరి. పిమ్మట మహాభారతమందలి యాదిపర్వము 3: 177 లో నున్నలాగున నన్యదేశీయులగు మ్లేచ్ఛులు అనగా నాగులు, హూణులు, శాకవంశస్థులు, చీనాదేశీయులు, కేరళదేశమువారు, యవనులు, మున్నగువారీ దేశము పైబడి, ధ్వంసముచేసిరి. అందుచే దేశమంతటను ఘోర క్షామపీడ మెండయ్యెను. పారసీకదేశరాజగు దర్యావేషు క్రీ. పూ. దాదాపు 516-వ సంవత్సరమున పంజాబు దేశముపై దండెత్తి, జయించి, తన గొప్ప రాజ్యమువలన వచ్చు రాబడిలో మూడవ వంతుకు సమానమగు పన్ను యీ దేశమువలన రాబట్టుచుండెను. మరియు బుద్ధుని మరణమునకుముందు శత్రురాజొకడు అతని వంశస్థులనందరిని జంపి యతని జన్మస్థానమగు కపిలవస్తువును వశపరుచుకొనెను. పిదప గొంతకాలమునకు ననగా క్రీ. పూ. 326-వ సం॥న మహా అలెగ్జాండరుచక్రవర్తి సింధునది దాటి హిందూదేశముపై

దాడివెడలినందున గ్రీకులకును, హైందవులకును మూడువందల సంవత్సరములవరకు యుద్ధములు జరుగుచునే యుండెను.

క్రీ. పూ. 321-వ సం॥న చంద్రగుప్తుడు మహా అలెగ్జాండరుకు వెనుకటి ప్రభువులను ధిక్కరించి యుత్తర హిందూస్థానమంతయు నాక్రమించుకొని, స్వతంత్ర రాజ్య మొకదానిని స్థాపించుకొని, దానికి మగధదేశములోని పాటలీపుత్రమును (ఇప్పటి పాట్నాయను పట్టణమును) రాజధానిగాజేసెను. క్రీ. పూ. 272—231-వ సం॥ వరకు నేలిన యతని మనుమడు అశోకుడను ప్రసిద్ధుడగు బౌద్ధరాజు ఉత్తర హిందూస్థానమును మాత్రమేగాక దక్షిణ హిందూదేశములోని చాలభాగమునుకూడ తన ప్రభుత్వముక్రిందికి దెచ్చుకొనెను. అశోకుని కాలమునుండి బలపరాక్రమ వంతులగు రాజులనేకులు బౌద్ధమతములో జేరి దానిని వ్యాపింపజేసిరి. ఇది బౌద్ధులకును, హిందువులకును నెడతెగని కలహకారణమై యుండెను. ఈ కాలమున మత విషయములందు హిందూదేశము మిక్కిలి దుస్థితికివచ్చెను.

బాక్ట్రియా నేలిన గ్రీకురాజులు క్రీ. పూ. దాదాపు 200 సంవత్సరములనుండి అఫ్ఘనిస్థానమును, పంజాబులోని కొంతభాగమును, పశ్చిమ హిందూదేశమును నేలిరి. పార్థియాదేశరాజులుకూడ నంతటి వైశాల్యముగల దేశమునే క్రీ. పూ. 138-వ సం॥ నుండి క్రీ. వె. మొదటి శతాబ్దమువరకు బాలించిరి. శాకవంశస్థులు యుంవెచీ తెగవారిచే మధ్య ఆసియాయందలి జక్సార్టిస్‌నదికి నుత్తరమున నుండెడు సారవంతములగు పచ్చికభూములుగల తమ స్వదేశమునుండి పారదోలబడి పశ్చిమోత్తర హిందూదేశముపై దండెత్తి యచ్చట నొక రాజ్య మేర్పరచుకొనిరి. క్రీ. వె. సుమారు 48-వ సం॥న కుషానులను మారుపేరుగల యుంవెచీలను సిథియనులు గుంపులు గుంపులుగా వచ్చి గాంధార, తక్షశిల నగరములకు రాజగు గండోఫర్‌నిస్ యనువాని నోడించిరి. వారిలో మిగుల ప్రభావశాలియగు కనిష్కుడు ఉత్తరమున గాంధార (అనగా కాండహార్) దేశమునందు తన రాజ్యమును స్థిరముగ స్థాపించి, దానికి పురుషపురమును (అనగా ప్రస్తుత పెషావర్‌ను) రాజధానిగా జేసెను. అచ్చట హిందూమతమును, జొరాస్టర్ మతమును ప్రబలియుండినను, పెషావర్ చుట్టుపట్ల బౌద్ధమతమే ప్రధానమైయుండెను. హిందూదేశములోని కుషాన్ సామ్రాజ్యమునందు సంస్కృతము ముఖ్యభాషయయ్యెను. శిల్పవిద్య లభివృద్ధిలోనుండెను. ఆ కాలమున ఆలయ నిర్మాణములో గ్రీకులు శైలినే అవలంబించిరి.

ఉత్తర హిందూదేశ రాజులలో నెడతెగని యుద్ధములు జరుగుచుండెను. బ్రాహ్మణులు క్షత్రియులని పిలుచుచుండిన రాజులనేకులు అప్పటి రాజ్యములను నాశనముచేసి, తమ స్వతంత్రరాజ్యములను స్థాపించుకొనిరి. కావున నగ్రస్థానము వహించుటకు బ్రాహ్మణులకును, క్షత్రియులకును తెంపులేని కలహములు జరుగుచుండెను. ఈ కాలముననే ఆర్యులు దక్షిణ హిందూదేశమున క్రమక్రమముగా తమ రాజకీయ మతాధికారములను వ్యాపింపజేయుచుండిరి.

అతి చంచలమగు నీ ప్రపంచము ఆత్మజ్ఞానసంపన్నులగు హిందువుల దృష్టికి నీటిబుగ్గవలె గనబడుచుండుటచే ఇది మాయలోకమనియు, అనిత్యమనియు నిశ్చయించుకొనిరి. ఈ రెండు హేతువులచే నిర్వికారమగు సత్యపదార్థ మేదో తెలిసికొనవలె ననెడు గొప్పయాశ వారిలో బుట్టెను. పైన చెప్పినట్లు తరుచుగా మారుచుండిన రాజకీయ మత పరిస్థితులే ఉపనిషత్తులలోను, తత్వశాస్త్రము లాంటింటిలోను కనబడుప్రకారము హిందువులు వ్యాకులచిత్తులగుటకును, విరాగులగుటకును గారణముల యుండెనని నిస్సందేహముగా జెప్పవచ్చును. జీవితమంతయు నశాశ్వతమును, అంతములేని జన్మాంతర చక్రమునకు బంధింపబడినదియునై యున్నందున నట్టిన పునర్జన్మరహితమును జేసికొని సంసారబంధవిముక్తులగుటయే యప్పటి గ్రంథకర్తల ముఖ్యోద్దేశమైయుండెను.

B. THE BOOKS. గ్రంథములు.—ఉపనిషత్తులును, ఆరణ్యకములును, బ్రాహ్మణమతాంతర్భాగమగు తత్వశాస్త్రమునకు బునాదులుగా నున్నవి.

I. Upanishads and Aranyakas. ఉపనిషత్తులును, ఆరణ్యకములును.

1. Their Contents. వాటియందలి విషయములు.—ఈ రెండు గ్రంథములును బ్రాహ్మణములందుగల తత్వభావములను బోధించునట్టి ప్రమాణగ్రంథములు. అడవులకు వెళ్లిపోయిన తపస్వుల యుపయోగార్థమైన గ్రంథములకే అరణ్యకములని పేరు. ఇవి యరణ్యములలోనేగాని పట్టణములందైనను, గ్రామములందైనను బోధింపగూడదు. బ్రాహ్మణములలో నుపదేశించుచువచ్చిన తత్వబోధలే చివరకు ఉపనిషత్తులయ్యెను. ఉపనిషత్తు అను పదమును ఉప+ని+షద్ యని విడదీయవచ్చును. ఈ పద విభాగముయొక్క యర్థమేమనగా పక్కను గూర్చుండుట. ఇది మొదట గురు శిష్యుల రహస్య సమావేశము యని భావించిరిగాని కాలక్రమమున దీనికి సిద్ధాంతరహస్యము అను నర్థము కలిగెను. హైందవ తత్వశాస్త్రజ్ఞులు కొందరీ పదము నాశనము అను భావమిచ్చెడు షద్ అను క్రియనుండి వచ్చినదనుచున్నారు. ఈ సిద్ధాంత రహస్యమును సంపూర్ణముగా గ్రహించువారు తమ అజ్ఞానమును, కామమోహాది వికారములను బోగొట్టుకొని, సర్వాంతరాత్మయైన పరమాత్మతో నైక్యముచేయగల దివ్యజ్ఞానము సంపాదించెదరని యీ వేదాంతులు చెప్పుదురు.

వేదగ్రంథ సముదాయమంతయు రెండువిధములుగా నున్నది. అందొకటి కర్మకాండ. దీనియందు వేదమంత్రములును, బ్రాహ్మణములును గలవు. ఈ కర్మకాండననుసరించువారు, వేదసూక్తపఠనమువలనను, యజ్ఞాదికర్మల జేయుటవలనను, పుణ్యము లంభించునని నమ్ముదురు. రెండవది జ్ఞానకాండ. తత్వవిచారణచేయు కొలదిమందికే యీ జ్ఞానకాండ పనికివచ్చును.

క్రైస్తవులు క్రొత్తనిబంధనను తమకు ఏలాగు ప్రామాణికగ్రంథముగా నెంచుదురో ఆలాగే బ్రాహ్మణులును ఉపనిషత్తులను తమకు ప్రామాణికగ్రంథములనుగా నెంచుదురు. జీవితము, ప్రపంచము, దేవుడు, అదృశ్యశక్తులు అనువాటినిగూర్చిన సమస్యలు ఈ గ్రంథములందు తీర్చ యత్నించిరి.

2. Number and Date of the Upanishads. ఉపనిషత్తుల సంఖ్యయు, కాలమును. ఉపనిషత్తుల సంఖ్య 150, 170, 200, 240 యని యనేక విధములుగ జెప్పుదురు. కాని వాటిలో పండ్రెండు ప్రాముఖ్యములైనవి. ఐతరేయ, కౌశీతకి యనునవి ఋగ్వేదమునకును, ఛాందోగ్య, కేన యనునవి సామవేదమునకును, తైత్తిరీయ, కఠ, శ్వేతాశ్వతర యనునవి కృష్ణయజుర్వేదమునకును, బృహదారణ్యక, ఈశ యనునవి శుక్లయజుర్వేదమునకును, ముండక, ప్రశ్న, మాండూక్య యనునవి అథర్వవేదమునకును సంబంధించియున్నవి. వీటిలో వేదములతోను, బ్రాహ్మణములతోను జేరియున్న ప్రాచీన యుపనిషత్తులును బుద్ధుని కాలమునకు బూర్వమే వ్రాసినట్లు కనబడుచున్నది. మరికొన్ని తర్వాత శతాబ్దములలో ననగా క్రీ. పూ. 600 సం॥ మొదలు 200 సం॥ల వరకు గల కాలములో బుట్టియుండెను. కాని యథర్వవేదములో జేరియుండు నుపనిషత్తులు ఇటీవల నేర్పడినవి. వీటిలో నొకటియగు అల్లోపనిషత్తును మహమ్మదీయులు వ్రాసియుందురని దాని పేరునుబట్టి గ్రహింపవచ్చును.

3. Characteristics. ఈ గ్రంథముల ముఖ్యలక్షణములు.—హైందవమత గ్రంథమందలి తత్వజ్ఞాన సంపత్తును ఉదారబుద్ధితో శ్లాఘించి యానందించుచుండిన మాక్సుముల్లరుగారు సహితము ఉపనిషత్తులనుగూర్చి "అవి సత్యమును వెదకుచు జేసెడు ఊహలు" అని వ్రాసియున్నాడు. మరియు నీ గ్రంథములయందు రసవంతమును, సర్వజనులకు నింపైనదియు సహజ జ్ఞానమువలన బుట్టినదియునగు నూతన తత్వజ్ఞానసంపత్తుతో బాటుగ నిరర్థకములును, మానవకల్పితములు నగుటయేగాక యతిఘోరములును, అసహ్యకరములునైన యవివేక విషయములుండుట యెట్లు తటస్థించెనను ప్రశ్నకు తా ననేక సంవత్సరములుగా సమాధానము తెలిసికొనజాలకున్నానని చెప్పియున్నాడు. మరియొకచోట "ఉపనిషత్తులలో బంగారు కణికలు విస్తారమైన చెత్తలో పూడిపోయియున్నవి" యనుచున్నాడు. వీటియందు నుత్కృష్ట తత్వోపదేశములును, తుచ్ఛవాదములును, పామరజనులయొక్క మూఢవిశ్వాసములును కలిసియున్నవి. అనిశ్చయమైన, నిస్సార, నిరాశభావములతో గూడిన యజ్ఞానాంధకారమందు నీ క్రింది ధ్యానశ్లోకము మెరుపువలె తళుక్కుమని ప్రకాశించుచున్నది. ఇది బృహదారణ్యక యుపనిషత్తు 1: 3, 28 లో నున్నది.

అసతోమాసద్గమయ । తమసోమాజ్యోతిర్గమయ । మృత్యోర్మామృతంగమయ ॥
దీని యర్థమేమనగా—అసత్యమునుండి సత్యమునకు గొనిపొమ్ము. చీకటినుండి వెలుగునకు మరలించుము. మృత్యువునుండి అమరత్వమునకు దీసికొనిపొమ్ము.

4. Religious Ideas and Doctrines of the Upanishads. భిన్నభిన్న మతభావములును, సిద్ధాంతములును.—ఉపనిషత్తులలో నాస్తికమతముతో బాటు బహు దేవతారాధనమునుగూర్చియు, ఏక దేవతారాధననుగూర్చియు చర్చలు గలవుగాని సర్వము బ్రహ్మమయమను సిద్ధాంతమే యగ్రస్థానమును వహించియున్నది. ఆ కాలమున విగ్రహారాధన జనులలో సర్వసామాన్యమై యుండెను. దేవతల

సంఖ్య 33 అని కొందరును, 3,306 అని కొందరును చెప్పుదురు. పరమాత్మయే స్త్రీపురుషరూపముల దాల్చి సమస్తమును సృష్టించెనని బృహదారణ్యకోపనిషత్తునందు 1: 3 లో నున్నది. బ్రాహ్మణులు దేవతలతో సమానులై తదితర కులములవారికి గురువులైయుండిరి. వేదములు దైవప్రేరితములనియు, కులభేదములు దైవనిర్ణితము లనియు, ఈ గ్రంథములు చెప్పుచున్నవి. యజ్ఞయాగాదికర్మలను జేయుట సర్వ సామాన్యమైయుండెను. ఇందుకు ప్రకృతివిరుద్ధమగు జ్యోతిష, శారీర, శాస్త్రములు గలవు. ఇందుకు నుదాహరణముగ శరీరమందు 72,72,00,000 రక్తనాళములు కలవని చెప్పుచున్నారు. శరీరమును కృశింపజేయు కఠినవ్రతములును, యోగాభ్యాసమును, అతి మర్మమగు ఓంకారజపమును సంసారబంధవిముక్తికై యత్నించెడు యోగులకు బరమోపయోగమని తలంచిరి.

రజస్వలలుగాకపూర్వమే బాలికలకు వివాహముచేయుట విధియయ్యెను. సంతానములేని విధవరాండ్రకుమాత్రమే పునర్వివాహము చేసికొనుటకు సెలవిచ్చి యుండిరి. కల్పములు, యుగములు, ప్రళయములు, లోకము పుట్టి నశించుట మొదలగువాటినిగూర్చిన యనేక గాథలు విశదీకరించియున్నారు. పరమాత్మ జీవాత్మల యొక్క తత్వము, ప్రపంచనిర్మాణము, పునర్జన్మరహితముచేసికొను మార్గము—ఈ విషయములనుగూర్చి ఉపనిషత్తులలో ముఖ్యముగ ప్రశంసించియున్నారు. ప్రారబ్ధ కర్మ, పునర్జన్మ సిద్ధాంతముల నీ గ్రంథములందు పూర్ణముగా వివరించిరి. సర్వము బ్రహ్మమయము అను సిద్ధాంతమును కొంచెము విపులముగా వివరింతుము.

### *a.* Pantheism. సర్వము బ్రహ్మమయమను సిద్ధాంతము.

వేదములందు సృష్టికి నాధారభూతమగు వస్తువులనుగూర్చిన చర్చలు. సృష్టి మొట్టమొదట జలమునుండి యుత్పత్తియైనదని వేదములందు నొకచోటను, ఆకాశమునుండి అని మరొకచోటను, ఇంకొకచోట నీ యభిప్రాయములను త్రోసివేసి ఉనికిలేని స్థితి అను అర్థమిచ్చు "అసత్" నుండి సర్వముద్భవించెననియు నున్నది. ఈ కడపటిదానినికూడ విసర్జించి జననమరణ రహితమగు ఉనికి అనునది సర్వసృష్టికి మూల బీజమని వేదములు చెప్పుచున్నవి. సృష్టికి ఆదిపదార్థములు ఈ పైనుదహరించినవే కాకుండ బ్రహ్మణస్పతి, విశ్వకర్మ, పురుష, హిరణ్యగర్భ, ప్రజాపతి—వీరిలో నొకరి వలనమాత్రమే సృష్టికార్యము జరిగియుండెనని యూహించుచున్నారు. కాని వేదాంతకాలమున ఈ పైవాదములన్నియు నంతరించి కేవలము బ్రహ్మముతప్ప మరే దియు మూలకారణము కాదను సిద్ధాంతము బయలువెడలెను.

### బ్రహ్మ అను పదమునుగూర్చిన వివిధ భావములు.

శ్రౌతకాలమున బ్రహ్మ అను పదమునకు స్తోత్రము, ప్రార్థన, దివ్యజ్ఞానము, మంత్రము, అను వేరువేరు అర్థములుండెను. ఇంతేకాక వీటియందలి మాహాత్మ్యము నకుకూడ బ్రహ్మమను నామము నుపయోగించిరి.

కొంతకాలమునకు ఆకాశము, జీవము, ఆనందము, సూర్యము, అన్నము, ప్రాణము, మనస్సు, బుద్ధి—వీటిలో ప్రతిది బ్రహ్మస్వరూపమని తలంచిరి. ఇంతే

కాక సూర్యుడు, చంద్రుడు, మెఱుపు, అగ్ని, ఇవియును పరమాత్మస్వరూపములే యని భావించిరి. ఈ పైనుదహరించినవాటిలో ప్రతిదియు సర్వసృష్టికి మూలాధారమై యుండెననియును, వీటిలో నొక్కొక్కటియు నీ మూలాధారమునకు నివాసస్థానమైయున్నదనియు ననుకొనిరి. ఆ ఆదిబీజరూపమగు వస్తువు మాత్రమే సత్యము. దానికి 'పురుష' అను నామమిడిరి. అతడు ఆత్మస్వరూపుడు. సర్వమునకు మూలకారణుడు.

బ్రహ్మము సర్వాంతరాత్మ; గుణబద్ధుడు కాడు; ఇంద్రియములందును, ఆంతర్యమందును, అతి సూక్ష్మరూపమున లీనమైయుండెనని తలంచిరి. అటుతర్వాత ఈ సర్వేంద్రియములే బ్రహ్మముయొక్క స్థూలరూపములు అనగా కంటికి కనబడు జగత్తంతయు పరమాత్మస్వరూపమేగాని వేరొండు కాదని భావించిరి. తుదకు అతి సూక్ష్మమగు బీజము పెరిగి, పెరిగి యెట్లు శాఖోపశాఖలుగ విస్తరించునో అట్లే ఈ అతి సూక్ష్మ బ్రహ్మపదార్థముకూడ వ్యాపించి, వ్యాపించి విశ్వరూపమును ధరించియుండవలెనని సిద్ధాంతముచేసిరి.

ఈ బ్రహ్మమే 'సత్' అను పదార్థము. నానావిధ నామరూపములతో కనబడుచున్న యీ దృశ్యప్రపంచమును, మానవులయొక్క చేష్టలును, సర్వమును బ్రహ్మముయొక్క లీలలేగాని వేరొండుకాదని వాదింప నారంభించిరి. పండితు లీరెండు మూలసిద్ధాంతములను అంగీకరించిరి. (*a*) సర్వసృష్టియు నొక మూలబీజము నుండియే పుట్టియుండవలెను. ఈ విశ్వమంతయు నీ మూల బీజముయొక్క స్వరూపమే. సర్వమును ఆ ఆదికారణమేగాని వేరొకటి కానేరదు. (*b*) అటుతరువాత ఈ ఆదిబీజము ఆత్మస్వరూపముగ నున్నదనియు, పరమాత్మ జీవాత్మలకు పరస్పరసంబంధముండియుండవలెననియు అభిప్రాయపడిరి.

మొట్టమొదట బ్రహ్మము ఈ ప్రపంచమును సృష్టించెననియు తాను అందు ప్రవేశించెననియు తలంచిరి. ఇటీవల బ్రహ్మమునుండి లోకములు పుట్టెననిగాని బ్రహ్మవలన సృష్టికార్యము ప్రత్యేకముగ జరిగెననిగాని బ్రహ్మము సర్వాంతర్యామియై విశ్వమంతయు నిండియుండెననిగాని అంగీకరించక, బ్రహ్మాండము సాక్షాత్తుగ బ్రహ్మముయొక్క స్థూలరూపమేకాని వేరుకాదని సిద్ధాంతముచేసిరి. కావున కన్నులకు కాన్పించు నామరూపభేదములుగల ఈ విశ్వమంతయు అద్వితీయ బ్రహ్మస్వరూపమే యని వేదాంతుల యభిప్రాయమైయున్నది.

ఇంతేకాక పరమాత్మకును, జీవాత్మకును పరస్పరసంబంధమున్నదని తలంచిరి.

జీవాత్మ పరమాత్మలు భిన్నపదార్థములుకావను వాదము. మానవశరీరముయొక్క భిన్నభిన్న అవయవములకును పరబ్రహ్మముయొక్క నామరూప భేదములతో నుండు విశ్వరూపమగు బ్రహ్మాండమునకును పరస్పరసంబంధమున్నదని తలంచిరి. ఈ ప్రపంచమంతయు సత్‌రూపుడును, సర్వాంతరాత్మయును, గుణసంపన్నుడునగు పరబ్రహ్మమనియు, బ్రహ్మయొక్క సూక్ష్మస్వరూపమేయనియు భావించిరి.

అటుతరువాత సృష్టికి మూలపునాదియగు బ్రహ్మమును, అంతర్యామిరూపమున విశ్వమందడగియుండిన సర్వాంతరాత్మయగు పరమాత్మయును భిన్నపదార్థములు

కావని వేదాంతులకు తోచెను. కావున బ్రహ్మము నిత్యమగు సత్ అను పదార్థమే కాక నామరూపములు గల ఈ అనిత్య బాహ్యప్రపంచమై యున్నాడనుచు న్నారు. మరియు మానవశరీరములు ధరించిన జీవాత్మలును, విశ్వమున వ్యాపించి యుండు పరమాత్మ ప్రతిబింబములే. ఈ పరమాత్మయు బ్రహ్మస్వరూపమే.

సగుణబ్రహ్మస్వరూపమగు బ్రహ్మాండమును, మాయావాదమును. సర్వము తానై, సర్వాంతరాత్మయైయుండు ఈ యద్వితీయ బ్రహ్మపదార్థముయొక్క గుణలక్షణములు ఎట్టివి? అనిత్య ప్రకృతిపదార్థములును, వాటివాటి నామరూప గుణభేదములును బీజాంకురన్యాయమున పరబ్రహ్మమందే ఇమిడియుండవలెనుగదా?

వేదాంతులు పరబ్రహ్మము అద్వితీయపదార్థమని వాదించుచున్నను వాస్తవ ముగ ఆలోచించిన పరబ్రహ్మము వనవృక్షన్యాయమున నామరూప గుణభేదములు గలిగి అశాశ్వతరూపులగు జీవులయొక్క నిండురూపమై యుండవలెనేగాని అఖండ ఏకపదార్థముగ నుండజాలదు. అట్లయితే సృష్టియందలి భిన్నభిన్న పదార్థముల కును అంతఃకరణవృత్తులకును ఇంద్రియవ్యాపారములకును ఏమిసమాధానము చెప్ప వలెను? ఇంద్రియములద్వార లభించునది వట్టి భ్రమయనియు, సత్యముకాదనియు, ఇదియంతయు బ్రహ్మముయొక్క లీల యనియు, నామరూప గుణభేదములతో కంటికి గోచరమగునది కేవలము మాయ యనియు వేదాంతులు చెప్పుచున్నారు.

వేదాంత మతానుసారముగా ఇద్దరు బ్రహ్మలున్నారు—వ్యక్తము, అవ్యక్తము; నిత్యము, అనిత్యము; అచలము, చలము; అనగా దృశ్యప్రపంచమును, జీవాత్మలును, అనిత్యవ్యక్తరూపముననున్న సగుణబ్రహ్మయొక్కయు, అవ్యక్త, నిత్యపదార్థమగు నిర్గుణబ్రహ్మయొక్కయు స్వరూపములు. ఈ నిర్గుణబ్రహ్మము ఇంద్రియములకు అందనివాడును నామరూప గుణరహితుడును అగుటచే మనస్సుచేతనే గ్రహింపదగిన వాడు. ఇట్టి బ్రహ్మమును "నేతి, నేతి అనగా ఇది కాదు, ఇది కాదు" అను వ్యతి రేకపదములతోనే వేదాంతులు వర్ణించెదరు. అట్టివాడైయున్నను ప్రకృతిపదార్థము లన్నిటిలో బ్రహ్మమే సత్యపదార్థమైయున్నది.

మనకు అనుదినము ప్రత్యక్షముగ కనబడుచున్న నామరూపభేదములు పర బ్రహ్మకు సంబంధించినవికావనియు, కేవలము భ్రమలనియు, స్వప్నవృత్తాంతములవలె అసత్యములనియు వేదాంతులు చెప్పుచున్నారు.

ఈ పై సిద్ధాంతానుసారము మాయాస్వరూపమగు సగుణబ్రహ్మము, మాయా తీతుడగు నిర్గుణబ్రహ్మము అను నిద్దరున్నారనియే. జీవుని సంసారమునకు బంధించు లోకజ్ఞానము, బంధవిమోచనచేయు బ్రహ్మజ్ఞానము అను భేదముకూడ నేర్పడెను. బ్రహ్మమే సత్యము, అద్వితీయుడు అను మూలసిద్ధాంతప్రకారము నిర్గుణబ్రహ్మమే సత్యస్వరూపుడు. కావున సగుణబ్రహ్మయొక్క స్వరూపమై నామరూప గుణ భేదములతో కూడియున్న ఈ విశ్వమంతయు ఎండమావులవలె వట్టి భ్రమ, మాయా స్వరూపము. అజ్ఞానముచే అంతయు సత్యమని భ్రమించుచున్నారు. జగదీశ్వరు డగు సగుణమూర్తి మాయారూపములను కల్పించుచుండును. లోకమందు అనుభవ పూర్వముగ లభించిన జ్ఞానము సత్యముకాదు. కేవలము బూటకమే.

నిర్గుణబ్రహ్మమునకును, సాంసారిక, లౌకిక, నైతికధర్మములకును ఎట్టిసంబంధమును లేదు. అతడు గుణబద్ధుడుకాడు.

ఈ సత్యపదార్థమగు నిర్గుణబ్రహ్మము మనస్సుచే గ్రహింపబడగినవాడు కాడు. కావున వేదాంతమతానుసారముగ ప్రపంచము కేవలము మాయాస్వరూపము. బ్రహ్మమన్ననో మానవబుద్ధికి అందని సత్ పదార్థము.

అద్వితీయ నిర్గుణబ్రహ్మమును కేవలము ధ్యానముచేతనే ఎరుగవలెనను సిద్ధాంతము. నామరూప గుణభేదములు అంతఃకరణమువలన కలుగుచున్నవి. అవి చిత్తభ్రమలు. ఈ హేతువుచేత ధ్యానించుటద్వారనే ఒకడు తానును, పదార్థమును ఒకటియేయని గ్రహించును. ఆలాగుననే పరమాత్మ ప్రపంచమును తలంచుటవలన మాత్రమే దానికి ఉనికి కలదు అని వేదాంతుల వాదము. అతని లీలయేగాని సత్యముకాదు. అటువలననే ఇంద్రియగోచరమగు బ్రహ్మాండమంతయు జీవాత్మయొక్క కల్పనయే. వట్టి కలవంటిది. భిన్నభిన్న రూపములతో కనబడుచుండు ప్రపంచమును, మానవులును, సత్యమూర్తియు, సర్వాంతరాత్మయు నగు పరమాత్మయొక్క సంకల్పరూపములనియు, అతని లీలలనియు, వేదాంతులు వాదించుచున్నారు. ఇట్టి తర్కమువలననే సర్వము ఒకటె అనియు, రెండవది యుండనేరదనియు వేదాంతుల వాదము.

నేను వేరు, ప్రపంచము వేరు, బ్రహ్మము వేరు అను భేదబుద్ధికి జీవాత్మయొక్క అజ్ఞానమే కారణము. బ్రహ్మమునుగూర్చిన యథార్థజ్ఞానము మాయాంధకారము నుండి వెడలించును. తద్వారా జీవాత్మ బ్రహ్మముతో నైక్యమగును. జాగ్రదవస్థకంటె ఉత్కృష్టమైనది కలలుకనని గాఢనిద్ర లేక నిర్గుణధ్యానము. ఈ రెండును అద్వితీయ సత్యపదార్థమునుగూర్చిన నిర్మలజ్ఞానము సంపాదించుటకు ముఖ్యసాధనములు. కావున పరబ్రహ్మముయొక్క ఉత్కృష్టస్థితి నిర్గుణావస్థయే. కావున మోక్షమనగా జీవాత్మయొక్క స్వరూపజ్ఞానమంతరించి, సత్యస్వరూపుడును, నిర్వికారుడును గుణాతీతుడును అగు పరమాత్మయందు లీనమగుటయే.

వేదాంతమతముయొక్క ఫలితములు.—ఈశ్వరుని భక్తితో పూజించుటయు, సత్కర్మాచరణయు మోక్షదాయకములని సర్వమతములవారును అంగీకరించుచున్నారు. కాని వేదాంతమతమైతే ఈ రెంటిని నిరాకరించి, కేవలము బ్రహ్మజ్ఞానమే ముక్తిమార్గమని ఉపదేశించుచున్నది. తద్వారానే ఒకడు తన కోరిక నెరవేర్చుకొనినవాడగును. ఇట్టి బ్రహ్మజ్ఞానసంపన్నుడు అనంత శక్తియుక్తుడును, అజేయుడునై యుండగలడు. ఈ దివ్యజ్ఞానముయొక్క ప్రభావముచే జీవాత్మ దుష్టకర్మలకు విముఖుడై పునర్జన్మరహితుడగును. పరమోత్కృష్టపదవి నొందిన బ్రహ్మజ్ఞానిని ఎట్టి ఘోరపాపములైనను అంటవట. శిక్షార్హుడుకాకుండునట. నరకభయములేదట. అయినను ఇటీవల నవీన వేదాంతులు బ్రహ్మజ్ఞానమునకు తోడుగ సద్గుణసంపత్తియు అత్యావసరమని బోధించుచున్నారు. బ్రహ్మజ్ఞానము, ఐహికేచ్ఛలవిసర్జించుట, యోగాభ్యాసము—ఈ మూడును జీవాత్మను పరమాత్మతో నైక్యముచేయుటకు ముఖ్యసాధనములు.

## C. THE BUDDHIST AND JAIN REFORMATIONS.

## బౌద్ధ జైనమతములవలని సంస్కరణములు.

I. Protests against Brahmanism. హిందూమతముపై తిరుగుబాటులు.—పరమాత్ముడొకడున్నాడని విశ్వసించియు, హిందువులు బహు దేవతల నారాధించుటయు, మతాచార్యులగు బ్రాహ్మణులు చలాయించుచుండిన సర్వాధికారమును, ఆచరించుటకు మిగుల కష్టతరములగు యజ్ఞాది కర్మకాండయు, తద్వారా వృద్ధియగుచున్న జీవహింసయు, ఉపనిషత్తుల తత్త్వోపదేశములు కేవలము నిస్సారములుగను, అసంతృప్తికరములుగనై యుండుటయు, సర్వముఖముల వ్యాపించిన కఠిన కుల కట్టుబొట్లును, ఇవన్నియు క్రీ. పూ. 6-వ శతాబ్దము నాటికి మిక్కిలి శ్రమకరమగు బ్రాహ్మణమతమును ధ్వంసముచేయుటకు రెండు ప్రతికక్షులేర్పడుటకు గారణములాయెను. ఈ రెంటికిని మొదట హిందూమతసంస్కరణమే ముఖ్యోద్దేశమై యుండినను, కాలక్రమమున నవి బ్రాహ్మణమతముతో నెట్టిసంబంధమునులేని ప్రత్యేకసంఘములై ప్రస్తుతకాలమునకూడ నట్లేయున్నవి. తూర్పిండియ దేశము వేదాంత వాద ప్రతివాదములతో బెనగులాడుచుండిన విద్వాంసులతోను, వేదవిరుద్ధ మతశాఖల వారితోను నిండియుండెనుగాని తూర్పు హిందూదేశీయులు పశ్చిమభాగమందున్న వారివలె పూర్వాచారముల ననుసరించెడివారుకారు. ఆ కారణముచే తూర్పు దేశమును ఏలుచుండు రాజులు పశ్చిమదేశ మతసిద్ధాంతములను దిరస్కరించిరి. అంతట ననేక నూతన మతశాఖలు బయలుదేరెను. అట్టి శాఖలన్నిటిలో జైన బౌద్ధమతములు రెండుమాత్రమే నాటినుండి నేటికిని తమ స్వాతంత్ర్యమును నిలువుకొని, రూపుమాయక యున్నవి. ఈ రెండు వేదవిరుద్ధమతములను స్థాపించినవారు రాజ్యాధికారము వహించిన రాజవంశస్థులే.

II. Buddhism. బౌద్ధమతము.

1. Life of Buddha. బుద్ధుని జీవితచరిత్ర.—బుద్ధుడు భూలోకమున జన్మించిన మహాపురుషులలో నొకడని నిస్సందేహముగ చెప్పవచ్చును. బౌద్ధమత గ్రంథముల ప్రకారము మగధ యనగా ప్రస్తుత బీహారుదేశమందలి కపిలవస్తురాజగు శుద్ధోదనునికిని, అతని భార్యయగు మాయాదేవికిని బుద్ధుడు పుట్టెను. ఇతడు క్రీ. పూ. 544-వ సం॥లో జన్మించెను. ఇతని మొదటిపేరు సిద్ధార్థుడు. ఇతడు గౌతమశాఖ వారికిని శాక్యవంశమునకును సంబంధించినవాడగుటచేత గౌతముడు, శాక్యముని, కొంతకాలమునకు జ్ఞానోదయమగుటవలన బుద్ధుడు అను నామములనుకూడ వహించి యుండెను. ఇతనినిగూర్చి బౌద్ధగ్రంథకర్తలు వ్రాసిన చరిత్రలన్నియు చాలవరకు పుక్కిటిపురాణములుగా నున్నవి. చావు పుట్టుకలకును, సుఖదుఃఖములకును, గారణమేమి? వీటినుండి తప్పించుకొను మార్గమేది? అను నీ రెండు విషయములను గూర్చి, అతడు దీర్ఘముగ నాలోచించెను. తన పదునారవయేట పెండ్లిచేసికొనెను. మానవులకు సంభవించుచున్న మూడు సామాన్యవిషయము లితని జీవితవిధానమంతయు బూర్తిగ మార్చివేసెను. ఆరోగ్యమును, బలము నుడిగిపోయిన ముసలివాడొకడు

ఇతని కంటబడెను. మరియొకనాడితడు జ్వరముచే గృశించిపోయిన యొకనిని జూచెను. ఇంకొకదినమున నితడొక శవమునుజూచుట తటస్థించెను. అంతట నతడు "విమోచనమార్గము నేను కనిపెట్టవలెను" అని చెప్పుచు తన యుద్యానవనము విడిచిపోయెను. అటుపిమ్మట నితడు తన రాజ్యమును త్యజించి, అప్పుడు కుమారుని కనియుండిన తన భార్యను విడిచిపెట్టి, భిక్షుకుడై దేశసంచారమును జేయుచుండెను. ఇతడు కొందరు బ్రాహ్మణగురువులకు శిష్యుడైయుండెను. ఎంత కఠిన తపస్సు నాచరించినను ఇతనికి ఆత్మశాంతి కలుగలేదు. అప్పటికి నితడు మానవులను రక్షించు మార్గము నాలోచించియుండలేదు, గాని తన యాత్మవిమోచనకొరకే పాటుపడుచుండెను. ఇతడు బుద్ధగయయందొక బోధి అను రావిచెట్టుక్రింద గూర్చుండి ధ్యానించుచుండగా, సంపూర్ణ జ్ఞానోదయమైనందున నూతనముగ మోక్షమార్గము నొకదానిని కనిపెట్టకలిగెను. అందుచే నితనికి బుద్ధుడను పేరువచ్చెను. మానవులనుభవించుచుండెడు కష్టములనుజూచి, వారియెడల కనికరపడి, యితడు తాను కనిపెట్టిన సత్యములను వారికి బోధించి, తన క్రొత్తమతమున ననేకులను జేర్చెను. కుసినగర ప్రాంతమున నితడు క్రీ. పూ. 464-వ సం॥న తన యెనుబదవయేట మృతినొందెను.

2. Spread and Decay of Buddhism. బౌద్ధమతవ్యాపకము, క్షీణదశ.—ఈ మతాచార్యునియొక్క దివ్యోపదేశములు కోట్లకొలదిజనుల నాకర్షించి, వారి హృదయక్షేత్రములందు శాశ్వతముగ వేరునాటుకొని యుండెను. ఇతడు హిందూదేశమునకు పేరుతెచ్చిన మహాపురుషుడని నిస్సందేహముగ జెప్పగలము. ఇతడు లోకోపకారచింతగలవాడై, జనుల దుఃఖముల నివారించి, సర్వసందేహముల దీర్చి, శాంతిమార్గము చూపుట తనకు విధియని తలంచెను. అశోకుడను బౌద్ధరాజు మగధదేశములో క్రీ. పూ. 272-వ సం॥ నుండి క్రీ. పూ. 231-వ సం॥ వరకు ప్రభుత్వముజేయుచు తన రాజ్యముమ బంగాళము, గుజరాతు, పంజాబుదేశములలో వ్యాపింపజేసెను. ఉత్తరహిందూస్థానరాజులు కొందరు బౌద్ధమతవ్యాపకమునకు గొప్ప ప్రోత్సాహమిచ్చినందున ఇది క్రీ. పూ. దాదాపు 200 సంవత్సరములకు నుత్తరహిందూస్థానములో గొన్నిభాగములందు ప్రధానమతమాయెను. ఈ మత మతిత్వరలో వ్యాపించుటకు గారణము లేవనగా:—

(*a*) బుద్ధుని పవిత్రజీవితమును, గుణాతిశయములును, అతనియొద్దకు ననేకుల నాకర్షించెను.

(*b*) బుద్ధుడు పామరజనులు సులభముగ గ్రహింపగల ధర్మసూత్రములను గల్పించి, తన మతము నవలంబించుటకు నెట్టి యాటంకములును లేకుండజేసి, వారిని తనవశము చేసికొనెను.

(*c*) అతడు కులభేదములను ద్రోసివేసెను.

(*d*) అతడు సన్యాస ఆశ్రమము స్థాపించెను.

(*e*) రాజు లనేకులీ మతవ్యాపకమునకు దోడ్పడిరి.

హిందూ బౌద్ధమతములు రెండును గొన్ని శతాబ్దములవరకు పరస్పర విరోధములు గలిగియుండెనుగాని సత్యదయాధర్మమూర్తియగు బుద్ధునియందుగల భయభక్తులు చల్లారుచుండినకొలదిని, అతని మతప్రభావమును క్షీణదశకు రాసాగెను. కావున బౌద్ధమతమునకుండిన జనాకర్షణశక్తి క్రమముగ నడుగంటుచుండెను. ఆస్తికబుద్ధిగల హిందువులు చిరకాలము దేవుని విడిచియుండుట యసంభవమగుటచే, బౌద్ధమతము వంటి నాస్తికమతమీ దేశమున శాశ్వతముగ నిలువలేకపోయెను. కావున హిందూమత నమ్మకములను, ఆచారములను బౌద్ధులంగీకరించుచుండగా, కుయుక్తిగల బ్రాహ్మణులు బుద్ధదేవుని విష్ణువుయొక్క తొమ్మిదవ యవతారపురుషునిగజేసి, తమ దేవతల లోనికి స్వీకరించిరి. సుమారు క్రీ. వె. 700-వ సం॥న నీ దేశమునందు కుమారిలభట్టు అను మతసంస్కర్తయు, సుమారు క్రీ. వె. 800-వ సం॥ నుందుండిన శంకరాచార్యులను మరియొక సంస్కర్తయు హిందూమతమునకు బునర్జీవము గలుగజేయుటయేగాక బౌద్ధులను హింసింపుడని హిందువులను బురికొల్పిరి. కావున క్రీ. వె. 1000-వ సంవత్సరమునాటికి బౌద్ధమతము హిందూదేశమునుండి యదృశ్యమాయెను.

ఉత్కృష్టధర్మములుగల నీ మతము లోకమునందు నొక ప్రచారకమతమై, యిండియాదాటి యనేక యితరదేశములలోకూడ వ్యాపించెను. ఈ మతమునందుగల గొప్ప లోపమేమనగా దేవుని త్రోసివేయించి, ధర్మమార్గమున నడిపింప జూచుటయే.

3. Buddha's Doctrine. బౌద్ధమత సిద్ధాంతము. — బుద్ధుడు బ్రాహ్మణమతమును బూర్తిగా ఖండించినను, అతనికి హిందూదేవతలయందును, పునర్జన్మ సిద్ధాంతమునందును, ప్రారబ్ధకర్మయందును, బూర్ణ విశ్వాసము గలదు. ఉపనిషత్తులు చెప్పుచున్నట్లు తపస్సువలనను, ధ్యానమువలనను నిర్వాణపదవి లభించునని నమ్ముచుండెను.

బుద్ధుడు బోధిచెట్టుక్రింద కూర్చుండి కనిపెట్టిన సిద్ధాంతమందు నాలుగు సత్యము లిమిడియున్నవి.

(*a*) జన్మము, రోగము, మరణము, ఐహికాశలు—దుఃఖకారణములును, బంధకములును అనగా జీవితమంతయు దుఃఖమే.

(*b*) జీవితాశయు, కామాదులును—జననమరణములకును, జన్మములకును, గారణములేగాక జన్మలు రహితమగుటకు నడ్డుబండలుగ నుండును.

(*c*) కోరికలను నిర్మూలముచేయుటవలననే జీవించవలెనను నాశనుండి తప్పించుకొందుము.

(*d*) ఆ జీవితాశను జయింపగల మార్గ మెనిమిది మెట్లు గలది. అవేవనగా (1) సద్విశ్వాసము, (2) సత్సంకల్పము, (3) సత్యవాక్కు, (4) సత్కార్యాచరణ, (5) సత్ప్రవర్తన, (6) సద్వృత్తి, (7) సచ్చింత, (8) సద్ధ్యానము.

ఇతడు ప్రారబ్ధకర్మ, పునర్జన్మ సిద్ధాంతములనుగూర్చి కూడ బోధించెను. సర్వజీవులకు గమ్యస్థానమగు నిర్వాణపదవి లభించుటకు కొన్ని విధినిషేధములను విధించెను. విడవవలసిన కార్యములేవగా:—జీవహత్య, దొంగతనము, వ్యభిచారము,

అబద్ధమాడుట, మద్యపానము, వీనితోబాటుగ ఆరు విధులనుగూడ ననుసరింపవలెను. అవేవనగా:—దానము, పరిశుద్ధత, ఓర్పు, ధైర్యము, ధ్యానము, శాస్త్రజ్ఞానము. ఈ ధర్మవిధులన్నిటిని నాచరించుటమాత్రమేగాక సన్యాసాశ్రమములోకూడ జేరవలెను.

బుద్ధుని శిష్యులు కులభేదములను లేకుండజేయుటమాత్రమేగాక, దేశ జనాంగ భేదములనుకూడ నిరాకరించిరి. శిష్యులందరిని సమానులుగ నెంచవలసి యుండెను. బుద్ధుడు మతప్రచారమందు దౌర్జన్యముగాని, నిర్బంధనగాని చేయక సాత్వికమార్గముననే జనుల నాకర్షింపవలయునని తన శిష్యులకు నాజ్ఞాపించెను.

III. The Jain Reformation. జైనులుచేసిన మతసంస్కరణము.—జిననామధేయుడగు మహావీరుడను మరియొక రాజకుమారుడు, కఠినవ్రతములవలన శరీరబంధకములనుండి యాత్మను విడుదలచేయు నుద్దేశముగల ఇంక నొక సంస్కరణోద్యమమునకు నాయకుడయ్యెను. జిన యనగా విజయుడు. ఈ పదమునుండియే జైనశబ్దము పుట్టెను. విదేహ, మగధ, అంగదేశరాజులకు నితడు బంధువు. ఇతడంతకు ముందు రెండున్నర శతాబ్దములక్రిందట పార్శ్వనాథుడను నతనిచే స్థాపితమైన సన్యాసుల మతములో గొంతకాలము చేరియుండెను గాని అందువలన సంతృప్తి పడక దానిని విడిచి, మరియొక క్రొత్త మతమును స్థాపించి, తన మతమును ముప్పది సంవత్సరముల కెక్కువకాలము బోధించెను. ఇతడు క్రీ. పూ. 527-వ సంవత్సరమున జనిపోయెనందురు. అప్పటికి నితనికి పదునాలుగు వేలమంది శిష్యులుండిరి. బింబిసారుడు, అజాతశత్రు అను రాజులుకూడ నతని మతమును స్వీకరించిరి. ఇతడు మనుష్యులకు మాత్రమేగాక జంతువులకును, వాయువునకును, అగ్నికి, నాత్మలు కలవనియు, ఆ కారణముచే నెట్టి జీవహింసయు చేయకూడదనియు బోధించెను. ఇదియే అహింస సిద్ధాంతము.

జైనులు మోక్షసాధనములగు పుణ్యక్షేత్రములను స్థాపించిన జినులు లేక తీర్థంకరులు ఇరువదినలుగు రుండిరని చెప్పుచున్నారు. జైనులీ తీర్థంకరులను ముఖ్యముగా బూజింతురు. ఈ యిరువదినలుగురు తీర్థంకరులలో పార్శ్వనాథుడును, మహావీరుడును కడపటివారు.

బౌద్ధులవలనే జైనులుకూడ నాస్తికులే. వీరు ప్రకృతి, అంతరంగము, జీవాత్మలు అను వాటితోకూడియున్న ప్రపంచము నిత్యమని నమ్ముదురు. ప్రపంచమంతటికిని దేవుడొకడు వేరుగనున్నాడని యీ మతమువా రంగీకరించరు. వీరి నీతివిధు లుత్తమములైనవి.

పండ్రెండేండ్లు సన్యాసిగానుండుటయు, శరీరమును కృశింపజేయుటకు నతి కఠినమగు వ్రతము లాచరించుటయు, మోక్షసాధనములని నమ్ముదురు. దిగంబరుడై యెన్నిపురుగులు కరుచుచుండినను లక్ష్యపెట్టక నేలను కదలక మెదలక పరుండి యుండగలవాడే నిజమైన భక్తుడు. నిర్వాణప్రాప్తి హేతువగు పండ్రెండేండ్ల సన్యాస దీక్షానంతరము, తన యింద్రియములను జయించుకొనలేకపోయినను, కఠిన వ్రతముల నాచరింప శక్తిలేకపోయినను ఆత్మహత్య చేసికొనవచ్చును. జైనసన్యాసి

యీ క్రింది నైదునియమములకు లోబడియుండవలెను. (1) ఎట్టి జీవహింసయు జేయకుండుట, (2) అసత్యమును, కోపమును, ఉల్లాసమును విసర్జించుట, (3) దొంగ తనము చేయకుండుట, (4) త్రికరణశుద్ధి కలిగియుండుట, (5) ఇహలోక ఆశలన్నియు విడిచిపెట్టుట.

క్రీ. శె. 82-వ సం॥న జైనులు రెండు శాఖలైరి. వీరిలో నొక శాఖ సన్యాసులు బట్టలేమియు వేసుకొనకుండుటచే వారికి దిగంబరులను పేరువచ్చెను. రెండవ శాఖ సన్యాసులు తెల్లని బట్టలు కట్టుకొనుటచే వారికి శ్వేతాంబరులను పేరు కలిగెను.

## D. THE SIX GREAT PHILOSOPHICAL SYSTEMS.

షడ్దర్శనములు.

I. Their Date. కాలము.—షడ్దర్శనములను పేరుగల సుప్రసిద్ధ తత్వశాస్త్రములు ఆరును ఉపనిషత్తులనుండి క్రమముగా ననేక శతాబ్దములలో నేర్పడెను. ఇప్పటి యీయారు తత్వశాస్త్రములకుగల శాఖోపశాఖలు క్రీ. పూ. 600-వ సం॥లకు వెనుక పది శతాబ్దములలో గ్రమక్రమముగా నెప్పుడో వచ్చియుండవలెను. ఈ శాస్త్రములు బుద్ధునికి వెనుక పుట్టినవనుటకు సందేహముండదు.

II. The Goal Sought. ఇవి చూపెడు గమ్యస్థానము.—ఈ సిద్ధాంతములు భక్తజనమునకు నాలుగు గొప్ప గమ్యస్థానములను జూపుచున్నవి. అవేవనగా:—(1) సాలోక్యము అనగా సగుణబ్రహ్మలోకములో ఆయనతో కూడ నుండుట, (2) సామీప్యము అనగా ఆయనకు మిక్కిలి దగ్గరగానుండుట, (3) సారూప్యము అనగా దేవుని రూపముననుండుట, (4) సాయుజ్యము అనగా పరబ్రహ్మములో లీనమైపోవుట. ఈ మొదటి రెండింటికి నర్థమొకటియే.

III. Brief Description of the Six Great Philosophical Systems. షడ్దర్శనముల క్లుప్త వివరణము.

1. The Sankhya — Evolution. జీవవృద్ధి వ్యాపకములనుగూర్చిన సాంఖ్య సిద్ధాంతము.—ఈ సిద్ధాంతప్రకారము రెండు నిత్యపదార్థములు జగత్తునకు మూలకారణములు. (1) అందొకదానికి ప్రకృతి, శక్తి, ప్రధానము అను నామములు గలవు. ఇది స్వతంత్రముగ వృద్ధియగుచు మార్పునొందగల పదార్థము. ఈ మహాశక్తి యెడతెగక సృష్టికార్యమును చేయుచునేయుండును. (2) రెండవ మూలకారణము పురుష. ఇది శాశ్వతపదార్థము, స్వయంభువు. ఇది జీవాత్మ. దేనికిని కర్తగాదు. భిన్నభిన్న జీవాత్మలరూపముల నుండును. ఇది యాత్మస్వరూపము లేక పురుషస్వరూపము. ఇట్టి జీవాత్మలు లెక్కలేనివిగా నుండును. ఈ సిద్ధాంతోను సారముగ ప్రకృతియు, లెక్కలేని నిత్యజీవాత్మల సర్వరూపియగు పురుషుడును కలియుటచే బ్రపంచసృష్టి యగును.

2. The Yoga — Asceticism. సన్యాసయోగము.—యోగము అను పదము కలియుట యను అర్థముగల 'యుజ్' యను పదమునుండి పుట్టెను. కావున

జీవాత్మ పరమాత్మలో లీనమగుట దీని ముఖ్యోద్దేశము. ఇది మనస్సును, ప్రకృతి పదార్థము సముదాయమునుండి వేరుపరచుకొను విధానమును బోధించుచున్నది. ఈ యోగము సిద్ధించుటచే జ్ఞానోదయమై జన్మాంతరవిముక్తి కలుగును. ఇది యీ యోగముయొక్క మొదటి యుద్దేశము. రెండవది యద్భుత శక్తులను సంపాదించుట.

3. The Nyaya—Logic. న్యాయము అనగా తర్కశాస్త్రము.—ఈ శాస్త్ర మిప్పటికాలములోకూడ తత్వజ్ఞానము సంపాదించుటకు మార్గదర్శిగాను, మూలాధారముగానున్నది. ఇది వ్యాకరణము, తర్కము, అలంకారమను వివిధవిషయములను విశదీకరించు వివరణగ్రంథమై యున్నది.

4. The Vaiseshika — Atomic Theory. వైశేషికము లేక అణువుల సిద్ధాంతము.—ఇదియు న్యాయసిద్ధాంతము చెప్పినట్లే జగత్తంతయు దేవుని నిర్ణయముచొప్పున స్థూలములును, సూక్ష్మములును, నిత్యములునగు అణువులు, జీవుల ప్రారబ్ధకర్మనుబట్టి కూడుటచే నేర్పడెనని చెప్పుచున్నది. ఈ అణువు లతిసూక్ష్మములును, అదృశ్యములునై యున్నవి.

5. The Karma, or Purva Mimamsa — Ritualism. పూర్వమీమాంసము అనగా కర్మకాండ.—ఈ పూర్వమీమాంసశాస్త్రము హిందూవేదములను పరమప్రమాణములుగ నెంచుచున్నది. వేదకర్మలు, యజ్ఞములు, రహస్యమంత్రములు, స్తోత్రములు, ఉచ్చాటన మంత్రములు మొదలైనవాటినిగూర్చి విశదపరచును. వేదములకుమాత్రమే శ్రుతులు అను నామమిచ్చిరి. శ్రుతి యనగా వినబడినది లేక ప్రకటితమైనది. తక్కిన హిందూమత గ్రంథములన్నిటికి స్మృతులని పేరు. స్మృతి యనగా జ్ఞప్తియందుంచుకొనునది. ఈ పూర్వమీమాంస మాద్యంతములులేని వేదములను ఋషి మతానుసారముగ వ్యాఖ్యానము చేయుచున్నది. ఈ పూర్వమీమాంస శాస్త్రము కర్మమును బోధించును.

6. The Vedanta, or Uttara Mimamsa—Monism. వేదాంతము లేక ఉత్తరమీమాంస.—వేదాంతసిద్ధాంతము కేవలము అద్వైతము, అనగా విశ్వమే బ్రహ్మయను సిద్ధాంతమును బోధించుచున్నది. దీనిప్రకారము పరమాత్మయనగా పరబ్రహ్మము ఎట్టి మార్పునొందని వస్తువు గనుక సత్యపదార్థము.

లింగభేదములులేని యీ బ్రహ్మము అనగా నిర్గుణబ్రహ్మము అజ్ఞానము అవిద్యలను మాయతో శాశ్వతసంబంధము కలిగియున్నాడు. అట్టి స్థితిగల యీ నిర్గుణ బ్రహ్మము సగుణబ్రహ్మ యగుచున్నాడు. అప్పుడే సగుణబ్రహ్మ అనగా ఈశ్వరుడు ఈ మాయాసంబంధమగు ప్రపంచమును సృష్టించి పాలించి లయముచేయువాడు.

సత్యపదార్థము బ్రహ్మము ఒక్కటే అనియు జీవాత్మ బ్రహ్మస్వరూపమనియు, నెరుగకుండుటయే జీవాత్మకు గల బంధకములకు గారణమైయున్నది. అజ్ఞానమువలన సంకల్పము పుట్టును. సంకల్పము కర్మలను జేయించును. కర్మవలన జన్మములు గలుగును. కావున అజ్ఞానవిమోచనమగుటకు జీవాత్మయు, బ్రహ్మయు నొకటే యను జ్ఞానమును గలిగియుండవలెను. ఇదియే మోక్షము.

# ఐదవ అధ్యాయము

# CHAPTER V

## భగవద్గీత

## The Bhagavadgita

భగవద్గీత రమారమి క్రీస్తు శకారంభమునకు బిమ్మట రచించినదైనను, నిజముగ బ్రాహ్మణమతాంతర్భాగమగు తత్వశాస్త్రముతో సంబంధించియుండుటచే, దీనిని గురించి యీ సందర్భమున చర్చించుచున్నాము.

**A. ITS POPULARITY.** ఇది సర్వజనసమ్మతమగు గ్రంథము.—హిందువులు తక్కిన మతగ్రంథములన్నిటిలో దీనియెడలనే యెక్కువ భక్తియును గౌరవమును గలిగియున్నారు. ఇది సర్వజనాంగీకారమై యుండుటకు గల కారణములలో కొన్నింటిని విశదీకరించుచున్నాము.

1. దీని శైలి యతి మధురముగను, మనోహరముగను నున్నది. ఈ గ్రంథకర్త దీనియందు ననేక గంభీరభావములు బహు సొగసుగ వర్ణించియున్నాడు.

2. సగుణుడగు మానవుడు తాను భక్తి శ్రద్ధలతో నారాధించుటకు నొక సగుణమూర్తినే కోరుచుండును గాని యుపనిషత్తులును, షడ్దర్శనములును వర్ణించుచున్న కేవల జడస్వరూపమును, సర్వమయుడును నగు నిర్గుణబ్రహ్మమును గోరుట సహజముకాదుగదా? కావున నీ గ్రంథము భక్తి యను నూతనమార్గమును గల్పించెను. ఇది కృష్ణుడు ఇష్టదేవతగను, పరబ్రహ్మముయొక్క యవతారముగను, విమోచకునిగను భావించి యతనియందు భక్తికలిగియుండవలెనని బోధించుచున్నది.

3. తత్వశాస్త్రజ్ఞులు బోధించిన నిర్గుణబ్రహ్మయెడల నేనరుడును భక్తి ప్రేమలు గలిగియుండుట సాధ్యముకాదు. ఇంతేగాక యా బ్రహ్మమువలన నెవరికని నెట్టి ప్రయోజనమును లభింపనేరదు. ఈ హేతువుచేత నా బ్రహ్మమునకు బదులుగా నందరును మిగుల గౌరవించి, ప్రేమించుటకు తగిన సగుణమూర్తిని వర్ణించినయెడల జనులకు నుపయుక్తమని భావించి, యీ గ్రంథము వ్రాసిరి. అయినను దీనియందు పామరులు గ్రహింపజాలని గంభీర తత్వభావములున్నవి.

4. విద్వాంసుల తత్వసిద్ధాంతభావములకును పామరజనులకు పురాణగాథలయందు గల కోరికకును, భంగముకాకుండ సర్వజనసమ్మతమగు మార్గము నుపదేశించుచున్నది.

5. ఈ గ్రంథ మెప్పటికిని సన్యాసులు కాజాలని సామాన్యజనులును, ప్రాచీన వేదవిధులకు విరుద్ధముగా శూద్రులును, స్త్రీలునుకూడ మోక్షరాజ్యమునకు నర్హులని చాటించుచున్నది.

6. భగవద్గీత సర్వలోకమును వశముజేసికొని, ప్రమాణగ్రంథములలో నొక
టగుటకు మూలకారణము, పరబ్రహ్మముయొక్క యవతారమగు కృష్ణుడే. ఇతడు
పరమాత్మస్వరూపుడగు నరమూర్తియు, సర్వజనులకు నతి ప్రియుడునగు దేవుడైయు
న్నాడు. ఈ యవతారసిద్ధాంతముకూడ క్రొత్తగ గల్పించినదే.

7. ఈ గ్రంథమును సర్వవిషయ సారసంగ్రహమనవచ్చును. ఇందు వివిధ
తత్వశాస్త్రములనుండి సంగ్రహించి కొన్ని సూత్రములుమాత్రమే చేర్చియున్నందున,
బరస్పరశాస్త్రవిరుద్ధములు కనబడుచుండుట యాశ్చర్యముగాదు. కృష్ణుడే సత్య
పదార్థమగు పరబ్రహ్మమనుటవలన అద్వైతమగుచున్నది. కృష్ణుడు సృష్టికర్తయు,
పాలకుడని చెప్పుటవలన ఈశ్వరమతమగుచున్నది. భక్తి శ్రద్ధలతో నేదేవత నారా
ధించినను కృష్ణుని నారాధించినట్లే యనుటవలన బహు దైవతమతమును నొప్పుకొను
చున్నది. పురుషప్రకృతివాదము నంగీకరించి నిరీశ్వర సాంఖ్యమతమును, యోగా
భ్యాసము విధించుచు యోగశాస్త్రమును, సర్వము బ్రహ్మమయము, జగత్తు మాయ యను
సిద్ధాంతమును స్వీకరించి వేదాంతశాస్త్రమును బోధించుచున్నది. ఇంతేగాక సర్వ
శాఖలవారును కృష్ణునొక్కనినే ఆరాధించునట్లుచేసి, వారిలో నన్యోన్యమైత్రిని
బుట్టించుటకు బ్రయత్నించుచున్నదనుటకు నెట్టి సందేహమును లేదు. ఈ గ్రంథకర్త
పరస్పరభేదముల రూపుమాపి, సమాధానముజేయుటలో మిగుల బ్రవీణుడుగ
గాన్పించుచున్నాడు.

B. DATE. భగవద్గీత రచనకాలము.—ఎప్పుడో పురాణకాలారంభ
మున కురుపాండవులు రాజ్యాధికారముకొరకు కురుక్షేత్ర యుద్ధరంగమున బోరాడ
బోవుచుండగా, అచ్చట యవతారపురుషుడగు కృష్ణుడు భగవద్గీతను అర్జునునకు నుప
దేశించెనని హిందువులు వాదించుచున్నారు గాని యిది మహాభారతములో ఆరవ
పర్వమునందుండుటనుబట్టి మనము బాగుగ నాలోచించినయెడల దీనికాలమును
వేరొకరీతిగ తీర్మానముచేయవలసివచ్చును. ఈ భగవద్గీత మహాభారతములోని భీష్మ
పర్వమందలి ముఖ్యమగు భాగమగుటచే, దీనిని రచియించినకాలమును నిర్ణయించుటకు
నా పురాణమంతయు వ్రాసినకాలమును చర్చింప నవసరముండదు. ఏలననగా
నీ కావ్యమంతటిలో మొదట 8,800 ద్విపాద శ్లోకములుండెననియు, పిమ్మట నవి
24,000 అయ్యెననియు, కడపట వివిధ యుపగాథలుచేరి యిప్పటికి 100,000 శ్లోక
ములుగల గ్రంథమయ్యెననియు నీ భారతమే చెప్పుచున్నది. కావున మనమే యుప
కథయొక్క కాలమును నిర్ణయింపగోరుదుమో, దానినిగురించియే చర్చింపవలెను.
భగవద్గీతయొక్క కాలమును నిర్ణయించుటకు మొదట కురుక్షేత్రయుద్ధము జరిగినకాల
మును, నటుపిమ్మట భగవద్గీత గ్రంథరూపముగ నేర్పడినకాలమును కనుగొనవలెను.

1. Date of the Battle of Kurukshetra. కురుక్షేత్ర యుద్ధకాలము.—
కురుక్షేత్ర యుద్ధకాలమును నిర్ణయించుటకు ముందుగ వేదములను బరిశీలించెదము.
ఋగ్వేదకాలమున హైందవార్యులు సింధునదియొక్కయు, దాని యుపనదుల
యొక్కయు ప్రాంతములలో నివసించుచుండిరని తెలియుచున్నది గాని, యజుర్వేద

కాలమున సట్లెజినదికిని, గంగా యమునానదుల సంగమస్థానమునకును మధ్యభూమియందు నార్యులు నివసించిరి. ఈ ప్రదేశమందే కురుక్షేత్రముండెను. కృష్ణయజుర్వేదము ధృతరాష్ట్రుడను నొక ప్రసిద్ధపురుషునిగూర్చి చెప్పుచున్నది. ఇతడు కృష్ణయజుర్వేదకాలమునకు బూర్వమందుండినవాడు కాడు. ఈ వేదము భారతయుద్ధమునకు బూర్వము వేరువేరు తెగలుగనుండిన కురుపాండవు లీ వేదకాలమునను, అటుపిమ్మటను, నేకకుటుంబముగా నున్నారని చెప్పుచున్నది. ఈ యుద్ధశూరులలో గొందరి నామములు పురాతన బ్రాహ్మణములలో గొన్నిటియందు గలవు. దీనినిబట్టి కురుక్షేత్రయుద్ధము ఋగ్వేదకాలమునకు, కృష్ణ యజుర్వేదకాలమునకును మధ్య జరిగెనని తేటతెల్లమగుచున్నది.

2. Date of the Writing of the Bhagavadgita. భగవద్గీత లిఖితమైన కాలనిర్ణయము.—ఈ కాలనిర్ణయ మీ క్రిందివిధముగ జేయవచ్చును.

(*a*) భగవద్గీతయందలి సిద్ధాంతములు ఉపనిషత్తులనుండియు, సాంఖ్య, యోగ, వేదాంతశాస్త్రములనుండియు గైకొనియుండిరి.

(*b*) అవతారసిద్ధాంతము, అనగా పరబ్రహ్మము కృష్ణునిరూపమున భూలోకమందు నవతరించెననెడు ప్రాముఖ్య గీతా సిద్ధాంతమువంటిది, వేదములలోగాని బ్రాహ్మణములలోగాని పురాతన యుపనిషత్తులలోగాని సూత్రములలోగాని కానవచ్చుటలేదు. కాని ధర్మశాస్త్రకాలపునాటిదియగు అధర్వ వేద ఉపనిషత్తులలో దీనినిగురించిన ప్రస్తాపన మొట్టమొదట కనబడుచున్నది.

(*c*) కృష్ణుడు కురుక్షేత్ర యుద్ధరంగమున తాను పరబ్రహ్మమొక్క యవతారమునని నిజముగా చెప్పకొనియే యుండినయెడల, జనులతనిని నారాధించియుందురు; లేదా దైవదూషకుడని యెంచియుందురు. కాని యీ రెండంశములలో నేదియు శతాబ్దములకొలది దీనితరువాత వ్రాసిన తదితర గ్రంథములలో దేనియందును గానరాదు. ఛాందోగ్యోపనిషత్తునందు దేవకీపుత్రుడగు కృష్ణుని నామమున్నదిగాని యితడు ఘోరాంగిరసునికి శిష్యుడుగనుండి తత్త్వబోధనొందుచుండిన సామాన్యమానవుడుగ గానవచ్చుచున్నాడు. మహాభారతమందలి యతి పురాతనభాగములలో నితడు మనుష్యమాత్రుడుగను, రాజుగను, యుద్ధవీరుడుగను, కనబడుచున్నాడు. పిమ్మట మహాభారతమందలి తర్వాతి పర్వములందును, మరికొన్ని యితర గ్రంథములందును, అర్జునునితో సమానుడగుచు అర్ధదేవాంశగల నొక యుపదేవతయైయున్నాడు. అటు పిమ్మట మహాభారతములో చివరభాగములయందును, భగవద్గీతలోను, అధర్వ ఉపనిషత్తులలోను, కొన్ని పురాణములలోను నితడు పరమాత్మునియొక్క యవతారమని చెప్పియున్నది. తుదకితడు పురాణములలో నీతిలేనివాడుగ కనబడుచున్నాడు.

(*d*) భగవద్గీతయందలి 2: 46 లో వేదములనుగూర్చియు, 17: 23 లో బ్రాహ్మణములనుగూర్చియు, 15: 15 లో ఉపనిషత్తులనుగూర్చియు, 13: 3 సూత్రములనుగూర్చియు, 16: 23, 24 లో ధర్మశాస్త్రములనుగూర్చియు ప్రస్తా

పనలు గలవు గనుక భగవద్గీతను ఈ పైనజెప్పిన గ్రంథములు రచించినకాలమునకు బిమ్మట నే వ్రాసిరని విశదమగుచున్నది.

(e) కురుక్షేత్ర యుద్ధకాలమున నార్యులు మాట్లాడుచుండిన భాష వేదముల యందలి సంస్కృతమేగాని, అధర్వ ఉపనిషత్తులను, భగవద్గీతను కావ్యశైలిని వ్రాసి యున్నారు. ఈ వేదభాషకును, కావ్యభాషకును విశేషభేదము గలదు. ఈ భేదము ప్రయోగించిన పదములలోను, వ్యాకరణప్రయోగములలోను గానబడుచున్నది. కావున గీతాగ్రంథమును గ్రహింపగలవాడు వ్యాకరణశాస్త్రముయొక్కయు వేద నిఘంటువుయొక్కయు పూర్వపరిచయములేనిదే వేదమును గ్రహింపజాలడు.

(f) మహాభారతయుద్ధము క్రీ. పూ. 3101-వ సంవత్సరమున జరిగెనను నమ్మకము హిందువులలో పారంపర్యముగ వచ్చుచున్నదిగాని ప్రస్తుతకాలపు విద్వాంసులలో ననేకు లాయుద్ధము క్రీ. పూ. దాదాపు 1000-వ సంవత్సరమున జరిగెనని యభిప్రాయపడుచున్నారు. పై నుదహరించిన హేతువులనుబట్టి భగవద్గీత గ్రంథ రూపముగ వచ్చినది క్రీ. పూ. 300 సం॥ కును, క్రీ. వె. 800 సం॥ కును మధ్య కాలమని నిర్ణయించుచున్నారు. పండితులలో ననేకులు క్రీ. వె. 800 సం॥ మును నంగీకరించుచున్నారు గావున మహాభారతయుద్ధమునకును, గీతారచనకును మధ్య 700 నుండి 1800 సంవత్సరములు గతించిపోయెను. కృష్ణుడు పరబ్రహ్మముయొక్క యవతారమని కనుగొనుటకు నిన్నివందలయేండ్లు పట్టియుండుట యాశ్చర్యముకాదా!

## C. THE AIMS OF THE GITA. భగవద్గీతయొక్క ముఖ్యోద్దేశములు.—

1. కృష్ణునియొక్క యారాధన సర్వత్ర వ్యాపింపజేసి, శైవమతమునకు విరోధముగ వైష్ణవమతమును స్థిరముగ స్థాపించుటయే, గీతయొక్క ప్రధానోద్దేశమై యున్నది. గీత 2: 23 లో నుండులాగున శివపూజను గీత బహిరంగముగా ఖండింప కున్నను, కృష్ణుడు పరమేశ్వరుడగు విష్ణువుయొక్క యవతారమనునది, యందలి ముఖ్య సిద్ధాంతమైయున్నది.

మహాభారత ద్రోణపర్వమునందు ద్రోణుని మరియొకవిధమున జంపుట యసాధ్యమగుటచే నన్యాయముగ జంపుడని కృష్ణుడు పాండవులకు సలహానిచ్చు చున్నాడు. ఈ విషయమై మహాభారతము 9: 34, 45 లను చూడుము. అంతేగాక ద్రోణునితో నతని కుమారుడు చనిపోయెనని చెప్పి, యతను యుద్ధముచేయకుండ జేయుమని కృష్ణుడు పాండవులలో నొకడగు యుధిష్ఠిరుని పురికొల్పినట్లు కూడ భారత ద్రోణపర్వమునందు గలదు. ఇట్టివాడైనను కృష్ణుడు దేవుని యవతారమని నమ్ము చున్నారు. విష్ణుపురాణమునందును, భాగవతపురాణమునందును వర్ణించియున్నట్లు, ఇతని బాల్యదశయందు జేసిన సాహసకార్యములకును, యౌవనదశయందు గావించిన నీతిమాలిన కృత్యములకును, నెట్టి సమాధానము జెప్పగలరో తెలియకున్నది. ఇట్టి దుర్గుణములుగలవానిని హిందువులు పరమాత్ముని యవతారమని నమ్ముటకు గారణముండ వలెనుగదా? ఇందుకు రాజకీయమత కలహములు హేతువులై యుండవలెను.

ఆ కాలమున బౌద్ధమతము బ్రాహ్మణమతమునకు ప్రబల శత్రువైయుండెను. ఈ బౌద్ధమత మొకప్పుడు దేశమంతయు చాలామట్టుకు నాక్రమించుకొనునట్లుండెను. ఈ మతము బ్రాహ్మణమతాచార్యులయొక్క బానిసత్వమునుండియు, కులదాస్యము నుండియు ననేకులకు విమోచన కలిగించెను. కావున ప్రజలలో ననేకులకు బుద్ధు డిష్టదైవమయ్యెను. ఇట్టి స్థితికి తోడుగా బౌద్ధసన్యాసులవలనను, వారి మఠముల వలనను దేశమంతటను హిందూసంఘమునకు గొప్ప దురవస్థ తటస్థించుచుండెను. కావున నీ బౌద్ధమతవ్యాపకమును భంగపరచుటకు బ్రాహ్మణులు జనసమ్మతుడగు దేవుని నొకని కల్పించిరి. అందుచేత హిందువుల యాచార్యులు స్త్రీపురుషులకుగల నీచబుద్ధులకు ననుగుణ్యములగు కథలను కృష్ణునిగూర్చి వ్రాసి, యతనిని పామరజన ప్రియుడగు దేవునిగ జేసినట్లున్నది. దీనితోబాటుగ కులభేదములు తిరిగి తలయెత్తెను. నీతిమంతుడగు బుద్ధుడు బ్రాహ్మణమతధాటికి నోడిపోయెను. అతని మతము తన భూమియందు నిర్మూలముకాబడెనుగాని యిందుకు ప్రతిఫలితముగా నాటినుండి నేటి కిని హిందూదేశమున దుర్నీతి వృద్ధియగుచునేయున్నది.

2. భగవద్గీత పరబ్రహ్మలో లీనమగుటకు సాధనమగు కర్మయోగమును బోధించుచున్నది. కులధర్మములును, మతాచారములును, దానధర్మములును, కర్మయోగము నకు నంతర్భాగములైయున్నవి.

ఒండొంటికి నెదురుగా నిలువబడియున్న సైన్యములనుజూచి, అర్జునుని మెత్తని హృదయము కరిగిపోయెను. యుద్ధమునకును, జననాశనమునకును, ననుకూలములగు కృష్ణుని వాదములు, ఆత్మకు మరణములేదను భావముమీద నాధారపడి యున్నవి. ఈ సిద్ధాంతము అధర్మయుద్ధమును, నరహత్యయును పాపములుకావనియు నుపదేశించుచున్నది. దీని ననుసరించియే కృష్ణుడు చంపుట క్షత్రియధర్మమగుటచే శత్రుసంహారముచేయుమని అర్జునుని ప్రోత్సాహపరచెను.

భగవద్గీత కులభేదముల నంగీకరించి, ఆయా కులములవారనుసరింపవలసిన ధర్మములను నిర్ణయించుచున్నది. కాని సర్వకర్మలను నిష్కామబుద్ధితో అనగా ఫలము కోరకుండా చేయవలెను. ఏలననగా నిష్కామబుద్ధితో గర్మలు చేయువానిని కర్మలు బంధించవు గనుక పాపములంటకుండును. ఈ యంశమునుగూర్చి భగవద్గీత 2: 47, 48; 3: 7, 8; 4: 14; 5: 10 చూడుము.

ఒకని కోరికలు ఏవైనను అతనికి స్వేచ్ఛయున్నదనుట పట్టి మాయయైయున్నది. ఎందుకనిన అతడు దైవనిర్ణయ ఏర్పాటునకు లోబడితీరవలెను. అర్జునుడు తానొక ప్రత్యేకమైన యునికిగలవాడననియు, యుద్ధమాడకుండుటకు తనకు స్వేచ్ఛయున్న దనియు నమ్మినయెడల, యుద్ధమాడుటకు తనకు మనస్సులేకపోయినను దానిని బలవంతముతో తాను తప్పక చేయవలసియుండునని గ్రహించును. సర్వదా కార్యక్రమమును నడిపించు ప్రకృతియు, తన స్వభావసిద్ధమైన ప్రారబ్ధకర్మయు, ఈ బలవంతమునకు మూలహేతువులు. అర్జునునికిని, సకలమానవులకును, తమ జీవితవృత్తులను జరిగించుకొనునట్లు ఈ స్వభావమును కృష్ణుడు సంకల్పించి అనుగ్రహించుచున్నాడు అని భగవద్గీత 18: 60 లో నున్నది.

3. కృష్ణుడు పరబ్రహ్మాయవతారమను సిద్ధాంతము స్థాపించుట భగవద్గీత యొక్క మరియొక యుద్దేశమైయున్నది. భగవద్గీత మొదటినుండి కడవరకు నీ సిద్ధాంతమును నిరూపింప యత్నించుచున్నను, ఈ గ్రంథ మంగీకరించుచున్న వేదాంతుల మాయాసిద్ధాంతము ననుసరించి కృష్ణుని యవతారముగూడ మాయకాదాయని దీనిని జదువువారడుగక మానరుగదా? భగవద్గీత 4: 7, 8 లో నున్నట్లు కృష్ణుడు లోకములో నధర్మము హెచ్చినప్పుడు ధర్మమును స్థాపించుటకు నవతరించెదనని చెప్పుకొనుచున్నాడు. అయినను భాగవతపురాణము కృష్ణుడు చేసిన యనేక ధర్మ విరుద్ధకార్యములను వివరించినపిమ్మట, దశమస్కంధములో 27 మొదలు 40 వరకు గల శ్లోకములలో "మహాపురుషులయందు గానవచ్చెడి దుర్మార్గములను, సాహస కార్యములను దోషములని యెంచరాదు" అని సమాధానము చెప్పుచున్నది. ఇందువలన నీతివిధులను నాచరించుటలో మానవులకును, దేవతలకును భేదముగలదని తేటపడుచున్నది. ఇట్టి యధర్మ దేవతామూర్తులనుండి మనహృదయములు అవశ్యముగ బరిశుద్ధేశ్వరునియొక్క సత్యావతారియగు యేసుప్రభువు వైపునకు మరలకుండునా? సత్యదయాధర్మాది భగవంతుని యుత్కృష్టగుణముల జక్కగ బ్రతిఫలింపజేయు, నీ పరమపవిత్రుడగు క్రీస్తుప్రభువునకు మించిన ప్రేమాస్వరూపియు, పరిశుద్ధుడునగు మరియొక దేవునిని గల్పించి, జగద్గురువుగను, మార్గదర్శిగను జేయగలరా?

4. భగవద్గీతకుగల ఇంకొక యుద్దేశమేమనగా నిర్వాణము నొందగోరువారు కృష్ణుని పరబ్రహ్మస్వరూపముగ భావించి యారాధింపవలెననియే. ఈ భక్తియోగము లేక భక్తిమార్గము నూతనసిద్ధాంతము. దీనినిగూర్చి గీతయందనేకచోట్ల కనబడుచున్నది. గీత 6: 47; 7: 23; 8: 7; 9: 14, 26, 29, 31; 12: 6—8; 18: 58, 66 చూడుము. కొంద రీ సిద్ధాంతము క్రైస్తవమతమునుండి గైకొనియుండిరని నిరూపింప జూచిరిగాని యిట్టి యభిప్రాయమునకు దగిన రుజువులులేవు. భక్తిపరవశులుగజేసి, యుద్రేకముతో గంతులువేయించుచుండు, నీ భక్తిమార్గ మంగీకరింపదగినది కాదు. కారణమేమనగా నీ సిద్ధాంతానుసారముగ నేకకాలమందే భక్తుడు నిర్గుణబ్రహ్మమందేగాక కృష్ణునియందును లక్ష్యముంచవలెనుగాని యిట్టిది యసాధ్యము. కృష్ణునివలెనతని భక్తులును నీతివిరుద్ధమగు విపరీతచేష్టలయందు దగులుకొనక మానరుగదా? ఈ దేవత నారాధించుటకు యోగ్యమగునా కాదా యని యుక్తాయుక్త వివేచనచేసిన మీదట, తన యిష్టదైవముగ జేసికొనుటయే సత్యమగు భక్తిమార్గముసుమండి. కృష్ణుడు తన భక్తసమాజము నెట్టిస్థితిలో నుండనిచ్చుచున్నాడో, యేసుక్రీస్తు ప్రభువు తన భక్తసంఘము నెట్టి పరిశుద్ధస్థితిలోనుంచ బ్రయత్నించుచున్నాడో—ఈ రెండు విషయముల నాలోచించి చూడుము. ఎఫెసీ 5: 25—27 వచనములను చదివి చూచువారు ఈ యిద్దరికి నెంత వ్యత్యాసముగలదో గ్రహించగలరు.

5. భగవద్గీతయొక్క యైదవ యుద్దేశమేమనగా సాంఖ్య, యోగ, వేదాంత తత్వశాస్త్రములను సమ్మతిపరచుట. కాబట్టి భగవద్గీత షడ్దర్శనసంగ్రహముగ నున్నది. గీతయందలి యీ భిన్నభిన్న మతభావములకు జ్ఞానయోగము లేక జ్ఞానమార్గమని పేరుపెట్టిరి. ఇట్టి పలువిధములగు తత్వసిద్ధాంతములు కలసియుండు భగవద్గీతయందు

మోక్షమునకు అనగా బ్రహ్మసాయుజ్యమునకు కర్మమార్గము, భక్తిమార్గము, జ్ఞానమార్గమను నీ మూడు త్రోవలు కనబడుచున్నవి.

6. భగవద్గీత గ్రంథకర్తకుగల ఆరవయుద్దేశ మేమనగా, హైందవులందరు నీ నూతనమతమును నవలంబించునట్లు చేయుట, గనుకనే బ్రాహ్మణులు దేవతలందరికి సమానగౌరవమిచ్చి, ఏదేవత నారాధించినను పరమాత్మను నారాధించినట్లేయని గీత ద్వార బోధించిరి.

## D. SUMMARY OF THE ARGUMENT OF THE BHAGAVAD GITA. భగవద్గీత యధ్యాయముల సంగ్రహము.

కురుక్షేత్రయుద్ధ వృత్తాంతము అంధుడగు ధృతరాష్ట్రమహారాజునకు సంజయుడు సవిస్తరముగ వినిపించెను.

**అధ్యా. 1.** శ్లో. 1—11 లలో యుద్ధసేనలయొక్క వర్ణన యున్నది. రథారూఢుడైయున్న అర్జునుడు కురుపాండవవీరులగు తన బంధుమిత్రాదులను చూచి జాలిపడి వారిని తన చేతులార చంపుటకు మనస్సు ఒప్పకుండుటచే తన రథసారథి యగు కృష్ణునితో బంధుమిత్రవధకంటె ఆత్మహత్యయే తనకు శ్రేయస్కరమని చెప్పుచు యుద్ధముచేయుటకు ఇష్టపడకుండెను (శ్లో. 12—47).

**అధ్యా. 2.** కృష్ణుడు అర్జునుని పిరికితనమునకు చీవాట్లువేసి యుద్ధముచేయుమని పురికొల్పెను. అర్జునుడైతే కృష్ణుని హితవాక్యములు చెవినిపెట్టక ఏది క్షత్రియులకు ధర్మమని ప్రశ్నించెను (శ్లో. 1—9). వివేకజ్ఞానములేనివాడగుటచే అర్జునుడు అనవసరముగ దుఃఖములో మునిగియున్నాడనియు కంటికి కనపడు దేహమునకును అందు నివసించియుండు ఆత్మకును గొప్పభేదమున్నదనియు కృష్ణుడు బోధించెను. ఆత్మకు హానికలుగచేయుట ఎవరికిని సాధ్యముకాదు (శ్లో. 10—25). జననమరణములకు ప్రతి శరీరియు లోనైయుండును గాన బంధుమిత్రాదుల మరణమునుగూర్చి దుఃఖపడుట యుక్తముకాదు (శ్లో. 26—30). ధర్మయుద్ధముచేయుట ఉత్తమక్షత్రియుడగు అర్జునుని విధికృత్యము (శ్లో. 31—38). ఆత్మకు ప్రపంచ ధర్మములగు జననమరణ దుఃఖక్లేశములంటవు. జన్మములనుండి విముక్తినొందుటకు యోగాభ్యాసముచేయవలెను. యోగమార్గమనగా వివేకజ్ఞానముతో కూడినవాడై సంసారయాత్ర జరుపుచు, లాభనష్టములను సమదృష్టిచే చూచుచు, తాను చేయు సమస్త కర్మలయందును అభిమానములేకుండుట. ఇది బంధవిముక్తునిగ చేయును (శ్లో. 39—53). సిద్ధపురుషుడు సమస్త కోరికలను విసర్జించును. తన మనస్సు బ్రహ్మయందే నిలిపి చిత్తచాంచల్యములేక శాంతుడై, తాను బ్రహ్మస్వరూపుడై యుండును (శ్లో. 54—72).

**అధ్యా. 3.** కర్మబద్ధుడు కాకుండుట యెట్లు? ఇంద్రియములను వివేకముచే జయించుచు కర్మఫలములను కోరక సర్వకర్మలుచేయవలెను (శ్లో. 1—16). అందరును తమ విధికృత్యములను చేయవలెనుగాని ఫలమును కోరకుండ నుండవలెను. ఇట్టి నిష్కామబుద్ధియే సర్వబంధవిముక్తికి కారణమగును (శ్లో. 17—26). ఫలమును కోరక

యుద్ధము చేయుమని కృష్ణుడు హెచ్చరించెను. తన దృష్టి నిర్గుణుడగు విశ్వాత్మ మీదనే నిలిపి మానవుడొక ప్రత్యేకమైన యునికిగలవాడను భావమును విసర్జించి అహంకార రహితుడగుచు యుద్ధముచేయవలెను (శ్లో. 27—32). తన సహజ ప్రకృతి ననుసరించి ప్రతివాడును కర్మలు చేయుచుండవలెను (శ్లో. 33—35) ఇంద్రియభోగములను ఆశించుటయే పాపము, అట్టివి లభించునప్పుడు కలుగు ఆగ్రహామే దురహంకారము (శ్లో. 36—43).

అధ్యా. 4. ఈ యోగమార్గము కడు ప్రాచీనమైనదనియు అధర్మము నణచి వేసి ధర్మమును నిలుపుటకును సజ్జనులను రక్షించి దుష్టులను నాశనముచేయుటకును తాననేక అవతారములెత్తితిననియు కృష్ణుడు చెప్పెను (శ్లో. 1—8). కృష్ణుడు సాక్షాత్తుగ పరబ్రహ్మస్వరూపుడని గ్రహించి అతని అమానుషకృత్యములను సదా ధ్యానించుటవలన మానవుడు సర్వబంధ విముక్తుడగును (శ్లో. 9—12). నాలుగు వర్ణములను స్థాపించినది కృష్ణుడే. తాను సర్వకర్మలను చేయుచున్నను వాటి ఫలములను కోరకుండుటచేత తన్ను కర్మబద్ధునిగ చేయజాలవని కృష్ణుడు చెప్పెను (శ్లో. 13—15). నిష్కామముతో చేయు కార్యములు ముక్తినొందుటకు అడ్డుబండలుగ నుండవు (శ్లో. 16—23). చేయునది తాను కాదనియు సర్వమునకు కర్త పరమాత్మయనియు గ్రహించి చేయుచుండు ఈశ్వరపూజలు, యజ్ఞయాగాదులు మోక్షసాధనములగును (శ్లో. 24—33). దివ్యజ్ఞానము అజ్ఞాననాశనము చేయును. సర్వము ఏకమే అను భావమును కలిగించి సకల పాపములనుండి విడుదలచేయును. ఇట్టి పరిపూర్ణసిద్ధి ఇంద్రియములను జయించుటవలన లభించును (శ్లో. 34—42).

అధ్యా. 5. నిజమైన కర్మత్యాగమనగా కర్మలను పూర్తిగ విసర్జించుట కాదు గాని అహంకార రాగద్వేషముల విడిచి నిష్కాముడై సర్వకార్యములు చేయవలెను (శ్లో. 1—5). యోగాభ్యాసమువలన ఆత్మశుద్ధియు ఇంద్రియజయమును లభించును. తాను చేయు కర్మలు తన ఆత్మను బంధింపవు అని యోగిమాత్రమే గ్రహింపగలుగును. కావుననే కర్మఫల కాంక్షవిడిచి సమస్త కర్మలయందును మగ్నుడైయుండవలెను (శ్లో. 6—12). ఇట్టి ఫలత్యాగమువలన అజ్ఞానమును పారదోలి తాను బ్రహ్మస్వరూపుడను జ్ఞానము అనుభవమునకు తెచ్చుకొనును (శ్లో. 13—29).

అధ్యా. 6. సంకల్ప రహితుడగుట, నిష్కాముడై కర్మలనుచేయుట—ఈ రెండును ఒకటే (శ్లో. 1—4). మానవునియందు రెండు ప్రకృతులున్నవి. దివ్య ప్రకృతి; ఇది సంసారబంధవిముక్తుని సర్వదా కోరుచుండును. పిశాచప్రకృతి; ఇది అంతఃకరణ ప్రకృతి సంబంధమై మనస్సును ఆశ్రయించును. పిశాచప్రకృతిని జయించుట అనగా కోరికలు లేకుండుట, ఐహికేచ్ఛలను విడిచిపెట్టుట, సర్వదా తనదృష్టి ఆత్మవస్తువునందే నిలిపియుంచుట. ఈ మాటివలనను ఇంద్రియజయమును బ్రహ్మసాక్షాత్కారమును లభించును (శ్లో. 5—28). సర్వదా ఆత్మధ్యానము చేయుచుండుటవలన మొదట బ్రహ్మము సర్వాంతరాత్మయని గ్రహించును. సాధన చేసినకొలది కృష్ణుడు సాక్షాత్తుగ పరబ్రహ్మస్వరూపుడనే జ్ఞానము కలుగును. తుదకు పరిపూర్ణ

సిద్ధి నొందినపుడు తానును కృష్ణుడును ఒకటేయను రహస్యమును అనుభవపూర్వకముగ నెరిగియుండును (శ్లో. 29—32). పరిపూర్ణసిద్ధి నొందుటకు పూర్వమే మరణము సంభవించునెడల అట్టి యోగి తిరిగి జన్మించి, తాను పూర్వజన్మమందు ఎక్కిన మెట్టునుండియే ఈ జన్మమందు ప్రారంభించి తిరిగి సాధనచేయ నారంభించి ఈ దేహములో నుండగానే పరిపూర్ణస్థితిని బొంద ప్రయత్నించును (శ్లో. 33—47).

**అధ్యా. 7.** బ్రహ్మజ్ఞానము, సమాధియోగము, భక్తియోగము—వీటిని వర్ణించుచున్నాడు. కృష్ణుడు తన సగుణ నిర్గుణస్వరూపములను వర్ణించుచున్నాడు. ఈ రెంటినుండియే జీవులందరు పుట్టుచున్నారు (శ్లో. 1—7). దృశ్యాదృశ్యపదార్థములకన్నింటికిని తానే మూలాధారమని కృష్ణుడు చెప్పెను (శ్లో. 8—11). సత్వము, రజస్సు, తమస్సులు తనయందే యున్నవనియు (శ్లో. 12—14), తాను సర్వాంతరాత్మయగుటచే అన్యదేవతలకు చేయు పూజాసత్కారములు సర్వమును తనకే చెందుననియును వక్కాణించుచున్నాడు (శ్లో. 15—30).

**అధ్యా. 8.** కృష్ణుని నామ ముచ్చరించుచు దేహమును విడిచినవాడు మరణాంతరము కృష్ణుని లోకమునకుపోయి అతనితో నివసించును (శ్లో. 1—5). కావున సర్వకాలములందును చిత్తమును బ్రహ్మయందె నిలిపి ఓంకారజపముచేయుచుండుటవలన బ్రహ్మమును పొందగలడు (శ్లో. 6—16). చతుర్ముఖబ్రహ్మ తన పగటికాలమున సృష్టించును. తన రాత్రికాలమున లయముచేయును (శ్లో. 17—19). పరబ్రహ్మమును చేరినవారికిమాత్రమే చావుపుట్టుకలులేవు (శ్లో. 20—22). శుక్లపక్ష దేవతలకాలమునందు మరణించువారు శాశ్వత బ్రహ్మలోకవాసులగుదురు. వీరికి పునర్జన్మముండదు. కాని కృష్ణపక్ష దేవతలకాలమున చనిపోవువారు తిరిగి జన్మించుచుందురు (శ్లో. 23—28).

**అధ్యా. 9.** భూలోకమున నవతరించి కృష్ణనామము ధరించిన దేవకీనందనుడగు కృష్ణుడు నరమాత్రుడుకాక సాక్షాత్తుగ పరబ్రహ్మస్వరూపుడు అనునదియే రాజయోగ సిద్ధాంతము. ఇట్టి జ్ఞానమువలననే సర్వబంధవిముక్తులు కాగలరు. కృష్ణుడు లౌకిక కార్యములను చేయుచున్నను నిష్కామముతో చేయుచుండుటచే అతడు కర్మబద్ధుడు కాజాలడు (శ్లో. 1—14). కృష్ణుని రూపములు లెక్కకు మించినవే (శ్లో. 15—19). అన్యదేవతల నారాధించువారు తిరిగి చచ్చుచు పుట్టుచునే యుండవలెను. కృష్ణుని పూజించువారైతే అట్లుగాక కృష్ణునియందు నైక్యమై పునర్జన్మ విముక్తులగుదురు (శ్లో. 20—25). శ్రద్ధాభక్తులతో కృష్ణుని యుద్దేశించి చేయు సర్వకర్మలు కృష్ణునకు నర్పితములగును. ఇదియే భక్తియోగసారము. ఈ భక్తియోగము అగ్రజాతులవారు మాత్రమేగాక స్త్రీలును, నీచకులమువారును అభ్యసింపనగును (శ్లో. 26—34).

**అధ్యా. 10.** తాను దేవతలను మునులను, మానవులను సృష్టించుచున్నాననియు ప్రారబ్ధకర్మకు తగిన ఫలమిచ్చునది తానేయనియు కృష్ణుడు వక్కాణించెను (శ్లో. 1—11). కృష్ణుడు విశ్వరూపుడనియు, సర్వసృష్టికి మూలకారణుడనియు, ఆధారమనియు శ్లోకములు 12—42 చెప్పుచున్నవి.

**అధ్యా. 11.** కోటిసూర్యుల కాంతితో వెలుగొందుచున్న తన విశ్వరూపమును అర్జునునకు చూపించెను (శ్లో. 1—14). అట్టి గంభీరాకారమును చూచి అర్జునుడు భయకంపితుడాయెను (శ్లో. 15—31). కురుక్షేత్రవీరులందరును మృత్యువు నోట పడుటకు తాను వారి జన్మదినముననే విధించెననియు కావున వారు చావక తప్ప దనియు కృష్ణుడు చెప్పుచు అర్జునుని యుద్ధమునకు లెమ్మని ప్రోత్సాహపరిచెను. అర్జునుడు తన చేతిలో యుద్ధోపకరణమువంటివాడనియు, నిజముగా ఈ బంధుమిత్రాదుల యుద్ధరంగమున చంపువాడు తాననియు అర్జునుడు కాడనియు కృష్ణుడు తెలియచెప్పెను (శ్లో. 32—34). కృష్ణుని విశ్వరూపమును అర్జునుడు వేయినోళ్ల పొగడుచు, తన సామాన్య నరరూపమును తిరిగి ధరింపుమని కృష్ణుని ప్రార్థించెను (శ్లో. 35—46). కృష్ణుడట్లుచేసి అతని భయమును తీర్చి ధైర్యము చెప్పెను (శ్లో. 47—55).

**అధ్యా. 12.** నిర్గుణబ్రహ్మమును గాక సగుణబ్రహ్మమునే ఆరాధించవలెననియు భక్తిమార్గమునే అనుసరించవలెననియు కృష్ణుని తనకు ఇష్టదైవముగ చేసికొనవలెననియు కృష్ణుడు అర్జునునకు ఉపదేశించెను. జ్ఞానయోగముకంటె భక్తియోగమే సర్వోత్తమమైనది (శ్లో. 1—12). కృష్ణభక్తుల గుణలక్షణములను కృష్ణుడు వర్ణించెను (శ్లో. 13—20).

**అధ్యా. 13.** అనాత్మ అను క్షేత్రమునందు బీజములవలె జీవులు ఉత్పత్తి యగుచు నశించుచుందురు. పరమాత్మ అయితే క్షేత్రజ్ఞుడు, అతడు కృష్ణుడే. బ్రహ్మజ్ఞానమనగా క్షేత్రక్షేత్రజ్ఞుల యథార్థతత్త్వము నెరుగుటయే (శ్లో. 1—11). హృదయక్షేత్రమున నివసించుచున్న జీవాత్మ నిర్గుణబ్రహ్మముయొక్క ప్రతిబింబముగాని వేరొకటికాదు. బ్రహ్మజ్ఞానముతోపాటు క్షేత్రక్షేత్రజ్ఞులయొక్క తత్త్వముల నెరుగుటయును ముక్తిసాధనములు (శ్లో. 12—18). పురుషుడు అనగా సర్వాంతరాత్మ. అనాత్మ అనగా మూలప్రకృతి. వీటిని వర్ణించుచున్నాడు. ఈ రెండు మాయాస్వరూపుడగు సగుణబ్రహ్మమును మాయాతీతుడగు నిర్గుణబ్రహ్మమును అను రెండు రూపములుగల ఆద్యంతరహితుడగు శుద్ధబ్రహ్మనుండియే కలుగుచున్నవి. ఆత్మయొక్క అనాత్మయొక్క తత్త్వములను గ్రహించగలవాడు సర్వబంధములనుండి విముక్తుడగును (శ్లో. 19—23). సర్వదేహములందు సాక్షీరూపుడుగనుండిన జీవాత్మయందు పరమాత్మను చూచుటకు నాలుగు మార్గములున్నవి. సర్వబంధవిముక్తిని కోరువారు ఈ నాలుగు విధములను అనుభవపూర్వకముగ నెరిగియుండవలెను (శ్లో. 24, 25). క్షేత్రక్షేత్రజ్ఞ విభాగమును దానితోపాటుగ ఆత్మానాత్మ తత్త్వవిచారణయు అనాత్మ అనగా ప్రకృతియొక్క బంధములనుండి వెలువడునుపాయము నెరిగియుండుట వీటిద్వారా పరబ్రహ్మమును పొందగలరు (శ్లో. 26—34).

**అధ్యా. 14.** అనాత్మ మూడు గుణములతో కూడియుండును, సత్త్వము, రజస్సు, తమస్సు, ఈ మూడు గుణములందు నేది వృద్ధిగనుండునో దాని ననుసరించి మానవుని సహజస్వభావలక్షణములు ఈ జన్మయందేగాక ముందుజన్మలయందును కనబడు

చుండును (శ్లో. 1—18). మోక్షమును కోరుచుండువాడు త్రిగుణముల బంధముల నుండి విముక్తుడగుటకు కృషిచేయుచుండవలెను (శ్లో. 19-27).

**అధ్యా. 15.** కృష్ణుడు అనాత్మను లేక మూలప్రకృతిని రావిచెట్టుతో పోల్చుచున్నాడు. మోక్షేచ్ఛగలవాడు ఈ చెట్టును నిష్కామమను గొడ్డలితో నేల గూల్చవలెను (శ్లో. 1—6). కృష్ణుడు జీవాత్మరూపమున సర్వదేహములందును సాక్షిగనున్నాడు. ఇట్టి వ్యష్టిరూపమున నేగాక సర్వాంతరాత్మయై విశ్వమంతయు నిండియుండును. ఇది కృష్ణునియొక్క సమష్టిరూపము (శ్లో. 7—20).

**అధ్యా. 16.** శ్లో. 1—4 లలో దైవప్రకృతియొక్కయు అసురప్రకృతి యొక్కయు గుణలక్షణములయొక్క వర్ణన యున్నది. దైవప్రకృతి మోక్షమునకు త్రోవచూపును. అసురప్రకృతి జననమరణ సంసారసాగరమున ముంచివేయుచు నీచగర్భములందు జన్మింపచేయును (శ్లో. 5—24).

**అధ్యా. 17.** ఒకని గుణలక్షణములును, మానసికస్థితియు తాను గొల్చు చుండు దేవతయొక్క స్వభావగుణలక్షణముల ననుసరించి యుండును (శ్లో. 1—4). సత్ భక్తియు, ఈశ్వరపూజా సత్కార్యములును వేదవాక్యములందు, పరమ విశ్వాసములేకుండిన బూడిదలోపోసిన నెయ్యివలె నుండును (శ్లో. 5, 6). ఆత్మశుద్ధికి ఆధారములు (శ్లో. 7—28).

**అధ్యా. 18.** ఫలమును పొందవలెనను యుద్దేశముగల సర్వకర్మలును పూర్తిగ విసర్జించుట సన్యాసము; త్యాగమనగా కర్మలను విడువక చేయుచు ఫలమునుమాత్రము విడుచుట అనగా నిష్కాముడై కర్మలుచేయుట. కర్మలుకాదు వాటి ఫలములను ఆశించుటయే పునర్జన్మ హేతువగుటచే సమస్త కార్యములను మమకార అహంకారములు లేక చేయవలెను (శ్లో. 1—18). ఆయా మనుష్యులయందు సాత్విక, రాజసిక, తామసిక అను గుణములు హెచ్చుతగ్గులుగా నున్నవి. అందుచే జ్ఞానము, కర్మ, కర్త, బుద్ధి, ఆసక్తి, సుఖము, వీటిలో ప్రతిదియు మూడు వేరువేరు విధములుగ కనుబడును (శ్లో. 19—40). కులధర్మములను ఈశ్వరార్పణబుద్ధితో ఫలమును కోరక చేయువాడు మోక్షమును, సిద్ధియును బొందును (శ్లో. 41—55). కృష్ణుడు తన యుపదేశములను సంగ్రముగ చెప్పి, యుద్ధముచేయుమని అర్జునుని హెచ్చరించెను. స్వేచ్ఛ యున్నదనుకొనుట వట్టి భ్రమ. కృష్ణుడు మనుష్యునియందుంచిన స్వభావమునుబట్టి యొకడు నడువవలయును (శ్లో. 56—66). ఈ గీతా రహస్యములు ఎట్టివారికి నుపదేశించవలెనో గురువైనవాడు ఎరిగియుండవలెను (శ్లో. 67—71). ఇప్పటికి అర్జునుని సందేహములు తీరెను (శ్లో. 72, 73). సంజయుడు యుద్ధవర్ణన ముగించెను (శ్లో. 74—78).

# ఆరవ యధ్యాయము

# CHAPTER VI

## Institutional Brahmanism

## బ్రాహ్మణ మతాంతర్భాగమగు ధర్మశాస్త్రములు

A. HISTORY. చరిత్ర.— ఈ తరుణమున కులభేదమును, దానికి సంబంధించిన కట్టుబాట్లననుసరించి బ్రాహ్మణులను గొప్పచేసి యితరులను తృణీకరించు బ్రాహ్మణమతమును ఖండించుచున్న బలవద్విరోధులగు బౌద్ధమతస్థుల నణగద్రొక్కి తమ యధికారము నిలుపుకొనుటకై బ్రాహ్మణులు పోరాడుచుండిరి.

బ్రాహ్మణులు హిందూసంఘములో తమకుగల యున్నతస్థానమును నిలుపుకొనుటకును, దేవతలకును మానవులకును నడుమ తమ్మును దేవుడు మధ్యవర్తులనుగ నియమించెనని యనుకొనుచు, తమ యధికారమును గాపాడుకొనుటకును, ఎంత మాత్రము తగ్గక క్రమక్రమముగ ప్రబలమగుచుండిన బౌద్ధమత వ్యాపకము నష్టగించుటకును ధర్మశాస్త్రములను వ్రాసిరి. వీటిని స్మృతులందురు. వీటియందు ప్రతి మనుష్యుడును ప్రతి కుటుంబమును తమ తమ యిండ్లలో ననుసరింపవలసిన ధర్మములును, చట్టములును గలవు. అవి యీ ప్రపంచమునందలి మరియే యితరభాగములలో నెన్నడునులేని మిక్కిలి క్రూరములైన వర్ణభేదములను, ధర్మములను ఖండితముగ నియమించియున్నవి. ఇప్పటికి నిరువదిరైయైదు శతాబ్దములుగడిచినను నేటికిని కులకట్టుబాట్లకులోనైయుండుట హిందూమతమునకు మూలాధానముగనున్నది. ఆస్తికమును, నాస్తికమును, అద్వైతమును, బహు దేవతారాధనమును, ప్రకృతిపదార్థముల నారాధించుటను, పరమనీచమగు శక్తిపూజను, మంత్రవిద్యలను తనయందు నిముడ్చుకొని యుండు బ్రాహ్మణమతము హిందువులకందరికిని మత తత్వసిద్ధాంతములనుగూర్చి స్వేచ్ఛనిచ్చియుండినను, ఇది నియమించిన గృహధర్మములును సంఘ నియమములును అతి కఠినములైయున్నవి.

B. NUMBERS AND DATES OF THE CODES OF LAW. ధర్మశాస్త్రముల సంఖ్యయును, అవి యేర్పడినకాలములును.—ఏబదియారు వేరువేరు ధర్మశాస్త్రములు గలవని చెప్పుదురు గాని వాటిలో మూడుమాత్రము ప్రధానములైనవి. అవేవనగా,

**I.** హిందువులు పరమపవిత్రముగ నెంచుచున్న మానవ ధర్మశాస్త్రము ప్రాముఖ్యమైనది. దీనిని క్రీ. పూ. 500-వ సం॥ల నుండి క్రీ. వె. 200-వ సం॥ల వరకుగల కాలములో వ్రాసిరి. ఇదియొకదాని వెంబడి యొకటిగా నేడు పర్యాయములు ప్రపంచమును సృష్టించిన యేడుగురు మహామనువులలో మొదటిమనువు రచించె నందురు. కాని యిది దాదాపు క్రైస్తవ శకారంభమున లిఖితమయ్యెనని కొందరు పండితుల యభిప్రాయమైయున్నది.

II. యాజ్ఞవల్క్యుని ధర్మశాస్త్రము.—దీనియందు నింకను కొన్ని ధర్మసూత్రము లెక్కువగ గలవు. విజ్ఞానేశ్వరుడు దీనికి వ్రాసిన మితాక్షరియను వ్యాఖ్యానసహితముగ నీ ధర్మశాస్త్రమును జదివెదరు. దీనిని క్రీ. వె. 200 సం॥న వ్రాసిరి.

III. పరాశర ధర్మశాస్త్రము.—మరికొంత కాలమైనపిమ్మట పరాశరుడు కలియుగమునకు తగిన కొన్ని క్రొత్త సూత్రములను కలిపి వ్రాసెను.

## C. THE RELIGIOUS AND SOCIAL SYSTEM OF THE LAW BOOKS. ధర్మశాస్త్రసంబంధమగు మతమును, సాంఘిక క్రమమును.

I. The All-Embracing Nature of the Laws. ధర్మశాస్త్రములు సర్వ విషయములను కలిగియుండుట.—రాజకీయ ధర్మములును, న్యాయపరిపాలన సూత్రములును, సంఘధర్మములును నీతివిధులును, వివిధ మతాచారములును, తత్వసిద్ధాంతములును, నీ ధర్మశాస్త్రములయందు గలిసిమెలిసి యున్నవి. బ్రాహ్మణములు యాజకులకు మాత్రమును, ఉపనిషత్తులు తత్వజ్ఞులకును నుద్దేశించియున్నారు. కాని పురోహితులయొక్క యాటంకములకు లక్ష్యముచేయక పెరుగుచుండిన పామరజన మతమును, అగ్రజాతివారి మతమును నీ ధర్మశాస్త్రములను జదువువారికి గ్రహింపు కాగలదు. ఈ శాస్త్రములయందు దేవతలను, పితృదేవతలను, దయ్యములను గూర్చినట్టియు, యజ్ఞయాగాది కర్మలను, ఆచారములను, నియమములను గూర్చినట్టియు భావములే కాక, సర్వం బ్రహ్మమయమను సిద్ధాంతముకూడ కాన్పించును. సర్పముల నారాధించుట దేశమున వ్యాపించెను. తీర్థయాత్రలు సర్వజన సమ్మతములాయెను. ఈ గ్రంథములు నాలుగు ఆశ్రమములవారి ధర్మములును, వీటితోబాటుగ నలువది సంస్కారములును గల కర్మకాండను వివరించుచున్నవి.

II. The Brahmans. బ్రాహ్మణులు.—వీరు మానవుల కందరికిని దేవతలై యుండుటమాత్రమేగాక పరలోకమునందలి దివ్యపురుషులుకూడ వీరిని దేవతలని భావించుచుండిరి. వీరి యుపయోగార్థమే శాస్త్రములన్నియు నేర్పడెను. వీరి శాపములకును తపములకును మిగుల ప్రభావముగలదు. వీరి శక్తి భూపతులశక్తికిని మించియున్నది. అథర్వవేద మంత్రములచే శత్రువులనందరిని జయింపగలరు. సృష్టి పదార్థములకన్నిటికిని నధికారి బ్రాహ్మణుడే. మతగ్రంథములను జదువుకొని, యజ్ఞాది కర్మల నాచరించుటయే యితనికి ముఖ్యధర్మము. ఇతనికి నాహారాదులయందు గొదువ యేమియులేక యిచ్చుచుండుట తక్కిన వర్ణములవారికి విధి. ఇతడు నాలుగాశ్రమములను నవలంబింపవలసియుండెను. అవేవనగా (1) బ్రహ్మచర్యము, అనగా పెండ్లి చేసికొనక వేదవిద్యల నభ్యసించుట; (2) గృహస్థాశ్రమము, అనగా పెండ్లి చేసికొని, సంసారముచేయుట; (3) వానప్రస్థము, అనగా వనవాసము; (4) సన్యాసము, అనగా సంసారత్యాగముచేయుట.

III. The Sudras. శూద్రులు.—వేదములను చదువుటకును, వేదములను వినుటకునుకూడ అనుమతిలేనివారైన శూద్రులస్థితి యెంత హీనమైనదో మనము

సులభముగ గ్రహింపవచ్చును. తమకు పైనున్న మూడు వర్ణములవారికిని సేవచేయుటయే శూద్రధర్మము. వారు ఆస్తి సంపాదింపకూడదు. బ్రాహ్మణులు తమ కిష్టము వచ్చినవస్తువులను శూద్రులయొద్దనుండి బలవంతముగ తీసికొనవచ్చునని మనుధర్మశాస్త్రము 8: 417 లో చెప్పియున్నది. శూద్రుని జంపుట మహాపాతకముకాదు. శూద్రహత్య కుక్కనుగాని కాకినిగాని చంపుటవంటిదే, గాని బ్రాహ్మణహత్యకు ప్రాయశ్చిత్తమేదియును లేదు. నేరముచేసిన ద్విజునకు విధించిన శిక్షకంటె అదే నేరము చేసిన శూద్రునకు విధించిన శిక్ష యెంతో క్రూరమైయుండెను. ఈ విషయము మనుధర్మశాస్త్రము 8: 115, 261, 380 లో జూడుము.

IV. Marriage. వివాహము.—బ్రాహ్మణుడు నాలుగువర్ణములనుండి నలుగురు స్త్రీలను పెండ్లిచేసికొనవచ్చును. క్షత్రియుడు క్షత్రియాది మూడు వర్ణములనుండి ముగ్గురు స్త్రీలను పెండ్లియాడవచ్చును. వైశ్యుడు కడపటి రెండు కులములలో నొక్కొక్కదానినుండి యొక్కొక్క స్త్రీని వివాహము చేసికొనవచ్చును. శూద్రునికి నొకతెకంటెను నెక్కువ భార్యలుండకూడదు. ఆ యొకతె శూద్రస్త్రీయై యుండవలెను.

V. The Position of Women. స్త్రీలస్థితి.—స్త్రీలు తమ భర్తలెంత దుర్మార్గులైనను వారిని తమకు దేవతలను భావముతో బూజింపవలెను. పతిపూజయే వారు స్వర్గానందము నొందుటకు మార్గము. ఈ విషయము మనుధర్మశాస్త్రములోని 5: 154, 155; 9: 17 చూడుము. మనువు తన ధర్మశాస్త్రమున వ్రాసిన యీ క్రింది మాటలనుబట్టి యతనికి స్త్రీలయందెట్టి గౌరవముండెనో మనము గ్రహించుకొనగలము. "స్త్రీ తన పసితనమున తండ్రిపోషణయందును, తన యౌవనమునభర్త పోషణయందును, తన ముసలితనమునందు పుత్రులపోషణయందు నుండవలెనేగాని స్త్రీ యెన్నడును స్వతంత్రురాలై యుండరాదు." ప్రస్తుతకాలమున మనుధర్మశాస్త్రము 5: 158 లో చెప్పియుండులాగున విధవలు చిన్నవారైనను పెద్దవారైనను పునర్వివాహము చేసికొనకూడదు. సహగమనము మనుధర్మశాస్త్ర సమ్మతమైయున్నది.

VI. The Eating of Flesh. మాంసభక్షణము.—వేదమంత్రోచ్చారణచే పవిత్రము అయిన మాంసమును బ్రాహ్మణుడు భక్షింపవచ్చునని శాస్త్రకారుడగు మనువు చెప్పియున్నాడు.

VII. Deliverance from Sin. పాపవిమోచనము.—పాపపరిహారమునకు ప్రాయశ్చిత్త మవసరము. కర్మకాండయందలి చిన్నపొరబాట్లను పాపములనియెంచి వాటికి ప్రాయశ్చిత్తమును విధించుచున్నారు. కాని మిక్కిలి ఘోరపాపములకు అంత కఠినముగ ప్రాయశ్చిత్తము విధించియుండలేదు. మానవులును, దేవతలును తపస్సువలననే పాపరహితులై సంపూర్ణ మోక్షానందము ననుభవింపగలరు. ఒకడు తాను చేసిన పాపములను వేదమంత్రములను పఠించుటచేతను, హోమములవలనను పరిహరించుకొనవచ్చును. ఒకని నేరము బహిరంగము కాకుండినయెడల అతనికి బహు సులభముగ క్షమాపణ కలుగును. త్రివేదములను కంఠపాఠముగ నెరిగియున్న బ్రాహ్మణుడు తదితర కులస్థులతో సహపంక్తి భోజనముగాని మరి యెట్టి పాపము

గాని చేసినను ఆ పాపదోషమతనికి నంటకుండును. ప్రారబ్ధకర్మ జన్మాంతరముల బంధకములనుండి విడుదలనొందుటయే హిందువుల ప్రాముఖ్యమైన యుద్దేశమైయున్నది.

VIII. Caste. కులభేదములు.

1. Origin. ఇవి యేర్పడిన విధము.

(*a*) Conflicting Opinions of the Hindu Religious Books. హిందూమతగ్రంథముల భిన్నభిన్నాభిప్రాయములు.—ఋగ్వేదములోని పురుషసూక్తములో బ్రాహ్మణులు బ్రహ్మయొక్క ముఖమునుండియు, క్షత్రియులు భుజములనుండియు, వైశ్యులు తొడలనుండియు, శూద్రులు పాదములనుండియు బుట్టినట్లు గలదు. అయితే తైత్తిరీయ బ్రాహ్మణము నాలుగు కులములకును నాలుగు వేదములే మూలకారణములని యొకచోటను, బ్రాహ్మణులు సురులకును అనగా దేవతలకును, శూద్రులు అసురులకును అనగా రాక్షసులకును పుట్టిరనియు చెప్పుచున్నది. భాగవతపురాణము కృతయుగమున నొకేజాతి యుండెననియు, వాయుపురాణము త్రేతాయుగమున వర్ణభేదము లేర్పడెననియు చెప్పుచున్నవి. కావున కులముల పుట్టుకను గూర్చి హిందూమతగ్రంథములు పరస్పర విరుద్ధముగ చెప్పుచున్నవి.

(*b*) The Spontaneous Origin of Caste. కులభేదములు వాటికవి యేర్పడుట. మానవకోటియందలి ప్రతి జనసముదాయమును అనగా ప్రతి జనాంగములోనివారును, ప్రతి శాఖలోనివారును, ప్రతి తెగవారును, తామతిపవిత్రులమనియు, తమ దేహమందు పరిశుద్ధరక్తము ప్రవహించుచున్నదనియు, తమదే యత్యుత్తమ మతమనియు నమ్మియుండుటచే, వారికి తదితర జనసమూహములతోడి వివాహములుగాని సహవాసముగాని నిషేధములై యుండెను. మరియు వారికి మరియొక నమ్మకముకూడ నుండెను. ఈ జాతివిభాగము దైవకృతమనియు, అందుచేత తమ కులములను కాపాడుకొనుట తమ ధర్మమనియు వారు తలంచి యుండిరి.

జనులందరును ప్రభువులు, యాజకులు, సామాన్యజనులు అనెడు మూడు తరగతులుగ నున్నారని తక్కిన జనాంగములతోబాటు ఆర్యులుకూడ నమ్మియుండిరని ఋగ్వేదమునుబట్టి తెలియుచున్నదిగాని యీ జాతి విభాగములు ఆ ప్రాచీన కాలమున నిప్పటి కులభేదమువలెమాత్ర ముండియుండలేదు. ఆర్యులాదిమ హిందూదేశవాసులను లోబరచుకొన్నప్పుడు వారితో వివాహసంబంధములు కలిగియుండుట, తమ కసాధ్యమని తెలిసికొనిరి. ఆర్యులు పొడుగాటివారును, తెల్లని వర్ణమును గలవారునై యుండిరి. అనార్యులైతే పొట్టిగను నల్లగ నుండిరి. ఈ విషయమునుబట్టి యిప్పుడు రంగు అను నర్థమిచ్చు వర్ణమను పదమెట్లు పుట్టెనో విశదము కాగలదు. బ్రాహ్మణులు భూదేవతలై సర్వాధికారమును గలిగియుండుటచేతను, ధర్మశాస్త్రకర్తలు వారేయైయుండినందునను, తమచే నిర్మితమైన వర్ణమనెడు నిచ్చెన యొక్క పైమెట్లమీద నార్యులకును, క్రిందిమెట్టున భిన్నభిన్న తెగలుగనుండిన ఆదిమనివాసులకును స్థానము లేర్పరిచి, తాముమాత్రము అన్నిటిలో నగ్రస్థానము

నాక్రమించుకొనిరి. ఈ యనార్యతెగలవారినందరిని శూద్రులని పిలుచుచుండిరి. ఋగ్వేదములోని పురుషసూక్తము బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులనువారు ప్రత్యేకముగ పుట్టిన నాలుగు వర్ణములవారని చెప్పియుండుట మనమిదివరకే యెరుగుదుము. ప్రారబ్ధకర్మ, పునర్జన్మ సిద్ధాంతములను జనులంగీకరించినతోడనే, ప్రతి మానవుడును తాను పుట్టిన కులము గొప్పదైనను, తక్కువదైనను, తన కర్మఫలితమే యని వాదింపసాగెను. కావున కులధర్మముల ననుసరింపనివాడు తానున్నకులముకంటె నింకను నీచమగుదాని నొందును. అంతట శూద్రులకు పైనుండు మూడు వర్ణములవారును తాము ద్విజులమని సూచించుటకు గుర్తుగా జందెములు వేసికొన నారంభించిరి. ద్విజుడు అనగా రెండుసారులు పుట్టినవాడు. విద్యద్వార ఆత్మ సంబంధమైన జన్మమునొందుట రెండవపుట్టుక. పై నాలుగు వర్ణములలో జేరని జాతులవారందరును భిన్నభిన్న కులములవారిలో జరిగిన పరస్పర వివాహసంబంధములవలనను, నీతిలేని స్త్రీపురుష సంపర్కమువలనను పుట్టినవారై యుండిరి. ఇట్టి విధముగా నేర్పడిన నూతనకులములు లెక్కకు మించియుండెను. ఆయా కుల ధర్మములు మనుధర్మశాస్త్రము 1: 88—93 శ్లోకములలో గలవు.

పిమ్మట కొంతకాలమునకు మొదటి మూడు వర్ణములలో ప్రతిదానియందు ననేక యంతశ్శాఖ లేర్పడెను. అగ్రవర్ణములవారు అనార్యులను తమ సంఘములో జేర్చుకొని వారికి శూద్రులను నామమిడిరి. ఈ వర్ణములకు వెలుపటగా వెలివేయబడిన అంటరాని జాతివారుండిరి. మిక్కిలి యశుభ్రముగ నుండుటచే వీరు సహవాసయోగ్యులు కాకుండిరి. పైజెప్పిన అయిదు వర్ణములుమాత్రమేగాక వివిధ వ్యాపారములవలనను వృత్తులవలనను నింకను మరికొన్ని క్రొత్తకులము లేర్పడెను.

ప్రతి కులమువాడును తన వర్ణమెంత హీనమైనదైనను, దానిని సంకరము చేయకూడదు. ఒక జాతివారు మరియొక జాతివారితో కలిసి భోజనముచేయుటకు గాని వివాహసంబంధములు చేయుటకుగాని యొండొరుల వృత్తుల నవలంబించుటకు గాని వీలులేదు. ఏకులమువాడైనను సముద్రము దాటిపోకూడదు. ఒకని మత భావములును, ప్రవర్తనయు నెంత విరుద్ధములుగ నుండినను తన కులధర్మములమాత్రము ననుసరించుచుండునంతవరకు హిందువుడుగానే యుండవచ్చును.

# ఏడవ యధ్యాయము

# CHAPTER VII

# పురాణములలోని మతము అనగా సర్వజనసమ్మతమగు మతము

# Popular Hinduism

A. HISTORY. చరిత్ర.—అశోకుని సామ్రాజ్యము క్రీ. పూ. 134-వ సం॥మున నాశనమొందెను. పిదప మన క్రైస్తవశకములోని మొదటి శతాబ్దమునందు కుషనులు గొప్పరాజ్యమును స్థాపించుకొనియుండిరి. వారి రాజ్య మంతరించినపిమ్మట క్రీ. వె. 320-వ సం॥మున మహత్తరమగు గుప్తసామ్రాజ్యము స్థాపితమై, యుత్తర హిందూస్థానమంతయు నాక్రమించుకొనెను. ఈ గుప్తరాజ్యము కొంతకాలమునకు నాశనమాయెను. మోటుజాతివారును క్రూరులునగు హూణులను పేరుగల మంగోలియా దేశీయులు గుంపులు గుంపులుగా వచ్చి గుప్తరాజులపైబడి వారి నోడించి వారి రాజ్యమందలి పెక్కు ప్రదేశములను ధ్వంసముచేసిరి. మరికొంతకాలమునకు కనోజిరాజగు హర్షుడు క్రీ. వె. 606-వ సం॥ మొదలు 647-వ సం॥ మధ్యకాలమున హిమాలయపర్వతమునకును, నర్మదానదికిని నడుమనుండు దేశమంతయు జయించి ప్రభుత్వముచేసెను.

హర్షునికిపిమ్మట రాజపుత్రులు మాళవ, డిల్లి, కనోజి, అజ్మీరు, గ్వాలియరు లలో తమ రాజ్యములు స్థిరముగ స్థాపించుకొని కొంతకాల మేలిరి. అయినను వారిలో నసూయలును, కలహములునుండి యైకమత్యములేకయుండినందున అన్యులగు మహమ్మదీయులు సందు కనుగొని దేశములో ప్రవేశించి వారిని నోడింపగలిగిరి.

క్రీ. వె. 711-వ సం॥మున అరబ్బీ సేనానాయకుడగు మహమ్మదుకాసీమను నతడు సింధుదేశమును జయించెను. అప్పటినుండి యీ దేశమున తురకలు వసతులేర్పరచుకొనసాగిరి. నేటికిని వారి ప్రభావము నానాటికి హెచ్చుచునే యున్నది. కాసీము తరువాత మహమ్మదీయులు హిందూదేశముపై లెక్కలేని దండయాత్రలు చేసిరి. క్రీ. వె. 1001-వ సం॥ నుండి 1030-వ సం॥ వరకు గజినీమహమ్మదు అనేక పర్యాయములీ దేశముపైబడి నాగరకోట, మధుర, సోమనాథపురము అను పట్టణములయందలి హిందూదేవాలయములను, కొల్లగొట్టి విస్తార ద్రవ్యమును తీసికొని పోయెను. క్రీ. వె. 1191-వ సం॥మున మహమ్మదుగోరి పంజాబునుండి బంగాళము వరకు గల దేశమును జయించి, డిల్లీని తన రాజధానిగా జేసికొనెను. ఇతనితరువాత మొగలాయీలు తమ రాజ్యమును స్థాపించి, డిల్లీలో రాజ్యముచేసిరి. క్రీ. వె. 1858-వ సం॥మున మొగలాయి చక్రవర్తులలో గడపటివాడగు బహుదూర్‌షాను ఆంగ్లేయులు రంగూనుకు ఖైదిగా బంపివేయువరకు డిల్లీపట్టణము తురకరాజులకు రాజధానిగానే యుండెను. క్రీ. వె. 1294-వ సం॥మున మహమ్మదీయులు దక్కను

దేశమును జయించిరి. దానిలో నొకభాగము నేటికిని హైదరాబాదు నవాబుగా రేలుచున్నారు. మహమ్మదీయపాలకులలో ననేకులు హిందువులయెడల బహు క్రూరముగ బ్రవర్తించిరి. మరికొందరైతే యెక్కువ ప్రేమ చూపించిరి. మహమ్మదీయులు తమ దేవునిపేరు చెప్పి హిందూ బౌద్ధదేవాలయములను విగ్రహములను మతపాఠశాలలను సమూలనాశనము చేసి, వారి సన్యాసులను గురువులను చంపివేసిరి. వారికి భయపడి వేలకొలది హిందువులు మహమ్మదీయమతము స్వీకరింపవలసివచ్చెను.

అప్పటినుండి కొన్ని శతాబ్దములవరకు నుత్తరహిందూస్థానమందును, దక్కను. దక్షిణహిందూదేశములయందును మహమ్మదీయులు రాజ్యమును స్థాపించుచునేయుండిరి. మహమ్మదీయ పాలకులలో ననేకులు ప్రజలను హింసించుచుండినను ప్రజలయెడల దయగలవారు బొత్తుగ లేకపోలేదు. ఇట్టివారిలో నొకడు అక్బరుచక్రవర్తి. ఇతడు 1556-వ సం॥న సింహాసనమునకు వచ్చెను. క్రూర తురకరాజులలో అక్బరు వంటి అన్యమత సహనము ధర్మబుద్ధి దయ గల మరియొకడు లేడనియే చెప్పవలెను. క్రీ. వె. 1336-వ సం॥న స్థాపించిన విజయనగరమను హిందూరాజ్యము 1565-వ సం॥ వరకును మహమ్మదీయులకు లోబడక నిలిచియుండినను తుదకు తల్లికోటలో జరిగిన ఘోరయుద్ధములో నంతమొందెను. పదునారవ శతాబ్దము మొదలుకొని పోర్చుగీసువారు, డచ్చివారు, ఫ్రెంచివారు, ఇంగ్లీషువారును, ఈ దేశమందలి యనేక రేవు పట్టణములను వర్తకముచేయుటకు వచ్చుచుండిరి. కాని 1757-వ సం॥న జరిగిన ప్లాసీ యుద్ధమునాటినుండియు ఇంగ్లీషువారి యధికారము క్రమక్రమముగా వృద్ధినొంది నేటికిని వారి రాజ్యము హిమాలయమునుండి కన్యాకుమారి యగ్రమువరకును, ఆఫ్ఘనిస్థానమునుండి దక్షిణబర్మాదేశమువరకును వ్యాపించియున్నది.

## B. FACTORS WHICH PRODUCED MODERN HINDUISM. ప్రస్తుత హిందూమతమేర్పడుటకు గారణములు.

I. Absorption of the Dravidian Religion. ద్రావిడమతము హిందూమతములో గలిసిపోవుట.—హిందూమతమునకు విరోధులగు జైన బౌద్ధమతములవారివలన నుత్తరహిందూస్థానము నల్లకల్లోలమగుచుండు కాలములో బ్రాహ్మణమతములో గొప్పగొప్ప మార్పులు జరుగుచుండెను. ఆర్యులు హిందూదేశమును క్రమక్రమముగా జయించుటచే, బ్రాహ్మణమతము ఒక్క యార్యులమతముగానే యుండలేకపోయెను. కావున బ్రాహ్మణులు అనార్యుల మతాచారములను సిద్ధాంతములను స్వీకరించి వాటికి ననుకూలమగు మార్పులు చేసి, సర్వజన సమ్మతమగు మతమును నూతనముగ కల్పించు ఈ మహాకార్యమునకు పూనుకొనవలసివచ్చెను. ఇట్టి ప్రయాసకు ఫలితముగ పూర్వ మార్యులవలంబించిన వేదమతముకాదు గాని ఆర్యయనార్యమతములు కలిసిన యొక సంకరమతము బయలువెడలెను. అదియే యిప్పటి హిందూమతము. నేడు ఈ దేశమంతటను ఆర్యులకును, అనార్యులకును ప్రధాన మతమాయెను. కొందరు కొండజాతులవారుమాత్రము దీనిలో జేరక వేరుగనున్నారు. ఇప్పుడు హిందూమతములో ననేక అన్యమతాచారములు చేరియున్నను, ప్రాచీన

బ్రాహ్మణమతాచారములును, తత్త్వసిద్ధాంతములును, ధర్మశాస్త్ర నియమములును నేటికిని నిలిచియేయున్నవి.

II. Contest with Buddhism. బౌద్ధమతముతో పోరాటము. — సర్వ జనుల నాకర్షించుకొనుచు అగ్రస్థానమును వహించియుండిన బౌద్ధమతముతో బోరాడి దానిని పడగొట్టి, తమ మతమును సర్వజనసమ్మతముగ నుండునట్లు బ్రాహ్మణులు మానవస్వభావ గుణలక్షణములు గల దేవతలను నిర్మించి, సామాన్యజను లాచరింపదగిన మతవిధులను నియమించిరి. నిస్సార యద్వైతసిద్ధాంతమునకును, ప్రకృతి మహాశక్తులను, భూతములను తృప్తిపరుచుటకై చేయవలసిన యనంతములగు యజ్ఞ యాగాది కర్మలకును దోడుగా పామరజను లారాధించుటకుగాను నరదేవతలను బ్రాహ్మణులు నూతనముగ గల్పింపవలసివచ్చెను.

కావున బ్రాహ్మణు లార్యవీరులనుగూర్చిన గాథలను, పురాతన కథలను, మూఢ విశ్వాసములను సంగ్రహించి రామాయణ మహాభారతములను రెండు గొప్ప పురాణములందు ననేక గాథలనుజేర్చి విశేషముగ బెంచి వ్రాసిరి. ఇందులో ప్రతి యుద్ధ శూరుడును దైవాంశసంభూతుడని ఋజువుచేయునట్టి కథలును శౌర్యరసము పుట్టించు పద్యములు ననేకములు గలవు. ఈ విధమున బెక్కు దేవతలును, భూతములును, సుగుణ దుర్గుణ దేవతారాధనతోగూడిన పామరమతము వృద్ధినొందుచుండెను. విష్ణువు ఇరువదిరెండవతారము లెత్తెను. వాటిలో పదింటినిగూర్చిమాత్రమే మనకు సాధారణముగా తెలుసును. బ్రాహ్మణులతోబాటుగ బౌద్ధులుకూడ, ప్రసిద్ధపురుషుడగు గౌతమబుద్ధునికిబూర్వ మిరువదినలువురు బుద్ధులను గల్పించిరి. అంతేగాక మైత్రేయుడను మరియొక బుద్ధుడు రాబోవుచున్నాడని వారు బోధించెదరు. జైనులు కూడ నదేప్రకార మిరువదినలుగురు తీర్థంకరులను నిర్మించుకొనిరి. వారిలో గడపటి యిద్దరు తప్ప తక్కినవారందరును కల్పితపురుషులే.

III. Rise of the Great Sects and Modern Forms of Worship. గొప్ప మతశాఖల యుత్పత్తియు ప్రస్తుత యారాధనవిధానము లేర్పడుటయు.— భగవానుని అనగా పూజింపదగిన దేవుని నారాధించు భాగవతుల ప్రాబల్యమువలన విష్ణుపూజ త్వరలో విస్తరించెను. ముఖ్యముగా ఈ భాగవతులద్వారనే వైష్ణవ మతము వ్యాపించెను. శైవులు నంది త్రిశూలము పానవట్టము మొదలగునాటితో శివుని సర్వజనమనోహరుడగు దేవతగ జేసిరి. హిందూదేవతలయొక్కయు బుద్ధుని యొక్కయు ప్రతిమలు లెక్కకు మించిపోయెను. హిందూ బౌద్ధమతములు రెండును నొండొంటినుండి సంగ్రహించిన భావములచే వాటికిగల భేదములకంటె పోలికలే యెక్కువగుచుండెను. హిందువులు బుద్ధుని, విష్ణువుయొక్క యవతారములలో నొకనిగా నంగీకరించిరి. ఇట్టి సందర్భములచే బౌద్ధమతము ప్రత్యేకమతముగ నుండవలసిన యవసరము క్రమక్రమముగ లేకపోవుచుండెను.

క్రీ. వె. యారవ శతాబ్దము తర్వాత నారువందలయేండ్లనాటికి ప్రస్తుత హిందూమతలక్షణములన్నియును వేరుపారి స్పష్టముగ గాన్పించెను. హిందువులు

వేదకర్మలగు యజ్ఞములను చాలామట్టుకు మరచిపోయి యనేకవిషయములలో ననార్య దేవతలను, బలులను స్వీకరించిరి. దేవాలయ పూజావిధానము, సామాన్య పండుగలు, ఉత్సవాది వినోదములు, పామరజనుల నాకర్షించుచుండెను. వేశ్యలు దేవదాసీలుగ నాలయములలో నుండసాగిరి. చనిపోయిన భర్త దేహముతో సజీవురాలగు భార్యనుకూడ దహనముచేయుట జనులలో సర్వసాధారణమయ్యెను. పతితో దహనమగు భార్య సతి యనగా సద్గుణవతి. ఈ యాచారమునకుకూడ సతి యని పేరువచ్చెను. మనము వర్ణించెడుకాలమున వైష్ణవ శైవ మతశాఖలుమాత్రమేగాక శాక్తేయులను మరియొక శాఖకూడ బయలుదేరెను. వీరు శివుని భార్యయు ఘోరరూపిణియునగు కాళిని నారాధించెడివారు. వీరిలో నొక తెగవారు కేవలము నీతివిరుద్ధములగు కార్యములు చేయుదురు. ఆ కాలమున హిందువులలో ప్రతి తెగవారును తమ యారాధనక్రమమునుగూర్చిన గ్రంథములను, స్తుతిగీతములను, పురాణములను రచించిరి. ఆ కాలముననే మతకర్తలు అనగా ప్రసిద్ధపురుషులగు నాచార్యులుకూడ బయలుదేరిరి.

IV. Muhammadan Influence on Hinduism. మహమ్మదీయ మతప్రాబల్యమువలన హిందూమతమునకు కలిగిన మార్పులు.—మహమ్మదీయమతమువలన కూడ హిందూమతము కొంతమట్టుకు మారెను. ఉపనిషత్తులలో నొకదానికి అలోపనిషత్తు అను నామము కలదు. దేవుడొకడేయను ప్రధాన మహమ్మదీయ సిద్ధాంతము ననుసరించి హిందూ మహమ్మదీయ భక్తులకు నంగీకారమగు నూతన మతములు బయలుదేరెను. ఇట్టి శాఖలను స్థాపించిన గురువులలో ప్రసిద్ధిగాంచినది రామానందుడను విష్ణుభక్తుడు. ఇతడు క్రీ. వె. పదునాల్గవ శతాబ్దమున జీవించియుండెను. ఇతడు తాను స్థాపించిన భక్తసమాజములో సమస్త కులములవారిని మాత్రమేగాక మహమ్మదీయులనుకూడ చేర్చుకొనెను. ఇతని శిష్యులలో నెల్ల కబీరు అను మహమ్మదీయుడు మిగుల ప్రఖ్యాతినొందెను. ప్రస్తుతకాలమున హిందూదేశములోని గొప్ప మతశాఖలలో నొకటియగు కబీరుపంథుల తెగకు ఆనామ మితని వలననే వచ్చెను. ఇతడు చేసిన భజనకీర్తనలలో మహమ్మదీయ గుణలక్షణములు కనబడును. ఇతడు విగ్రహారాధనమును, కులభేదములను ఖండించెను. ఇతడు తాను అల్లాకును, రామునికిని బిడ్డనని చెప్పుకొన్నందున నెట్టి భేదమునులేక హిందువులును, మహమ్మదీయులును నితనికి శిష్యులైరి.

కబీరు శిష్యుడగు నానకు అనునతడు క్రీ. వె. దాదాపు 1500-వ సం॥న సిక్కుమత సంఘమును స్థాపించెను. ఇతనికి బిమ్మట వచ్చిన గురువులు సిక్కులను యుద్ధప్రియులుగ మార్చివేసి వీరపురుషసంఘమును స్థాపించిరి. వీరు తమ మత పుస్తకమునకు' గ్రంథ్ అను పేరిడిరి. అది యమృతసరస్సు అను పట్టణమందలి బంగారు దేవాలయమున నుండును.

రాజ్యాధికారులగు మహమ్మదీయుల వాడుక ననుసరించి హిందువులుకూడ తమ స్త్రీలు భద్రముగానుండుటకు వారిని ఘోషాలోనుంచ నారంభించిరి. ఈ

యాచారము హిందువులలో నంతకుబూర్వముకంటె నీ కాలమున నతివిస్తారముగ వ్యాపించెను. హిందూదేశము చాలకాలము మహమ్మదీయులవశమందుండుటచే కొన్ని విషయములందు కులకట్టుబాట్లు మరింత కఠినములాయెను.

V. Influence of the West. పశ్చిమదేశీయుల ప్రాబల్యమువలన కలిగిన మార్పులు.—ఆంగ్లేయ విద్యాభ్యాసమును, పశ్చిమదేశ పండితులును, క్రైస్తవమత బోధయు, క్రైస్తవ లోకోపకారబుద్ధియు, వీనితోబాటుగ ఇనుపదారులును, తంతి వార్తలును, పొగయోడలును, తపాలాఫీసులును, వార్తాపత్రికలును, సీమసామానులును, విదేశీయులతోడి వ్యాపారమును ఈ మొదలగునవన్నియు హిందువుల మనోభావములను, జీవితవిధానములను క్రమక్రమముగ మార్చుచున్నవి. విద్యావంతులగు హిందువులు జాతీయోద్యమమనుదానిచేత తమ దేశము నున్నతస్థితికి తెచ్చుచున్నారు.

బ్రిటీషు ప్రభుత్వమువారు ఠగ్గు లను దారిదోపిడిదొంగలను అణచివేసి, సహగమనమును, శిశుహత్యను రూపుమాపిరి. సర్వకళాశాలలను, సామాన్య పాఠశాలలను స్థాపించిరి. ప్రాటిస్టెంటు మతప్రచారకులు తమ సువార్త బోధకులద్వారను, పాఠశాలలవలనను క్రైస్తవ పుస్తకముల నుచితముగ పంచిపెట్టుటవలనను, క్రీస్తుమత సత్యసిద్ధాంతములను దేశమునందు వ్యాపింపజేసిరి. అంటరానివారగు పంచములనేకులను క్రైస్తవసంఘములో జేర్చుకొనిరి. ఈ కార్యములన్నిటిచే హిందూమతమునకు బునర్జీవము కలిగి సంఘసంస్కరణోద్యమములకు దారి యేర్పడెను.

C. LITERATURE. గ్రంథసముదాయము.—ఆ కాలపు హిందూమతగ్రంథములేవియనగా రామాయణము, మహాభారతమను రెండు మహాకావ్యములును, పదునెనిమిది పురాణములును, అన్నియుపపురాణములును, పాంచరాత్రసంహితలును, వైష్ణవాగమములును, శైవాగమములును, తంత్రములును. ఈ గ్రంథములు సిద్ధాంతములందును, ఆరాధనక్రమమునందును, ఆచారములందును వేదములతో నేకీభవించుటలేదు. హిందువులలో ననేకులు తమ పురాతన దేవతలను మరచిపోయి, వారికిబదులుగా క్రొత్తదేవతలను కల్పించుకొనిరి. శాశ్వత స్వర్గసుఖమునిచ్చు వేదమతము నడుగంటజేసి, నిరంతర దుఃఖకారణమగు పునర్జన్మసిద్ధాంతము తలయెత్తెను. అద్భుతములును, అమానుషకృత్యములును, అతిశయోక్తులును, దీర్ఘసమాసములును గలిగిన గాథలనేకము లీగ్రంథములలో గానబడును. మరియు ఈ శరీరములతో నింద్రలోకమును సందర్శించిన చక్రవర్తులనుగూర్చియు, విష్ణువుయొక్క యవతారములనుగూర్చియు వర్ణనలును గలవు. విశ్వామిత్రుడు వేలకొలది సంవత్సరములు తపస్సుచేసి తన తపోమహిమవలవ భూలోకమునే కాక దేవతాలోకమునుకూడ వణికించెనని పురాణములు చెప్పుచున్నవి. అప్పటి గ్రంథములన్నియు పద్యకావ్యరూపముననే యుండెను.

సంస్కృత పద్యకావ్యములలో నాలుగువిధములు గలవు:—ఇతిహాసములు అనగా మహాభారతమువంటి పూర్వపు గాథ; ఆఖ్యానము అనగా నలోపాఖ్యా

నమువంటి యుపకథ; పురాణము అనగా ప్రాచీనుల చరిత్ర; కావ్యము అనగా రామాయణమువంటి కవికల్పిత గ్రంథము.

### I. The Ramayana. రామాయణము.

**1. The Date and Author.** ఇది వ్రాసిన కాలమును, గ్రంథకర్తయు.—బ్రాహ్మణములలో రామునిగురించి లేదు గాని సీత తండ్రియగు జనకుని పేరు కానవచ్చుచున్నది. సింహళద్వీప పురాతన గ్రంథమగు మహావంశములో క్రీ. పూ. దాదాపు 550 సం॥ల క్రిందట మగధదేశీయుడగు వ్యేయుడు ఆ లంకపై దండెత్తెననియు దక్షిణహిందూదేశమందలి ద్రావిడతెగలవారికి మొదటి యార్యగురువగు అగస్త్యుడు పాండ్యరాజ్యమును స్థాపించెననియును వ్రాసియున్నది. మహాభారతములో సహగమనమునుగూర్చి యున్నది. కాని రామాయణము దశరథుడు చనిపోయినప్పుడు అతనిభార్యలతనితో సహగమనముచేసినట్లు చెప్పుటలేదు. కావున మహాభారతములోని సంగతులు రామాయణకాలమునకు బూర్వమే జరిగియుండినను రామాయణమే మహాభారతముకంటెను ముందుగా లిఖితమైయుండునని పై యంశము రుజువుచేయుచున్నది. రామాయణ గ్రంథకర్త తన కావ్యమును క్రీ. పూ. దాదాపు 500-వ సం॥న వ్రాయ నారంభించియుండవచ్చును. కాని క్రైస్తవశకమందలి మొదటి కొన్ని శతాబ్దములవరకు నీ గ్రంథము పరిపూర్ణస్థితికి వచ్చియుండలేదని స్పష్టమగుచున్నది.

రామాయణ గ్రంథకర్త వాల్మీకి యను నొక బ్రాహ్మణుడు. ఇతడు సప్తఋషులంతటి మహానుభావులపైబడిన దొంగలదండులో జేరినవాడు. ఈ మునులు రామనామమును త్రిప్పి జపించుచుండుమని యితనికి నుపదేశించిరి. అతడు కదలక నిలువబడి వారు చెప్పినప్రకారము చేయుచుండగా పెద్ద చీమలపుట్ట యతనిని కప్పివేసెనట. వల్మీకము అనగా చీమలపుట్ట, అటుపిమ్మట నితడు బ్రహ్మ యాజ్ఞనియ్యగా రామాయణమును వ్రాసెను.

**2. The Story.** రామాయణకథ.—రామాయణము నిజముగ జరిగిన యొక యంశముపై నాధారపడియున్నది. దానితోబాటు యనేకగాథలు కల్పించి చేర్చిరి.

మహాభారతమందు ననేకపర్యాయములు కానబడెడు కురుక్షేత్రమునకును డిల్లీకిని తూర్పువైపుగా చాలదూర మార్యులు పోయియుండిరి. రాముని నివాసస్థలము అయోధ్యానగరము. ఇతనినిగూర్చిన రామాయణకథయందు 24 వేల శ్లోకములు గలవు.

బ్రహ్మదేవుడు పది తలలు గల రావణుడను లంకాధిపతి యనేక సంవత్సరములు చేసిన ఘోరతపస్సునకు మెచ్చి యతనికి దేవతలవలనను రాక్షసులవలనను మృత్యుభయములేకుండ జేసెను. రావణుడు స్వర్గదేవతలతో యుద్ధముచేయుచుండెను. విష్ణువు తాను రావణునితో యుద్ధముచేసి యతనిని సంహరించుటకు భూలోకమున నవతరించెను.

అయోధ్య నేలుచుండిన దశరథుడు పుత్రసంతానములేనివాడై పుత్రులు కలుగుటకు నొక యాగముచేసెను. హోమాగ్నిజ్వాలలనుండి విష్ణువు పైకివచ్చి

పాయసముతో నిండియుండిన యొక పాత్రను దశరథునిచేతికిచ్చి, దాని నతని భార్యలకు బంచిపెట్టుమని చెప్పెను. వారు దానిని త్రాగిరి. అందుకు ఫలితముగా కౌసల్యకు రాముడును, కైకేయికి భరతుడును, సుమిత్రకు లక్ష్మణుడును శత్రుఘ్నుడును పుట్టిరి.

దశరథునికి ముసలితనమువచ్చినప్పు డతడు తన పెద్ద కుమారుడగు రామునికి బట్టముకట్టవలెనని నిశ్చయించుకొనెను. అప్పటికి రాముడు మిథిలానగర రాజగు జనకుని కుమార్తెయైన సీతను పెండ్లాడియుండెను. కైకేయి రామునియెడల నసూయ గలదై తనకు రెండు వరముల నిమ్మని తన భర్తను నిర్బంధించి యడిగెను. అవేవనగా: (1) రాముని నడవులకు బంపుటయు, (2) తన కుమారుడగు భరతునికి పట్టముగట్టుటయు. కనుక రాముడు రాజ్యమునువిడిచి సీతాలక్ష్మణులతో నడవులకు బోయెను.

పిమ్మట కొలదికాలమునకు దశరథుడు తన కుమారునిగూర్చిన దుఃఖముచే మరణించెను. అంతట భరతుడు రామునియొద్దకుపోయి, రాజ్యమునకు దిరిగి రమ్మని వేడుకొనెను. అతడు తన రాజ్యాధికారమునకు గుర్తుగా తన పాదరక్షలను భరతున కిచ్చి, అతని నయోధ్యకువెళ్లి యేలుమని చెప్పెను. అంతట రాముడు తన భార్యతోను, తమ్మునితోను, తానప్పుడుండిన స్థలమువిడచి బహుదూరము ప్రయాణముచేసి దండకారణ్యమున బ్రవేశించెను. అచ్చట నతడు అగస్త్యమహాముని దర్శనము చేసికొనెను. అగస్త్యుడు ఇంద్రుని యాయుధమును విల్లును ఎన్నటికిని తరిగిపోకుండు రెండంబుల పొదులను రామునకిచ్చెను. ఆ దండకారణ్యమునం దనేక ఋషులు వాసముచేయుచుండిరి. రాముడు వేరువేరు ఋష్యాశ్రమములకు బోయి, ప్రతి దానియందును కొంతకాలము గడుపుచు, ఆ యరణ్యములోనే పది సంవత్సరములు వాసముచేసెను. అతడీ యరణ్యవాసములో ఋషులను బాధించుచుండిన యనేక రాక్షసులను వధించెను. అంతట నతని శత్రువగు రావణుడను రాక్షసరాజు మాయోపాయముచే, సీతను లంకకు నెత్తుకొనిపోయి, అచ్చట నామెను చెరయందుంచెను. రావణు డామెను వశపరచుకొనవలెనని నయమునను భయమునను నెంత ప్రయత్నించి చూచినను ఆమె లొంగక తన పతివ్రతాధర్మమును కాపాడుకొనెను. రాముడు వానరరాజగు సుగ్రీవుని సైన్యాధిపతియగు హనుమంతుని సహాయము సంపాదించుకొని వెంటనే దండకారణ్యమునుండి దక్షిణదిశకు బోయెను. రాముని కోతులసైన్యములు హిమాలయపర్వతములనుండి గొప్ప రాతిబండలను తెచ్చి వాటితో లంకకును హిందూదేశమునకును మధ్య గల సముద్రమునకు నతిశీఘ్రముగ వారధి కట్టెను. రాముడు సముద్రముదాటి లంకకుబోయి కొలదికాలములోనే రావణుని జంపి సీతను చెరనుండి విడిపించెను.

రాముడు తన భార్య లంకలోనుండిన కాలమున నామె పతివ్రతాధర్మమునకు భంగము కలిగియుండవచ్చునని యనుమానించి కోపావేశముగలవాడై యామెతో నగౌరవముగా మాట్లాడెను. వెంటనే సీత యగ్నిలో బ్రవేశించెను. అప్పుడు సీతయొక్క పతిభక్తినిగూర్చి యెట్టి యనుమానమును నొందకుమని యాకాశమునుండి

యొక్క వాక్కు రామునికి వినబడెను. తక్షణమే రాముడు సీతతో బయలుదేరి వాయువిమానమున ప్రయాణముచేసి నందిగ్రామము చేరెను. అచ్చట భరతుడు రాజ్యమేలుచుండెను. అంతట అయోధ్యాపట్టణమున రామునికి పట్టాభిషేకము జరిగెను. అదియే సత్యయుగమున కారంభము. తర్వాత గొంతకాలమునకు రాముడు మరల తన భార్యను నిరాకరించెను. అందుచే నామె వాల్మీకాశ్రమమునకు బోయెను. అచ్చట నామెకు నిద్దరు మగబిడ్డలుండిరి. వారికి వాల్మీకి తత్పూర్వము తాను రచియించియుండిన రామాయణకథను చెప్పెను. ఆ యిద్దరు కుమారులును కొంతకాలమునకు రామునియొద్దకు వచ్చి తాము నేర్చుకొనియుండిన కథ నతనికి వినిపించిరి. వారిద్దరును తన కుమారులని అప్పటికి రాము డెరిగియుండలేదు. మరల నొకసారి సీత రామునికడకు వచ్చెను. అప్పుడుకూడ రాము డామె పరిశుద్ధతను దృఢపరచెడు రుజువులను చూడగోరెను. ఇట్టి కాఠిన్యమునకు నోర్వజాలక ఆమె తన్ను జేర్చుకొనుమని భూదేవిని ప్రార్థింపగా భూమి యామెను మ్రింగివేసెను. అంతట రాముడు మిగుల విచారగ్రస్తుడై కొలదికాలములోనే వైకుంఠమునకు తిరిగిపోయి అచ్చట విష్ణురూపమున నుండెను. (1) సత్వశుద్ధి; (2) శాంతి; యింద్రియనిగ్రహము; (3) వైరాగ్యము; (4) సత్యము; (5) అహింస—ఇవి హిందూమత ముపదేశించు మానవధర్మములలో ప్రధానములైనవి. హైందవకవులు వర్ణించిన మహా వీరులలో నెవనియందును రామునియందువలె నీ గుణములన్నియు నొక్కసారిగ ప్రకాశించుటలేదు.

## II. The Mahabharata. మహాభారతము.

**1. Contents.** ఇందలి విషయములు.—ఈ పురాణము మొదట 8,800 శ్లోకములుగలది గాని యిటీవల ననేక కల్పితగాథలనుజేర్చి గ్రంథవిస్తారము చేసియుండిరి; గనుక ఇప్పుడు 1,00,000 శ్లోకముల గ్రంథమాయెను. దీనియందు అసలు కథతో బాటు అనేక పురాతన ఇతిహాసములును, తత్వోపన్యాసములును, సృష్టిక్రమమును దేవతావంశావళియు, ధర్మశాస్త్రమును, మతాచారములును జేర్చిరి. గ్రంథమంతయు చాలమట్టుకు నీ విషయములతోనే నిండియున్నది. ఇది హిందువులయొక్క గుణవిశేషములును, ఆచారములును, అంతరంగభావములును గల గొప్ప నిధియైయున్నది.

**2. Authorship and Date.** ఇది వ్రాసినకాలమును దీని గ్రంథకర్తయును.—మహాభారతము రామాయణమునకు దరువాతనే లిఖితమైయుండినను ఇందు వివరించిన విషయములు రామాయణములోని వాటికన్న బహు పురాతనమైనవి. మహాభారతయుద్ధము క్రీ. పూ. 3101-వ సం॥న కురుక్షేత్రమున జరిగెనను నమ్మిక హిందువులలో పారంపర్యముగ వచ్చుచున్నది. డిల్లీకి సమీపముననుండిన హస్తినాపురరాజ్యమును స్వాధీనపరచుకొనుటకు నార్యులలో విరోధశాఖలగు పాండవులకును, కౌరవులకును కలిగిన పోరాటములనుగూర్చిన కథ యీ గ్రంథమునకు మూలపునాదియైయున్నది.

ఈ గ్రంథములో లెక్కలేని ఋషులనుగూర్చి వ్రాసియుండుటచే నిది వేదకాలములోనిదా లేక యిందు పునర్జన్మరహితమగుటకు యోగము నభ్యసించు యోగు

లనేకులు కనబడుటచే నిది యుపనిషత్తుమతమును యోగసిద్ధాంతమును వ్యాపించి యుండినకాలము నాటిదా యని సందేహము తోచుచుండును. ఏది యెట్లున్నను దీనికి క్రీ. పూ. నాలుగవ లేక అయిదవ శతాబ్దమున మొనటి గ్రంథరూపమేర్పడి యుండవచ్చును. కాని క్రీ. పూ. 500 మొదలు క్రీ. వె. 200 వరకుగల కాలములో రచితమైన మానవధర్మశాస్త్రమందు మహాభారతము విధించెడు సహగమనమును గూర్చిన ప్రశంసయే కాన్పింపదు. దీని అసలురూప మే కాలమున నేర్పడినను, ఇటీవలి వారు దీనికి ననేక యంశములు చేర్చుటచే ప్రస్తుతరూపమునకు క్రీ. వె. దాదాపు 500 సంవత్సరమున వచ్చెనని చెప్పవచ్చును. ఈ గ్రంథమును మొదట వ్రాసిన వ్యాసుడు అగ్రకులస్థుడుకాడు. దానియందు వేరు వేరు కులాచార్యులు తమతమ మతాచారములను జేర్చినందున ననేకచోట్ల పరస్పరవిరుద్ధములు కానవచ్చుచున్నవి.

3. The Story. మహాభారతకథ.—పాండురాజునకు కుంతి, మాద్రి యను నిద్దరు భార్యలుండిరి. వీరిలో కుంతికి యుధిష్ఠిరుడు, భీముడు, అర్జునుడు, అను కుమారులును, మాద్రికి నకులుడు, సహదేవుడు అను నిద్దరు కుమారులును కలిగిరి. పాండురాజు చనిపోయినపిమ్మట పాండవులైదుగురును తమ పెత్తండ్రియు, ఢిల్లీ సమీప పట్టణమగు హస్తినాపురాధీశుడును, అంధుడును, నగు ధృతరాష్ట్రునియింట పెరుగుచుండిరి. పాండవులు ద్రోణాచార్యునిదగ్గిర తర్ఫీతునొంది విలువిద్యయందు ప్రవీణులైరి. ధృతరాష్ట్రుని పుత్రులు నూర్గురిలో దుర్యోధనుడు పెద్దవాడు. పాండవులు తనకంటె నెక్కువ బలశాలులై యుండుటచే దుర్యోధనుడు వారిని చంపజూచెను.

పిమ్మట కొంతకాలమునకు ధృతరాష్ట్రుడు పాండవులలో నొకడగు యుధిష్ఠిరుని యువరాజుగ నియమించెను. అందుకు ధృతరాష్ట్రుని నూర్గురుపుత్రులు కోపముతో మండిపడి, పాండవుల నొక పండుగసమయమున చంపవలెనని కుట్రచేసిరి, కాని పాండవులు వారి వలలో జిక్కుకొనక తప్పించుకొనిరి. అంతట ధృతరాష్ట్రుడు రాజ్యమును విభాగించి ఇంద్రప్రస్థమను పట్టణము రాజధానిగాగల భాగమును పాండవులకిచ్చెను. అప్పుడు పాండవు లైదుగురును కలిసి ద్రౌపది యను నామెను పెండ్లాడి సుఖముగ కాలముగడుపుచుండిరి. కొంతకాలమునకు అర్జునుడు తన సోదరులను విడచి పన్నెండేండ్లు ఇతరచోట్ల వాసముచేయుచుండెను. ఇతడు ఆ కాలములో చాలభాగము కృష్ణునితో గడిపి చివరకు కృష్ణుని సోదరిని దీసికొని పారిపోయి, ఇంద్రప్రస్థము చేరెను. అటుపిమ్మట నతడైదు సంవత్సరములు ఇంద్రలోకమునందుండి, దివ్యాయుధప్రయోగములను నేర్చుకొనెను.

దుర్యోధనుడు పాండవులు వర్ధిల్లుచుండుట చూచి యీర్ష్యాజ్వాలక వారి నెట్లైన నాశనము చేయవలెనని నిశ్చయించుకొనెను. ఇట్టి దురుద్దేశముతో నతడు వారిని జూదమునకు బిలిచెను. మొదటి యాటయందే యుధిష్ఠిరుడు ఓడిపోవుటచే నతడు తన యావదాస్తియు, పాండవుల స్వాతంత్ర్యమును గోలుపోయెను. రెండవ పందెములోకూడ యుధిష్ఠిరునకు నష్టమే గలిగెను. కావున పంచపాండవులును, ద్రౌప

దియు జూదపు షరతుల ప్రకారము పండ్రెండేండ్లు వనవాసమును, అటుతరువాత పద మూడవయేట యజ్ఞాతవాసమును చేయవలసివచ్చెను.

అజ్ఞాతవాసాంతమున వారు తిరిగి వచ్చి రాజ్యమునందు తమకు రావలసిన భాగము సాధుమార్గమున దీసికొనజూచిరి. కాని యట్టిది సాధ్యము కాకుండినందున, ఇరుపక్షములవారును గొప్ప యుద్ధప్రయత్నములు చేయ నారంభించిరి. కురుపాండవులు యుద్ధసంసిద్ధులై, సమస్త సైన్యములతో యుద్ధరంగమున కూడియుండిరి. మొదటిదిన ముదయమున భగవద్గీతయందుగల కృష్ణార్జున సంవాదము జరిగెను.

కురుక్షేత్రయుద్ధము పదునెనిమిది దినము లతి ఘోరముగా జరిగెను. దృష్టద్యుమ్నుడు పాండవ సైన్యమునకును, భీష్ముడు కౌరవసేనకును నాయకులైయుండిరి. ఈ యుద్ధమందు లెక్కకు మించిన సైనికులు హతులైరి.

ఆ పదునెనిమిది దినములైనపిమ్మట కౌరవులలో ముగ్గురుమాత్రము సజీవులైయుండిరి. అట్టి సమయమున కౌరవులుచేసిన యుక్తిచే పంచపాండవులు, కృష్ణుడు, సాత్యకియునను ఏడుగురుతప్ప తక్కిన పాండవసేనయంతయు హతమాయెను.

యుద్ధమందు మరణమునొందిన కురుపాండవుల భార్యలు రణరంగమునకు వచ్చి తమ భర్తల దేహములపైబడి యేడ్చిరి. యుధిష్ఠిరుడు సింహాసనమెక్కెను. అటు పిమ్మట తక్కినవారు మృతులై స్వర్గలోకమునకు బోయిరి. తర్వాత కొంతకాలమునకు యుధిష్ఠిరుడుకూడ స్వర్గలోకమునకు బోయెను.

హిమాలయ పర్వతములనుండి కన్యాకుమారి యగ్రమువరకునుగల ప్రదేశమదంలి సకల జనాంగములవారును యుద్ధమున నేదో యొక పక్షమున చేరియుండినట్లు మహాభారతమున కలదు. కాని ఆగస్త్యునికాలమువరకు అనగా క్రీ. పూ. 550 వరకు నార్యులు దక్షిణ హిందూదేశము నాక్రమించుకొననందున ఈ దేశవాసులంతకుబూర్వము ఉత్తరహిందూస్థానమున జరిగిన యుద్ధములలో పాల్గొని యుండిరనుట యసంభవము. కనుక ఇది నమ్మతగినదికాదు.

విద్వాంసులనేకులు పాండవులు ఆర్యజాతిలోచేరినవారు కారనుచున్నారు. అనార్యులగు టిబెటుదేశస్థులవలెను, హిమాలయపర్వత వాసులగు కొన్ని జాతులవారివలెను, పంచపాండవులందరును ద్రౌపది యను నొక స్త్రీని పెండ్లిచేసికొనుటచే, ఒక స్త్రీ యనేకపురుషులకు భార్యయైయుండు నాచారమున్నట్లు అగుపడుచున్నది. పాండవ యను పదమునకు తెల్లబారిన ముఖమని యర్థమగుటచే మహాభారతములోని పాండవులు హిమాలయ పర్వతవాసులైయుండి యచ్చటినుండి పెద్ద గుంపులుగా దిగివచ్చి హస్తినాపురమును జయించిరనియు, అటుపిమ్మట బ్రాహ్మణులు వీరికిని, కౌరవులకును లేని సంబంధము కల్పించి వారిని తమ యార్యజాతిలో జేర్చుకొనియుందురనియు మనమూహింపవచ్చును.

4. The Teaching of the Epic. మహాభారతము బోధించెడు విషయములు.

(*a*) The Gods. దేవతలు.—ఋగ్వేద దేవతలసేవలను జనులు మరచి పోయిరి. మహా బలశాలియగు ఇంద్రుడుకూడ బ్రహ్మ, విష్ణు, శివుడను త్రిమూర్తుల కంటెను తక్కువ స్థితికివచ్చెను. గరుడుడు, గణేశుడు, కుబేరుడు, శ్రీ యనగా లక్ష్మి, శివుని భార్యయు భయంకరరూపిణియునగు దుర్గ యనగా పార్వతీ మొదలగు నూతనదేవత లేర్పడిరి. వీరుగాక ఇంద్రుడు, యముడు, వరుణుడు, కుబేరుడు, అగ్ని, ఈశాన్యుడు, వాయు, నైరృతి యను అష్టదిక్పాలురుకూడ ముఖ్యదేవతలై యుండిరి. వీరు దేవతలైయుండినను వీరందరును చేరినప్పటికిని నొక యుద్ధశూరుని తోగాని యొక ఋషీశ్వరునితోగాని సమానులు కాలేరట! క్షత్రియవీరులు దైవాంశగలవారై దేవతాశ్రేష్ఠులతో సములైయుండిరి. కాని సామాన్యజనులు మాత్రము బ్రాహ్మణులు భూదేవతలని నమ్మి వారిని పూజించుచుండిరి. మహాభారత మునందు బ్రాహ్మణులకు నీయనలసిన దానముల వివరములతో వందలకొలది పుటలు నింపియున్నారు.

మతగురువు దేవాదిదేవుడై యుండెను. ప్రజలకు రాజు దేవసముడైయుండెను. కుమారునకు తల్లిదండ్రులును, తమ్మునకు అన్నయు, భార్యకు భర్తయు దైవములైయుం డిరి. భర్తకు సేవచేయుటయే భార్యకు పరమధర్మమై యుండెను. సర్పవృక్షాది యనేక యితర వస్తువులను పూజించుచుండిరి.

(*b*) The Priests. మతాచార్యులు.—దురాశ, అతి భోగాసక్తి, తిండి పోతుతనము, పిరికితనము, కుటిలవర్తనము, గర్వము, తమ పాపములనుగూర్చి యుపేక్షింపు గుట యనునవి గురువులయొక్క ప్రధాన గుణవిశేషములైయుండెను. రాజులయొక్క ఆస్థానగురువులు ధనమును, అధికారమును కోరి న్యాయాన్యాయ వివేచన బొత్తుగా లేనివారై తమ రాజుల క్రూరకృత్యములకు దోడ్పడుచుండిరి.

(*c*) Asceticism. యోగాభ్యాసము.—ప్రజలలో యోగవిద్యాసక్తి హద్దు మీరియుండెను. తమ యోగసిద్ధిచే జనుల భ్రమింపజేసి, ధనాకర్షణచేయుచుండు సాధువులు బయలుదేరిరి. వీరు వట్టి వేషధారులును మాయగాండ్రునైయుండిరి. తమ యిష్టప్రకారము దేవతలను బలవంతపెట్టు ప్రభావముగల యజ్ఞ యాగాదికర్మలను విసర్జించి యిప్పుడు బ్రాహ్మణులు మంత్రయోగవిద్యలందు దగులుకొనిరి. శరీరమును కృశింపజేయుచు, పట్టుదలతో ఘోరతపస్సుచేయువాడే మహాత్ముడని జనులు తలంచు చుండిరి. అంతేగాక పరిపూర్ణ యోగసిద్ధినొందిన తపస్వి సామాన్య నీతిచట్టములకు బద్ధుడుకాడని యెంచుచుండిరి. సర్వసాధారణముగా మునీశ్వరులంతగ మెత్తని మనస్సుగలవారు కారు. శాపవన స్త్రీలను వంచించుట, తమ విరోధులపై పగ సాధించుకొనుట, తమ యద్భుతప్రభావముచే జనులను భయపెట్టుట మొదలగు నీచ గుణములుగలవారై యుండిరి. అంతేగాక తోలుబొమ్మలవంటి దేవతలను తమయిష్ట ప్రకారమాడింపగల శక్తి సామర్థ్యములనుకూడ కలిగియుండిరి.

(*d*) Sacrifices. బలులును యజ్ఞములును.—దేవతాప్రీతికొరకు ఆవుతో పాటు తదితర జంతువులనేగాక నరునికూడ బలియిచ్చుట యాచారమైయుండెను.

మృతినొందిన కుమారునితో నతని తండ్రినికూడ దహించినట్లు కొన్నిచోట్ల వ్రాసి యున్నది.

(*e*) Pilgrimages. యాత్రలు.—వనపర్వమునందు 75 యధ్యాయములలో తీర్థయాత్రలవలన పుణ్యములభించునని చెప్పియున్నది. గంగా, యమునా, సరస్వతీ నదులును, కురుక్షేత్ర, ప్రయాగపట్టణములును, మరికొన్నియు ప్రధాన పుణ్యక్షేత్రములైయున్నవి.

(*f*) Ethical Principles. నీతిసూత్రములు.—వీటిలో కొన్ని అతిశ్రేష్ఠమైనవి. మరికొన్ని మత్తయి 7: 12 లో ప్రభువుచెప్పిన సువర్ణసూత్రమువంటివి. దృష్టాంతముగా మహాభారతము 5: 39, 72 లో నున్నట్లు ఏది నీకు నొప్పి కలిగించునో దాని నితరులకు చేయకూడదనునదియే మానవధర్మము. మహాభారతము 13: 115, 22 లో నున్నట్లు జ్ఞానమును పరిశుద్ధజీవితమును కలిగినవారు తమకెట్లితరులు చేయవలయునని గోరుదురో అట్లే తాము నితరులకు చేయవలయును.

III. The Puranas and Upapuranas. పురాణములును, ఉపపురాణములును.

1. Dates. అవి పుట్టినకాలములు.—పురాణములును ఉపపురాణములును బుట్టక పూర్వము, సర్వజనులు ప్రమాణములుగా నంగీకరింపబడినట్టి గ్రంథములకు శాస్త్రములను నామముకలదుగాని, పురాణములనైతే భిన్నభిన్న శాఖలవారు తమ మత భేదములను జనులలో వ్యాపింపజేయుటకే వ్రాసిరి. పురాణములలో కొన్ని శంకర, రామానుజ, మధ్వ, వల్లభాచార్యుల వివిధోపదేశములను బలపరచు నుద్దేశముతో రచించిరి. కావున నీ పురాణములు క్రీ. వె. 800-వ సం॥ మొదలుకొని 1700-వ సం॥ వరకు నొకదానితరువాత నొకటి బహుకాలమునకు పుట్టియుండవచ్చును.

2. Numbers of the Puranas. పురాణముల సంఖ్య.—పురాణములు పదునెనిమిదియు, ఉపపురాణములు పదునెనిమిదియు గలవు. ఉపపురాణములను గురించి మనకు విశేషముగ తెలియదు. పురాణములు మూడు విధములైయున్నవని పద్మపురాణము చెప్పుచున్నది. అవేవనిన: (*a*) విష్ణు, నారదీయ, భాగవత, గరుడ, పద్మ, వరాహ యను వైష్ణవపురాణములును; (*b*) మత్స్య, కూర్మ, లింగ, శివ, స్కాంద అగ్ని యను శైవపురాణములును; (*c*) బ్రహ్మాండ, బ్రహ్మవైవర్త, మార్కండేయ, భవిష్య, వామన, బ్రహ్మ యను బ్రహ్మపురాణములును. ఈ మూడవ తరగతిలోని పురాణములన్నియు శివునిగూర్చియు విష్ణువునుగూర్చియు ముఖ్యముగా చెప్పుచున్నవి. పురాణములన్నిటిలో విష్ణుపురాణమును భాగవతపురాణమును ప్రసిద్ధములైయున్నవి. వీటిని విష్ణుభక్తులు పరమ ప్రమాణగ్రంథములుగ నెంచుచున్నారు. కృష్ణునిగూర్చిన యసహ్యకరములగు కథలీరెంటియందును గలవు. ఉపపురాణములలో బహుశా కలికిపురాణమందరికిని దెలిసినదియే.

3. Characteristics. పురాణముల గుణవిశేషములు.—పురాణమను పదమునకు బురాతనమని యర్థము. ఈ గ్రంథములయందనేక ప్రాచీన గాథలను జేర్చి

యున్నారని యీ నామమునుబట్టియే మనము గ్రహించుకొనవచ్చును. క్రీ. పూ. దాదాపు 50-వ సం॥న అమరసింహుడు తన నిఘంటునందు బురాణములు పంచ లక్షణములు కలిగియుండునని వ్రాసియుండెను. అవి యేవనగా:—(*a*) సృష్టి; (*b*) ప్రపంచనాశనము, పునస్సృష్టి; (*c*) దేవతలయొక్కయు, వంశకర్తలయొక్కయు, వంశావళులు; (*d*) మనువుల రాజ్యపరిపాలన; (*e*) సూర్యచంద్ర వంశరాజుల చరిత్రలు. కాని యే పురాణమందును పై యంశములన్నియు గాన్పింపవు.

4. Doctrines. పురాణములయందలి సిద్ధాంతములు.—ప్రస్తుతకాలమున హిందువులకు నంగీకారములగు మతసిద్ధాంతములును, ఆచారములును పురాణములలో గానవచ్చుచున్నవి. వీటిని పామరుల యుపయోగార్థము వ్రాసినారు. పురాణములలోని దేవతల సంఖ్యకు పరిమితియే లేదు. ప్రధాన దేవతలను, ఉపదేవతలను మాత్రమేగాక దేవాంశ సంభూతులగువారిని, నరమాత్రులగు మతాచార్యులను, గ్రహములను, నదులను, జంతువులను, పక్షులను, వృక్షములనుకూడ నిప్పటి హిందువులు పూజింతురు.

IV. Pancharatra Samhitas, Vaishnava Agamas and Saiva Agamas. పాంచరాత్ర సంహితలు, వైష్ణవాగమములు, శైవాగమములు.—ఇవియును తంత్రములును, దాదాపు పురాణకాలములోనివేయైనను, హిందువులకు నివియే పురాణములకన్నను చాల ముఖ్యములైయున్నవి. ఇవి యాయా శాఖలవారికి ననుకూలములగు బ్రమాణగ్రంథములు. పాంచరాత్ర సంహితలును, వైష్ణవాగమములును వైష్ణవులవి, శైవాగమములు శైవులవి. • వీటిలో నొక్కొక్కటి నాలుగు విషయములనుగూర్చి విశదీకరించుచున్నది. అవేవనిన: (1) తత్వశాస్త్రము; (2) మనస్సును సాధించి వశపరుచుకొనెడి సాధనములు; (3) దేవాలయనిర్మాణమును, నూతన దేవతాప్రతిష్ఠావిధానములును; (4) ఆరాధనక్రమములును, పలువిధ యాచారములును, ఆయా శాఖలవారి పూజారులకును, గురువులకు నుపయుక్తములగు విధులు, పూజావిధానములును.

V. The Tantras or Sakata Agamas. తంత్రములు లేక శాక్తాగమములు.—ఇవి కొంతవరకు బురాణములవంటివేగాని వాటికి బిదప కొంతకాలమునకు రచితములయ్యెను. వీటియందు సర్వమునకు నాధారమగు నుత్కృష్టపదార్థమును తల్లిగభావించి యామెయొక్క నామములలో నేదోయొకదానిచే నీ దేవతనారాధించెదరు. అతి హేయమగు శక్తిపూజావిధానములు వీటియందు గలవు. ఇవి శాక్తేయ శాఖవారికి బ్రమాణగ్రంథములైయున్నవి. తంత్రముల మొత్త మరువదినాలుగు.

ఎనిమిదవ యధ్యాయము

# CHAPTER VIII

## త్రిమూర్తులు

## The Trimurti

A. THEIR ORIGIN. వీరి యుత్పత్తి.—త్రిమూర్తుల యుత్పత్తిని గురించి పురాణము లేకీభవించుటలేదు. ఒకచోట యాదిశక్తికి నొక అండము పుట్టె ననియు, దానినుండి శివుడును, శివునినుండి విష్ణువును, విష్ణువునుండి ప్రపంచమును బుట్టెననియు గలదు. భాగవతపురాణములో బ్రహ్మ విష్ణువుయొక్క నాభికమలము నుండి జన్మించెననియు, ఆదిశక్తి మూడు గ్రుడ్లుపెట్టెననియు, వాటినుండి త్రిమూర్తులు పుట్టిరనియుం జెప్పుచున్నది. నారాయణుని కుడిప్రక్కనుండి బ్రహ్మయును, నెడమ ప్రక్కనుండి విష్ణువును, నడుమునుండి శివుడును పుట్టిరని నారదపురాణమందున్నది. లింగపురాణము శివుడే పరబ్రహ్మమనియు, నతడు విష్ణువును లక్ష్మిని తన యెడమవైపు నుండియు, బ్రహ్మను సరస్వతిని తన కుడవైపునుండియు పుట్టించెనని చెప్పుచున్నది. మార్కండేయపురాణము బ్రహ్మ మహా సరస్వతికిని, శివుడు మహాకాళికిని, విష్ణువు మహాలక్ష్మికిని కలిగిరని వివరించి, దేవియొక్క యాధిక్యతను చూపుచున్నది.

ఋగ్వేదములో అగ్ని, వరుణ, మిత్ర యనువా రొకవిధమగు త్రిమూర్తిగణ ముగ గానవత్తురు. వీరి నామముల మొదటి యక్షరములనగా అ. వ. మ. లేక అ. ఉ. మ్. కలుపుటవలన ఓం అను పవిత్రశబ్దమేర్పడెను. అటుపిమ్మట నిప్పటి హిందువులు నమ్మెడు బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులను త్రిమూర్తులేర్పడిరి. వీరు పురాణములలో గొన్నిటియందు సమానులుగను, కొన్నిటియందు నసమానులుగను. మరికొన్నిటియందు ముగ్గురు నేకస్వరూపముగ నున్నట్లుగను గనబడుచున్నారు.

త్రిమూర్తులు సృష్టి, పరిపాలన, నాశనములకు కర్తలుగనున్నారు. బ్రహ్మ రజోగుణమూర్తి అనగా ఇచ్ఛగలవాడు. ఇతడు సంకల్పించుటచే లోకము పుట్టెను. విష్ణువు సత్వగుణప్రధానుడు, అనగా దయాధర్మస్వరూపుడు. ఇతడు లోకమును బరిపాలించును. శివుడు తమోగుణమూర్తి అనగా అజ్ఞానమును, ఆగ్రహమును గల వాడు. లోకనాశనముచేయు నగ్ని ఇతని వశమందున్నది.

వీరు సర్వజీవులలో నతి శ్రేష్ఠులు. జన్మాంతరములకు లోనైనవారు కారు. కాని పరబ్రహ్మములో లీనమగుటకుమాత్ర మధికారములేకయున్నారు. వీరు చాల మట్టుకు సర్వోత్తమపదవి నొందినవారేయైనను, స్వయంభువులు కాకపోవుటచే సామాన్య మానవులతోబాటు వీరును చచ్చుచు, పుట్టుచు నుందురనికూడ పురాణ ములు చెప్పుచున్నవి. మూడు భిన్నభిన్న రూపములుగనున్నను, నెట్టి భేదమును లేక యేకస్వరూపమునసుండు క్రైస్తవ పరిశుద్ధ త్రిత్వము అనబడు త్రైయక వ్యక్తికిని, ఈ త్రిమూర్తులకు నెంత వ్యత్యాసమున్ననో చూడుడి.

B. BRAHMA. బ్రహ్మ.

**I. His Names.** ఇతని నామములు.—మాయతోఁగూడియున్న నిర్గుణబ్రహ్మమునుండి సగుణబ్రహ్మ యనగా ఆదిపురుషుడు పుట్టెను. కావున సగుణబ్రహ్మ, అపరబ్రహ్మ, సవిశేషబ్రహ్మ, పరమేశ్వరుడను నామములుకూడ ధరించెను. అతడే ముల్లోకములను, వాటియందలి సజీవ నిర్జీవపదార్థములన్నిటిని సృజించినవాడు. దేవతలకును, మానవులకును దండ్రి యనగా ప్రజాపతి యితడే. చెట్టును, పండును, విత్తనమునం దిమిడియుండులాగున సర్వ వస్తుసముదాయము నితనియందే యిమిడియుండెను. ఇతనికి నాభిజ యనగా బొడ్డునుండి పుట్టినవాడనియు, రంజజ యనగా కమలమునుండి పుట్టినవాడనియు మరి రెండు నామములు గలవు.

**II. The Origin of Brahma.** బ్రహ్మయొక్క జననము.—శతపథ బ్రాహ్మణము 11: 1—14 ఇతని జనన మీ క్రిందివిధమున వర్ణించుచున్నది. ఆదియందు జలముమాత్రమే యుండెను. ఆ జలమునకు కోరికగలిగెను. అంతట అది ఘోర తపస్సు చేసెను. అందుకు ఫలితముగా దానినుండి యొక బంగారుగ్రుడ్డు పైకి తేలెను. ఆ గ్రుడ్డులోనుండి ప్రజాపతి జన్మించెను. మానవ ధర్మశాస్త్రముకూడ బ్రహ్మ పుట్టుకనుగూర్చి యిట్లే చెప్పుచున్నది. అయితే రామాయణములో బ్రహ్మ పందిరూపముపొంది, భూమిని సముద్రములోనుండి పైకెత్తినట్లు గలదు. వేరొకచోట నీ కార్యము చేసినవాడు విష్ణువని వ్రాసియున్నది. మహాభారతము బ్రహ్మ విష్ణువుయొక్క నాభినుండియో, అందు మొలచిన కమలమునుండియో, పుట్టెనని చెప్పుచున్నది. అందుచే నతనికి నాభిజ, రంజజ యను నామములు కలిగెను.

**III. The Worship of Brahma.** బ్రహ్మపూజ.—ఒకానొకప్పుడు బ్రహ్మ అసత్యమాడెనను కథ కలదు. అందుచే బ్రహ్మపూజ హిందూదేశములో అరుదుగానున్నది.

**IV. The Length of His Life—Yugas and Kalpas.** ఇతని జీవిత కాలపరిమాణము.—ఇది యుగయుగములుగను, కల్పములుగ నున్నది. యుగములు నాలుగు. అవేవనగా:—

1. ఉదయాస్తమానములుగాగల కృతయుగమునకు సం॥ 4,800
2. ,, ,, త్రేతా ,, ,, 3,600
3. ,, ,, ద్వాపర ,, ,, 2,400
4. ,, ,, కలి ,, ,, 1,200

పై నాలుగు యుగములయొక్క సంపత్సరముల మొత్తము 12,000.

అయితే మానవుల సంపత్సరములు 360 కలిసి దేవతల కొక సంవత్సరమగును. కావున పైజెప్పిన ప్రతి యుగసంఖ్యను 360 తో పెంచినయెడల మానవుల లెక్క ప్రకారము కృతయుగమునకు 17,28,000 సం॥లును; త్రేతాయుగమునకు 12,96,000 సం॥లును; ద్వాపరయుగమునకు 8,64,000 సం॥లును; కలియుగమునకు 4,32,000 సం॥లును వచ్చును. వీటి మొత్తము 43,20,000 సం॥లు.

ఈ 43,20,000 సం॥లు దేవతలకు నొక యుగమగును. ఇట్టి దేవతాయుగములు వెయ్యి చేరి బ్రహ్మకు నొక దినమగును. అనగా నొక బ్రహ్మదినము 4,32,00,00,000 మానవసంవత్సరములతో సమానము. బ్రహ్మరాత్రికూడ నిన్నియేండ్లే కలిగియుండును. బ్రహ్మయొక్క యొక పగలును, నొక రాత్రియు జేరి యొక కల్పమగును. కావున కల్పమునకు 8,64,00,00,000 సంవత్సరములు గలవు.

లోకము సృష్టించినది మొదలుకొని యొక బ్రహ్మ దినపర్యంతము అనగా 4,32,00,00,000 సం॥లు జరిగి, యటుపిమ్మట పంచభూతములును, దేవతలును ఋషులును తప్ప తక్కిన ప్రపంచమంతయు లయమగును. అటుపిమ్మట బ్రహ్మ యొక రాత్రియంతయు ననగా 4,32,00,00,000 మానవసంవత్సరముల కాలము నిద్రించి, పిదప మేలుకొని మరల ప్రపంచమును సృజించును. ఇట్టి రాత్రింబగళ్లు నూరైన యెడల బ్రహ్మయొక్క జీవితకాలమగును. ఇప్పటికి బ్రహ్మ జీవితకాలములో సగము జరిగిపోయెను.

V. His Special Work. ఇతని ముఖ్యకార్యము.—ప్రపంచమును సృజించుటయే.

వేరువేరు హిందూగ్రంథములు సృష్టినిగూర్చి యనేక విధములుగ జెప్పుచున్నవి. ఋగ్వేదము 10: 120, 1—6 లో ప్రపంచసృష్టినిగూర్చి యీ క్రింది కథగలదు. ఆదియందు దేవుడు నిశ్చలముగ శ్వాసించుచు, తన సహజయుష్ణముచే నభివృద్ధియగుచుండెను. ఈ సహజయుష్ణము సంతానాభివృద్ధికలిగించు శక్తియగుటచే దీనిని సంకల్పగుణమని బృహదారణ్యకోపనిషత్తునందు వ్రాసిరి. అప్పు డతనిలో ఇచ్ఛ పుట్టెను. ఆ యిచ్ఛయే జీవనిర్జీవ పదార్థములకుగల సంబంధము. అట్టి సమయమున ననేక మహాశక్తులుండెను. ఈ సృష్టిక్రమమంతవరకు వివరించి యటుపిమ్మట నీ గ్రంథకర్త ప్రపంచోత్పత్తిని వర్ణింపజాలకపోయెను.

మానవ ధర్మశాస్త్రమునందు మనువు సృష్టినిగూర్చి యీ క్రింది కథ వ్రాసియున్నాడు. ఆదియందు బ్రపంచమంధకారమయమై నిద్రావస్థయందున్నట్లుండెను. అప్పుడు స్వయంభువువచ్చి యంధకారమును బోగొట్టెను, అంతట నతనికి ననేక వస్తువుల బుట్టింపవలెనను నిచ్ఛ కలిగినందున, జలములను సృజించి వాటియందు దన బీజమును స్థాపించెను. ఆ బీజమొక బంగారుగ్రుడ్డయ్యెను. దానినుండి సృష్టికర్త యగు బ్రహ్మ జనించెను. పురుషరూపుడగు ఆదినరుని సంతానమగుటచే నీ జలములకు నార యను పేరు కలిగెను. అవి యతనికి మొదటి అయనము అనగా నివాసమైయుండినందున బ్రహ్మకు నారాయణ యను మరియొక నామము కలిగెను. పిమ్మట కొంతకాలమునకు విష్ణువునకుకూడ నిట్టిపేరే కలిగెను. బ్రహ్మ యీ బంగారుగ్రుడ్డునందు నొక సంవత్సరము వాసముచేసి, అటుపిమ్మట దానిని రెండుగ విభాగించెను. ఆ భాగములతో నతడు స్వర్గలోకమును, భూలోకమును, వాటికి మధ్యనుండు ఆకాశమును నిర్మించెను. అటుతరువాత బ్రహ్మ తనలోనుండియే మనస్సును, అహంకారమును, జీవాత్మను, త్రిగుణ వికారములుగల వస్తుసముదాయమును, జ్ఞానేంద్రియములను

బుట్టించెను. అంతట నతడు తాను సృష్టించిన వస్తువులన్నిటికిని పేర్లు పెట్టెను. పిదప నతడు దేవతలను, వేదకర్మలను, స్తోత్రములను, యజ్ఞములను, కాలమును గ్రహములను, తక్కినవాటినన్నిటిని సృష్టించెను. అతడు అగ్నినుండి ఋగ్వేదమును, వాయువునుండి యజుర్వేదమును, సూర్యునినుండి సామవేదమును, పాలు పితికినట్లు పితికెను. అంతట నతని నోటినుండి బ్రాహ్మణులును, బాహువులనుండి క్షత్రియులును, తొడలనుండి వైశ్యులును, పాదములనుండి శూద్రులును బుట్టిరి.

ప్రపంచసృష్టినిగూర్చి మనువు పై గాథగాక మరియొక కథకూడ చెప్పియున్నాడు. బ్రహ్మ తన దేహమును రెండు సమభాగములుగ జేసెను. అందొకటి పురుషస్వరూపము. రెండవది స్త్రీస్వరూపము. స్త్రీభాగమునుండి యతడు విరజను బుట్టించెను. విరజను నతనివలన మనువు జన్మించెను. ఈ మనువు ఘోర తపస్సుచేసి పదుగురు ప్రజాపతులను గనెను. వారు మరి యేడుగురు మనువులను, దేవతలను, ఋషులను, రాక్షసులను, సుగుణ భూతములను, పితృదేవతలను, మానవులను, తక్కిన సమస్త పదార్థములను, సృజించిరి. ప్రపంచసృష్టిలయము లొకదానివెంబడి యొకటి యెడతెగక జరుగుచు నేయుండెను.

మానవధర్మశాస్త్రమునందలి సృష్టినిగురించిన మూడవ కథ. సమస్తమును వేరుగా జరిగెనని చదువుచున్నాము. బ్రహ్మరాత్రి అయినపిమ్మట అతడు మేలుకొని మరల సమస్తమును సృష్టించెను. మొదట మనస్సును సృష్టించినతరువాత, మనస్సు ఆకాశమును, అది వాయువును, వాయువు వెలుగును, వెలుగు జలమును, జలము భూమిని, కలుగచేసెను.

రామాయణమందు 2: 110—112 లో సృష్టినిగూర్చి మరియొక కథ గలదు. ఆదియందు సర్వమును జలమయముగ నుండెను. ఆ జలమునుండి భూమి యేర్పడెను. భూమినుండి స్వయంభువగు బ్రహ్మయు, దేవతలును బుట్టిరి. అంతట బ్రహ్మ పందియై భూమిని జలములోనుండి పైకెత్తి లోకమంతటిని, తన కుమారులగు ఋషులను సృజించెను.

## VI. His Wives. ఇతని భార్యలు.

1. Sarasvati. సరస్వతి.—ఈమె జ్ఞానమును, నూతన కల్పనాశక్తిని, ఊహించు శక్తి నిచ్చు నట్టిదేవి. ఈమె వేదములకును, సంస్కృత లిపి యనగా దేవనాగరి యక్షరములకును తల్లి. ఈమె సంగీతమునకును, వాక్కునకునుకూడ దేవత. కావున నీమెకు వాగ్దేవియను మరియొక నామము గలదు. సరస్వతి యనునది పంజాబు దేశమందలి యొక యేటియొక్క పురాతన నామము. దాని తీరములందు నేటివరకు నార్యులు యజ్ఞములు చేయుచున్నారు. హిందూ విద్యార్థులు ముఖ్యముగా సరస్వతినే పూజింతురు.

2. Gayatri. గాయత్రి.—ఒకనాడు బ్రహ్మ హోమములు చేయవలసియుండెను. కనుక నతడు తన భార్య యగు సరస్వతిని బిలువనంపెను. కాని యామె తక్కిన దేవతల భార్యలు వచ్చినగాని తాను రానని చెప్పెను. బ్రహ్మ యందుకు కోప

పడి, యెచ్చటనుండియైన తనకొక భార్యను తెమ్మని ఇంద్రుని పంపెను. ఇతడు వెళ్లి గాయత్రి యను నొక సౌందర్యవతియగు గొల్లకన్యను పిలుచుకొనివచ్చెను. బ్రహ్మ యామెను పెండ్లాడెను. తరువాత కొంతసేపటికి సరస్వతి వచ్చి సభవారిలో గొందరిని శపించి తుదకు గాయత్రిని బ్రహ్మకు రెండవభార్యగా నంగీకరించి యామెతో సమాధానపడెను.

## C. VISHNU. విష్ణు.

I. His History. ఇతని చరిత్ర.—విష్ణువు ఋగ్వేదమునందు ఉదయ మధ్యాహ్న సాయంకాలములను మూడడుగులలో నాకాశమంతటిని దాటిపోయెడు సూర్యుడుగ నున్నాడు. అయిన నతడు తక్కిన దేవతలకంటె తక్కువ పదవియం దుండెను. బ్రాహ్మణములలో నతడు వామనావతారమెత్తి లోకమును రాక్షసుల వశమునుండి తప్పించి, దేవతల కిచ్చినట్లు కలదు. మహాభారతము విష్ణుని పరమాత్మ నిగ భావించుచున్నను, ఇతడు శివుని నారాధించెనని చెప్పుచున్నది. రామాయణ మును, విష్ణుపురాణమును విష్ణువు పరమాత్ముడే యనుచున్నవి. హరి, పురుషోత్తముడు, అనంతుడు, కేశవుడు, మాధవుడు అను నామములు విష్ణువునకు గలవు. ఒకడు తన జీవితకాలమున నెంత దుర్మార్గుడైయుండినను, అతడు చనిపోవునప్పుడు విష్ణునామము గాని విష్ణువుయొక్క యవతారములలో నే నామమైనగాని యుచ్చరించిన మాత్రము ననే మోక్షమునొందును. ఇట్టి గొప్ప ప్రభావము విష్ణునామమునకు గలదని వైష్ణ వులు నమ్ముదురు.

II. Images of Vishnu. విష్ణుని స్వరూపము.—ఇతడు నల్లని దేహము గలవాడు. ఇతనికి నాలుగుచేతులు గలవు. శంఖము, చక్రము, గద యను నాయుధ ములు మూడుచేతులలోను పద్మము నాల్గవచేతిలో నుండును. ఇతని వాహనము గరుడుడు. సర్వసంపదల నిచ్చునట్టి లక్ష్మి ఇతని భార్య. లక్ష్మినామముకంటె శ్రీయను నామము ప్రసిద్ధమైనది. విష్ణు రామావతారమెత్తినప్పుడు లక్ష్మి యతని భార్యయగు సీతగా బుట్టెను. విష్ణువు కృష్ణావతారమెత్తినప్పుడు లక్ష్మి యతని భార్యయగు రుక్మిణి యయ్యెను.

III. His Special Work. విష్ణువుచేయు ముఖ్యకార్యము. — సకల సృష్టిని కాపాడుట విష్ణువుయొక్క ముఖ్య కార్యము.

IV. Avataras of Vishnu. విష్ణువుయొక్క యవతారములు.—లోక మున నధర్మము వృద్ధినొందినప్పుడెల్ల దానిని నశింపజేసి ధర్మమును స్థాపించుటకు విష్ణువు అవతరించునని హిందువులు నమ్ముదురు. ఈ యవతారములన్నియు గలసి 22 అని భాగవతపురాణమునందు వ్రాసియున్నది. అయినను వీటిలో 10 మాత్రమే ప్రధా నములైనవి. కొన్ని గ్రంథములు చేప యవతారమును, పంది అవతారమును, బ్రహ్మకు సంబంధించినవని చెప్పుచున్నవి. కాని మరికొన్నిటిలో నీ రెండును విష్ణువుయొక్క యవతారములని యున్నవి. పిమ్మట కొంతకాలమునకు ప్రతి మతా చార్యుడును విష్ణువుయొక్కగాని అతని పరివారదేవతలయొక్కగాని యతని చిహ్న

ములయొక్కగాని యవతారమని జనులు నమ్మ నారంభించిరి. తదితర దేవతలకంటె విష్ణువును అతని యవతారములను గొల్చెడివారే లెక్కువ మించియున్నారు. విష్ణువు అవతారము లెత్తుటకు గారణమును తెలిపెడు కథ యొకటి గలదు. భృగువు భార్యను విష్ణువు తన చక్రముతో నన్యాయముగ జంపినందున, ఆ ముని నీవు పది యవతారము లెత్తెదవుగాక యని విష్ణువును శపించెను.

1. Matsyāvatāra. మత్స్యావతారము.—జలప్రళయమువచ్చి, ప్రపంచ మంతటిని ముంచివేసినప్పుడు మనువును, నేడుగురు ఋషులునుమాత్ర మొక పడవ లోనికిబోయి, దానిని నీటనున్న యొక చేపకొమ్మునకు గట్టిరి. విష్ణువుయొక్క యవ తారమైన యా మత్స్యము వారిని గాపాడెను. ఈ యవతారమునుగూర్చి మరియొక కథ గలదు. ప్రళయకాలమున బ్రహ్మ నిద్రించుచుండగా సోమకుడను రాక్షసుడు వేదములను దొంగిలించుకొనిపోయెను. అంతట విష్ణువు మత్స్యావతారమెత్తి యా రాక్షసుని జంపి వేదములను బ్రహ్మకు మరల తెచ్చియిచ్చెను. అయితే ప్రళయమువచ్చి యంతయు మునిగియుండగా సోమకుడుమాత్ర మెట్లు తప్పించుకొనగలిగెనో తెలియ కున్నది. పై మొదటిగాథతో నోవహును, ప్రళయమునుగూర్చిన కథను బోల్చి చూడుము.

2. Kūrmāvatāra. కూర్మావతారము.—విష్ణువు, దేవతలు పోగొట్టుకొనిన యమృతమును మరల సంపాదించుటకు పాలసముద్రమును చిలుకుమని వారికి నాజ్ఞాపించెను. అంతట విష్ణువు మంధరపర్వతమును కవ్వముగాజేసి, తాను తాబేటి రూపమొంది యా కవ్వమును తన వీపున నిలువబెట్టుకొనెను.

3. Varāhāvatāra. వరాహావతారము. — హిరణ్యాక్షుడను రాక్షసుడు భూమిని చాపవలెచుట్టి సముద్రపు అడుగునకు దీసికొనిపోగా, విష్ణువు పందిరూపము ధరించి, రాక్షసుని వెంబడి నీటిలోమునిగి, అతనితో వెయ్యేండ్లు పోరాడి భూమిని పైకితెచ్చెను. హిరణ్యాక్షుడు భూమిని చుట్టగా చుట్టినప్పు డతడెక్కడ నిలిచి యుండెనో తెలియకున్నది.

4. Narasimhāvatara. నరసింహావతారము. — హిరణ్యకశిపుడను రాక్ష సుడు తాను దేవతలచేతగాని మానవులచేతగాని జంతువులచేతగాని మరణము నొంద కుండునట్లు వరము సంపాదించి, లోకమును బాధించుచుండెను. అప్పుడు విష్ణువు నరసింహావతారమనగా సగము సింహరూపమును, సగము నరరూపమునుగల యాకా రమును ధరించి యొక స్తంభమునుండి బయటికివచ్చి యా రాక్షసుని జంపివేసెను.

పై నాలుగు అవతారములెత్తుటకు గారణము, లోకమున దుర్నీతియు, దుర్మార్గ మును వ్యాపించియుండినందున అని పురాణములు చెప్పుచున్నవి. కాని ఈ నాలుగు అవతారములును కృతయుగమునాటి వనుచున్నారు. అట్లయితే జనులు ధర్మాత్ములై యెక్కువ నిష్ఠతో గర్మల నాచరించుచుండు సత్యయుగమున విష్ణువు అవతరించవల సిన అగత్యముండునా?

5. Vāmanāvatāra. వామనావతారము.—బలి యను రాక్షసుడు ముల్లోకములను స్వాధీనపరచుకొనియుండగా, విష్ణువు వామనావతారమెత్తి యా రాక్షసునికడకు వెళ్లి, మూడడుగుల నేల నిమ్మని ప్రార్థించెను. అందుకు బలియొప్పుకొనెను. అంతట మిక్కిలి కురచవాడైయుండిన విష్ణువు తన దేహమును బ్రహ్మాండముగ పెంచుకొనెను. కావున నతని రెండడుగుల కొలతకే స్వర్గలోకమును, భూలోకమును సరిపోయెను. ఈ రాక్షసుడగు బలి యుండుటకు స్వర్గభూలోకముల నెచ్చటను చోటులేనందున అధోలోకమున బడియుండవలసివచ్చెను. పుణ్యము సంపాదించుటకై బలి విష్ణువుయొక్క కోరిక నంగీకరించెను. కాని విష్ణువు కపటబుద్ధితో నతనిని మోసముచేసి క్రిందిలోకమునకు త్రోసివేసెను.

6. Parasu Rāmāvatāra. పరశురామావతారము. — లోకమున యుద్ధములును నరహత్యలును ప్రబలమైయుండినందున, విష్ణువు పరశురాముడను నామముతో నొక బ్రాహ్మణునికి బుట్టి, యిరువదియొక్కమారు క్షత్రియులతో యుద్ధమాడి, వారి కులమును నిర్మూలముచేసెను. ఈ కథనుబట్టి శూరులగు క్షత్రియులకును, మతాధికారులగు యాజకులకును జరిగిన మహా పోరాటమందు యాజకులే జయశీలురైరని మనము గ్రహింపవచ్చును.

7. Rāmāvatāra. రామావతారము. — విష్ణువుయొక్క యవతారమగు నీ రాముడే రామాయణ కథానాయకుడు.

8. Krishnāvatāra. కృష్ణావతారము.—విష్ణువుయొక్క యవతారమగు నీ కృష్ణుడే భగవద్గీతయందలి కథానాయకుడు.

9. Buddhāvatāra. బౌద్ధావతారము.—వేలకొలదిజనులు బౌద్ధమతములో చేరుచుండుట చూచి బ్రాహ్మణులు దేవతలకు విరోధులయినవారిని తప్పుమార్గమున నడిపించుటకు బుద్ధుడు విష్ణువుయొక్క తొమ్మిదవ యవతారమాయెనని బోధించిరి. "బౌద్ధావతారమునందు విష్ణువు తన మాటలచే వేదములను తృణీకరించువారిని మోసపుచ్చును" అని భాగవతపురాణము చెప్పుచున్నది. దేవుడు మానవదేహధారియై వచ్చుట అధర్మముల నుపదేశించుటకా? ఎంత విపరీతము!

10. Kalki, or Kalkin Avatāra. కలికావతారము. — కలియుగాంతమున తెల్లని గుర్రమునెక్కి రాబోవు నిష్కళంకుడగు పురుషుడు కలికమూర్తి. హిందువులవలెనే బౌద్ధులు ఒక బుద్ధుడు వచ్చుననియును, మహమ్మదీయులు మహ్దీ వచ్చుననియును, క్రైస్తవులు యేసుప్రభువు రెండవసారి వచ్చుననియు నెదురుచూచుచున్నారు. వీరందరు నొకే యభిప్రాయము గలవారైయుండుట గమనించవలసిన విషయమే.

## D. SIVA. శివుడు.

I. His History. ఇతని చరిత్ర.—శివుడను పేరు ఋగ్వేదములో కనబడకున్నను, అందలి ప్రచండ వర్షదేవుడగు రుద్రుని శివుడే యందురు. రుద్ర యను పదమునకు ఉరిమెడివాడనియు, రోదనముచేయువాడనియు నర్థము. కాని శివ

యను పదమునకు శుభమిచ్చెడువాడని భావము. ఇతడు ప్రజాపతికి ఉషస్సువలన పుట్టిన కుమారుడనియు, తనకు పేరులేదని యేడ్చుచుండినందున, తల్లిదండ్రు లితనికి రుద్రుడను పేరుపెట్టిరనియు శతపథబ్రాహ్మణము చెప్పుచున్నది. యజుర్వేదము ఇతడు పిశాచములకును, సర్పదేవతలకును ప్రభువనియు, దొంగయు మోసగాడునై యుండినను, పాపవిమోచనయు, ఆనందమును అనుగ్రహించువాడనియును, చెప్పుచున్నది. పిమ్మట కొంతకాలమునకు రుద్రుడే శివుడని చెప్పసాగిరి. మహాభారతమునం దితడు పరబ్రహ్మముగ కనబడుచున్నాడు. ఇతనికి 1008 నామములు కలవు. వాటిలో నీ క్రిందివి సామాన్యమైనవి: మహేశ్వరుడు, మహాదేవుడు, ఈశ్వరుడు, భూతేశ్వరుడు, దిగంబరుడు, చంద్రశేఖరుడు, పంచాననుడు, శంకరుడు, హరుడు, రుద్రుడు. ఇట్లుండినను శివుడు తనకు విష్ణువు ప్రభువని యొప్పుకొనెనని విష్ణుపురాణములు చెప్పుచున్నవి.

II. Siva's Wives. ఇతని భార్యలు.—శివుడు దక్షుని కుమార్తెయగు ఉమను వివాహమాడెను. శివుడు శ్మశానభూములలో తిరుగువాడని యతనిపై దక్షుడు కోపించెను. ఇతనికి శ్మశానవాసి యని పేరు గలదు. ఈ కారణముచే దక్షుడు తాను చేయబోవుచుండిన యజ్ఞమునకు తన యల్లుడైన శివుని పిలువలేదు. హిమాలయపర్వతమందలి మానస సరస్సునకు ఉత్తరముననున్న కైలాసగిరిపై నివసించెడు తన భర్త యగు శివునివిడిచి ఉమ తన తండ్రి చేయుచుండిన యజ్ఞము చూడ వెళ్లగా, అక్కడ తండ్రిచే తనకు కలిగిన యవమానమును భరింపజాలక, సతి యను నామమునకు తగినట్లు అగ్నిలోపడి ప్రాణమువిడిచెను. అంతట శివుడు తన తల వెండ్రుకలలో నొగదానితో వీరభద్రుని పుట్టించి, దక్షుని చంపుమని యతని కాజ్ఞాపించెను. వీరభద్రునికిని దక్షునికిని ఘోరయుద్ధము జరిగెను. ఇతడు దక్షుని శిరస్సును ఖండించి యగ్నిలో బడవేసెను. అటుపిమ్మట దక్షుడు శివునితో సమాధానపడెను.

పిమ్మట కొంతకాలమునకు ఉమ హిమవంతుని కుమార్తెయగు పార్వతిగా తిరిగి పుట్టెను. శివుని భార్యకు ఉమ, పార్వతి యను నామములేగాక దుర్గ, కాళి, భవాని యను పేర్లుకూడ గలవు. పార్వతి యనగా పర్వతదేవత యని భావము. కావున పార్వతి, దుర్గ, కాళి యను నామములుగల శివుని భార్య మొదట ద్రావిడులకు దేవతగానుండినట్లును, కాలక్రమమున హిందువు లామెను తమ దేవతాగణములో జేర్చుకొన్నట్లును కనబడుచున్నది. ఇదేవిధమున మొదట ద్రావిడు లారాధించుచుండిన శివునికూడ హిందువులు తమ దేవతలలో నొకనిగ జేర్చుకొనిరనుటకు తగిన రుజువు లీగ్రంథమందు "హిందూమతాంతర్భాగమగు ద్రావిడమతము" అను తొమ్మిదవ ప్రకరణములో జూడుము. పూర్వము కాళికాదేవికి హిందువులు నరబలు లిచ్చుచుండిరని కలికపురాణము చెప్పుచున్నది. కాని ప్రస్తుతకాలమున నా దేవికి గొఱ్ఱెలను, మేకలనుమాత్రము బలి యిచ్చుచున్నారు. మధురయందు వేయి స్తంభములు గల నటరాజాలయములో నొక తీర్థయాత్రాపరునియొక్క శిశువుకంఠము కోసి, దేవుని కర్పించుచున్న కాళికాదేవి విగ్రహము గలదు. ఇప్పటికి కొంతకాలము

క్రిందట సర్కారువారు అణచివేసిన థగ్గులను దారిదోపుడుదొంగలకు కాళికాదేవి యిష్టదేవతగ నుండెను.

III. Representation of Siva. ఇతని స్వరూపము.—శివుని విగ్రహములలో కొన్నిటికి నొకేముఖమును, కొన్నిటికి మూడు ముఖములును, మరి కొన్నిటికి నైదు ముఖములు నుండును. ఇతడు ముక్కంటి యనగా మూడు కన్నులుగలవాడు. ఇతడు తన నొసటిపైన అర్ధచంద్రుని ధరించియుండును. మెడలో నొక సర్పమును, తక్కిన దేహముపై మరికొన్ని సర్పములను ధరించియుండును. ఇతడు తన తలనిండ జడలుగలవాడై తన దేహమంతయు బూడిదపూసుకొని, మెడలో పుర్రెలదండ వేసికొనియుండును. ఇతని కంఠము నీలవర్ణముగలది. ఇతని వాహనము నంది యను తెల్లని యెద్దు. ఇతడు తన దేహమున లేడిచర్మముగాని, పులిచర్మముగాని, ఏనుగచర్మముగాని ధరించియుండును. ఇతడు త్రిశూలమును, విల్లును, పిడుగును, డమారమును చేతబట్టుకొనియుండును. ఇతడు డమారమును వాయించుచు నాట్యము చేయును. ఇతడాకాశమునుండి పడుచున్న గంగానదిని తన జడలయందు బట్టుకొనెను.

IV. Siva's Functions and Characters. ఇతని గుణశేషములును, కార్యములును.

1. మానవులను, ప్రతి కల్పాంతమున ప్రపంచమును నాశనముచేయువాడితడే.

2. ఇతడు సృష్టిపదార్థములను లయముచేసి, పునస్సృష్టిచేయును. ఇతనికి నిట్టి శక్తిగలదని సూచించుటకుగాను శివభక్తులు లింగమును, పానపట్టమును నారాధించెదరు. ఇతడు అర్ధనారీశ్వరుడు, అనగా సగము స్త్రీయనియు సగము పురుషుడనియు భావము.

3. ఇతడు మహా తత్త్వజ్ఞాని. పాణిని యను వ్యాకరణశాస్త్రజ్ఞుడీ దేవుని సహాయమువలననే వ్యాకరణశాస్త్రమును రచియించెను.

4. ఇతడు మహా యోగసంపన్నుడు, విశేష తపోబలముగలవాడు, దిగంబరుడు, ధ్యానసిద్ధిగలవాడు, అద్భుత శక్తిసామర్థ్యములుగలవాడు, లక్షలకొలది సంవత్సరములు ఉన్నపాటుననేయుండి ధ్యానింపగలవాడు. ఇతడు తాను బ్రహ్మ శిరస్సులలో నొకదానిని ఛేదించిన పాపమును పరిహరించుకొనుటకై భిక్షకుడాయెను.

5. ఇతడు నాట్యమాడువారికి ప్రభువగుటచే నటేశ్వరుడను నామముగలడు. ఇతడు మితిమీరి త్రాగుచు, పార్వతీదేవితో గలిసి యుగ్రముగ నాట్యమాడుచుండును. శివభక్తులు ఇటువంటి రూపముగల శివునితోబాటు అతని భార్యయగు శక్తినిగూడ సాధారణముగా గొల్చెదరు. వారిలో ననేకులు నీతిమాలినవారు.

6. ఇతడు భూతములకు నధిపతి గనుక భూతేశ్వరుడను నామము ధరించియున్నాడు. ఇతడు స్మశానములలో తిరుగుచుండును. భూత పిశాచ సమూహ

ములు సదా కాలము ఇతని వెంట బోవుచుండును. శివుని భూతగణములను అతని కుమారులగు స్కంధ, గణేశ, అయనారు అనువారు పరిపాలించుచుందురు.

V. Manifestation of Siva. శివుని దర్శనములు.—ఈ దేవుడు స్త్రీ గర్భమున నెన్నడును జన్మింపడు గాని శివుడు అప్పుడప్పుడు మనుష్యరూపమున తన భక్తులకు దర్శనమిచ్చెనని శైవసిద్ధాంతము చెప్పుచున్నది. అయితే తర్వాత కొంత కాలమునకు రచించిన శైవగ్రంథములు శంకరుడును శైవమతాచార్యులందరును శివుని యంశమువలన పుట్టిన యవతారపురుషులే యని చెప్పుచున్నవి. అవతారము లెత్తుటచే విష్ణువు సర్వజనప్రియుడయ్యెను. శివుడైతే లింగమూర్తిరూపమున మహాభారతకథలో ప్రసిద్ధుడైయున్నాడు.

VI. Sons of Siva and Parvathi. పార్వతీ పరమేశ్వరులకు కుమారులు.

1. Ganesha. గణేశుడు.—గణేశుడను నామమునకు తగినట్లు నితడు భూతగణములకును ఉపదేవతలకును నధిపతి. ఇతడు అదృష్టదేవత, విపరీతతిండి పుష్టియే యితనికి కళంకము తెచ్చుచున్నది. ఇతడు పార్వతి విసర్జించిన మురికి పిండినుండి పుట్టెను. ఇతడు పుట్టినప్పుడు శనిగ్రహము ఇతనిని తేరి చూచినందున, ఇతని శిరస్సు ఊడి పడిపోయెను. అంతట విష్ణువు అతిత్వరితముగ నిద్రించుచున్న యొక ఏనుగ తల నరికి తీసికొనివచ్చి, గణేశుని మొండెమునకు అతికించి యతనిని బ్రతికించెనని యొక పురాణములోనున్నది. ఇతని పుట్టుకవిషయమై పురాణములు పలువిధములుగ చెప్పుచున్నవి.

2. Skanda or Kartikeya. స్కందుడు లేక కార్తికేయుడు.—ఇతడు యుద్ధదేవత. రాక్షసులకు విరోధులైన దేవతల సేనాధిపతి. దక్షిణహిందూదేశీయులు ఇతనిని సుబ్రహ్మణ్య యను నామమున పూజింతురు. సుబ్రహ్మణ్యయను పదమునకు బ్రాహ్మణులయందు ననుగ్రహముగలవాడని భావము.

3. Ayanār. అయనారు.—ఇతడు భూతగణములకు నధిపతి. భూతములు మూడు విధములు. (a) బలవంతముగ మరణమునొందినవాని జీవుడు భూతమగును. (b) అంగహీనునియొక్క గాని కురూపియొక్క గాని అకాలమందు పుట్టిన బిడ్డయొక్క గాని జీవాత్మ ప్రేత యగును. (c) నరహంతకుడు, త్రాగుబోతు, అబద్ధికుడు, వ్యభిచారి, నేరస్థుడు, పిచ్చివాడు వీరియొక్క జీవాత్మలు పిశాచములగును.

తొమ్మిదవ యధ్యాయము

# CHAPTER IX

## హిందూమతాంతర్భాగమగు ద్రావిడమతము, విగ్రహారాధనము, ఉపవాసవ్రతములు, పండుగలు

## The Dravidian Religion in Hinduism, Idol Worship and Hindu Fasts and Festivals

### A. THE DRAVIDIAN RELIGION IN HINDUISM.

### హిందూమతాంతర్భాగమగు ద్రావిడమతము.

I. The Aryan Conquest of the Dravidians. ఆర్యులు ద్రావిడులను జయించుట.—హిందూదేశయాదిమ నివాసులు నల్లని దేహముగల ద్రావిడులనియు పసిమివర్ణముగల కోలేరియనులనియు రెండు తెగలుగ నుండిరి. కోలేరియనులు హిమాలయముయొక్క ఈశాన్యమార్గముద్వారా హిందూదేశములో ప్రవేశించునప్పటికే ద్రావిడులు వచ్చియుండిరి. ప్రస్తుతకాలమున నీ దేశమందుండెడి యనార్యులనందరిని ద్రావిడులందురు. కోలేరియనులు వచ్చినతరువాత బహుకాలమునకు నీ దేశ వాయవ్యమూలనుండి తెల్లని వర్ణముగల యార్యులు వచ్చిరి.

ఆర్యులకును ద్రావిడులకు ననేక శతాబ్దములవరకు యుద్ధములు జరుగుచుండెను. తుదకు నార్యులే యీ దేశమును సంపూర్ణముగ జయించిరి. అయినను దక్కనుదేశములో నెక్కువ భాగము ద్రావిడులే యున్నందున విజయులగు నార్యులు వీరిని తమ మతములోనికిని సంఘములోనికిని చేర్చుకొనుట యుక్తమని తలంచిరి. నేటిసరికి నిరువదికోట్లకు మించిన ద్రావిడులు తమ పురాతనమతమునే యవలంబించియున్నారు. ఆర్యులకును ద్రావిడులకును వేలకొలది సంవత్సరములు పోరాటములు జరిగినపిమ్మట నేడే రెండుజాతులవారి మతములును కలిసి యొక సంకరమతము వేరుపారియున్నది. పరమతత్వ సిద్ధాంతపండితులగు బ్రాహ్మణులుకూడ తమ ప్రాచీన యార్యదేవతలనేకాక అసహ్యకరములగు ద్రావిడ పిశాచదేవతలనుకూడ పూజించుటకు వెనుకదీయుటలేదు. ఇట్లొకప్రక్క జరుగుచుండగా, మరియొకప్రక్క ద్రావిడుల సంతతివారగు ప్రస్తుతకాలపు హీనకులస్థులుకూడ తమ పూర్వదేవతలను, ఆచారములను, పిచ్చినమ్మకములను విడిచిపెట్టకయే ఆర్యుల మతాచారములను, మతభావములను విశేషముగ స్వీకరించుచున్నారు.

1. The Wild Dravidian Tribes. అనాగరిక ద్రావిడశాఖలు.—ఆర్యులతో నెట్టి సంబంధమునులేక పర్వతములయందును, అడవులయందును వాసముచేయుచుండు ద్రావిడశాఖలు గలవు. వారు తమ వంశపారంపర్య ధర్మములను, సాంఘీక నియమములను కాపాడుకొనియున్నారు. వారు తమ రాతి దేవతలకును, పిశాచ

దేవతలకును, జంతువులనుమాత్రమేగాక, సర్కారువారు కనిపెట్టకుండినయెడల మనుష్యులనుకూడ బలియిచ్చుటకు సిద్ధపడుదురు. సూర్యుని, పితృదేవతలను, దున్నపోతులను బూజించెదరు. వారు తమ దేవతలను కొలుచునప్పుడు తప్ప త్రాగి చెప్పరాని చెడుకార్యములు చేయుచుందురు. సంతాలులును, అంగులును, పశ్చిమ బంగాళములోని కోలులును, కొలేరియను తెగయొక్క ముఖ్యశాఖలు. పశ్చిమ బంగాళములోని ఆరావ్రానులును, ఒరిస్సాలోని ఖాండులును, మధ్యహిందూస్థాన మందలి కోదులును, నీలగిరి కొండలమీది తోడాలును ద్రావిడతెగలోని ముఖ్యశాఖలు. కాని వీరు చాలామట్టుకు హిందూమతాచారముల నవలంబించినందున వీరి మతమునుగూర్చి యీ యధ్యాయములో వివరించిన యంశములకంటె నెక్కువగా తెలిసికొన నక్కరలేదు.

2. The Hinduized Dravidian Tribes. హిందూమతము నవలంబించిన ద్రావిడులు.—హిందూసాంఘిక మతభావములను స్వీకరించిన ద్రావిడ తెగలను గూర్చియే మనమిప్పుడు యోచింతము. దక్షిణమున అరవ, తెలుగు, కన్నడ, మళయాళరాష్ట్రములలో నున్నవారు ప్రాముఖ్య ద్రావిడశాఖలు. ఈ తెగలన్నిటి యందును కులభేదములున్నవి. వారిలో పైకులమువారు బ్రాహ్మణ దేవాలయములకు పోవచ్చును. అట్టివారు తమ ద్రావిడదేవతలతోకూడ నార్యుల దేవతలను పూజించెదరు. ఈ ద్రావిడులలో వేలకొలది నీచకులస్థులు. వీరు మురికివారని యెంచి బ్రాహ్మణులు వీరిని తమ దేవాలయములలోనికి రానియ్యరు. అగ్రవర్ణమువారు వీరిని హిందువులనుటకు నొప్పుకొనరు. అయినను వీరి సంఘనిర్మాణమునుబట్టియు, వీరు స్వీకరించిన హిందూమతాచారములనుబట్టియు, వీరి దేవతలకును, హిందువుల దేవతలకునుగల సంబంధమునుబట్టియు చూడగా వీరుకూడ హిందువులేయనుట కెట్టి సందేహమునులేదు.

II. Characteristics of Dravidian Worship. ద్రావిడదేవతా పూజకుగల ప్రధాన లక్షణములు.—దక్షిణదేశీయులలో నూటికి నెనుబదిమంది గ్రామదేవతలనే కొలుచుచున్నారు. ఇట్టి పూజయొక్క ముఖ్యలక్షణములు ఈ క్రింద వివరించుచున్నాము.

1. ఈ గ్రామదేవతాపూజ యేకాలమున నారంభమయ్యెనో యెవరికిని తెలియదు. ఈ దేవతలలో కొందరిని అనేక శతాబ్దములుగ పూజించుచున్నారు. కాని మహామారి యను దేవతలవంటివారు ఇటీవలనే యీ దేవతాగణములో జేరియున్నారు. మారమ్మను 1906-వ సం॥నుండి పూజించుచున్నారు.

2. గ్రామదేవతల గుళ్లకు మాన్యములులేవు. వీటిని బ్రాహ్మణ దేవాలయముల వలె నంత సొగసుగ కట్టియుండలేదు. ఈ గుళ్లు మిక్కిలి చిన్నవి. అందము చందములేక యున్నవి. బ్రాహ్మణు లారాధించు దేవతలు చక్కగా చెక్కిన స్థిర విగ్రహములు. కాని ద్రావిడదేవతలలో కొన్ని రూపములేక యున్నవి. మరి యొకప్పుడు కరకురాళ్లకు కుంకుమ రాసి నెయ్యిపోసి పూజింతురు. కొందరు దేవ

లము మొరటుగానుండు మొద్దులను అప్పటిమట్టుకు నిలిపి, పూజించినపిమ్మట విడిచి పెట్టెదరు.

3. బ్రాహ్మణు లారాధించెడి ప్రతి దేవతకును దివ్యజననమును, చరిత్రయును కలవు. వారిలో కొందరు ప్రకృతి శక్తులయొక్క స్వరూపములు. కాని ద్రావిడ దేవతలు చనిపోయినవారి దయ్యములు. కావున వీటిలో నొక్కొక్కటి యేదో యొక గ్రామమునకు సంబంధించియుండును.

4. గ్రామదేవతల పూజారులు బ్రాహ్మణులుకారు. కాని శూద్రులో, పంచములో ఈ దేవతలకు పూజచేయుదురు. పంచమ పూజారులలో కొందరికి ఆసాదులని పేరు. వీరు తమ బాలికలను పెండ్లిచేయక వారిని దేవతలకు సేవచేయుటకు నర్పించెదరు. ఇట్టి బాలికలు వేశ్యావృత్తి నవలంబింతురు. వీరిని బసలీలందురు.

5. ద్రావిడదేవతలు తరుచుగా స్త్రీలు. వీరిని అమ్మవార్లని పిలుచుచు, పూజింతురు. కాని ద్రావిడదేవతలలో తెలుగుదేశమున పోతురాజును, అరవదేశమున అయనారును పురుషదేవతలు. వీరుగాక యింకను పురుషదేవతలున్నారు. స్త్రీదేవతలకు అయనారుతప్ప తదితర పురుషదేవతులందరును లోబడియుందురు. దీనినిబట్టి యొక స్త్రీ యనేక పురుషులను పెండ్లాడు నాచారము పూర్వకాలమున ద్రావిడ సంఘములో సర్వసామాన్యమై యుండెననియు, అందుచేత స్త్రీదేవతారాధనయే వారికి ప్రధానమాయెననియు మనమూహింపవచ్చును. కాని బ్రాహ్మణదేవతలైతే చాలామట్టుకు పురుషులు.

6. జనులీ గ్రామదేవతలను నిజముగా భక్తిపూర్వకముగ పూజించుటలేదు గాని ఆ దేవతల యాగ్రహమును శాంతింపజేయుటకే బలులిచ్చెదరు. మనుష్యులకును పశువులకును వచ్చెడి రోగములును, కరువులును, భూకంపములును, ఈ దేవతల వలననే కలుగుచున్నవని యెంచి, వీరికి దున్నపోతులను, గొర్రెలను, మేకలను, పందులను, కోళ్లను, వేలకొలదిగ నర్పించి, తమ యుపద్రవములను బాపుడని వీరిని ప్రార్థించెదరు. బ్రాహ్మణులు తమ దేవతలకు జంతువుల నెన్నడును బలియివ్వరు.

## III. Dravidian Deities. ద్రావిడ దేవతలు.

**1. Their Names.** వారి నామములు.—గ్రామదేవతలకును, వారి పేర్లకును లెక్కలేదు. ఈ దేవతలకు వేరువేరు జిల్లాలలో వేరువేరు నామములు గలవు. అక్కడక్కడ నొకే దేవతకు ఆమడదూరముననున్న గ్రామములలో వేరు నామములుండును. ఈ దేవతలనుగూర్చిన గాథలుకూడ వారి సంఖ్యవలెనే లెక్కకు మించి యున్నవి. గ్రంథవిస్తర భీతిచే ఈ దేవతలలో ముఖ్యులైన కొందరినిగూర్చి మాత్రము క్లుప్తముగ విచారింతము.

**2. The Seven Sisters.** ఏడుగు రక్కచెల్లెండ్రు.—నెల్లూరుజిల్లాలో నేడుగురు స్త్రీదేవతలు గలరు. వీరక్కచెల్లెండ్రు. వీరు పోలేరమ్మ, అంకమ్మ, మాతమ్మ, ముత్యాలమ్మ, డిల్లీపోలాసి, బంగారమ్మ, రేణుక యనువారు. వీరు తెలుగు

దేశమంతటను ప్రసిద్ధులు. అరవదేశములో మారియమ్మవలె తెలుగు దేశములోని పోలేరమ్మ మశూచికము కలిగించెడు దేవత. అంకమ్మ యను గృహ దేవత పూజ బహు క్రూర జీవహింసతో కూడినదై యుండును. ఒక మేకను, గొర్రెపిల్లను, పందిని, కోడిపిల్లను, మరికొన్ని చిన్న జంతువులను నొక బండికి బిగగొట్టియున్న తొమ్మిది వాడిగసికలకు గ్రుచ్చి, వాటినడుమ నొకడు కూర్చుండి, గొర్రెపిల్ల రక్త నాళమును తెగగొరికి, దాని రక్తము త్రాగుచు, నీ అంకమ్మ ప్రభావములను రాగాలు తీయుచు చెప్పుచుండును. మాతమ్మ మాదిగల దేవత. ఈమె మాతంగి యను స్త్రీ రూపమున కానవచ్చును. మాదిగలలోని మాతంగస్త్రీకి మాతమ్మ పూనునని చెప్పుదురు. ఈ మాతంగ స్త్రీ దుష్టప్రవర్తనగలది. జాతరులలో కొన్ని సమయములందు మాతంగి స్త్రీకి మాతమ్మ ఆవేశమైనప్పుడు గుంపులో పడి పరుగెత్తుచు, వెనుకకు వెనుకకు వచ్చి జనులమీద పడుచు, తన నోటనున్న నీరుగాని కల్లుగాని తన యెదుటనున్న బ్రాహ్మ ణాది గొప్ప కులమువారిమీద సహితము ఉమ్మివేయును. అప్పుడు బ్రాహ్మణులు గొప్ప మహత్తుగల మాతంగమ్మ కటాక్షముంటే చాలునని కోపపడక యూరకుందురు.

3. Perantalu. పేరంటాళ్లు.—ద్రావిడులు పేరంటాళ్లనుకూడ గొలిచెదరు. వీరు పతివ్రతలు. సంతానవతులైయుండి ముత్తయిదువలుగనే చనిపోయినవారు. వీరిలో ప్రసిద్ధమైనది ఊసురమ్మ. ఈ యమ్మవారికి ప్రీతిగా ఇనుపకొక్కెములకు జంతు వులను తగిలించి వ్రేలాడగట్టుదురు. ప్రస్తుతకాలమున బ్రిటీషు పరిపాలకుల యాటం కముచే కొక్కెములకు జంతువులను గ్రుచ్చుట మానివేసి, యొక మేకను మనుష్యుని కలిపి యొక పొడుగాటి గడకు వ్రేలాడగట్టి, జాతరకు వచ్చియున్న జనులకు పైగా గిరగిర త్రిప్పెదరు. దీనిని సిడులాట యనుచున్నారు. కాని పూర్వకాలమున మేకను, మనుష్యునికూడ కొక్కెములకు గ్రుచ్చి యాడించెడివారు.

4. The Saktis. శక్తులు. — ద్రావిడుల శక్తిదేవతలు తంత్రశాస్త్రములలో వర్ణించినట్టి యసహ్యాకరములును, అపవిత్రములునగు శక్తులవంటివారుకారు. తంత్ర ములలోని శక్తులను శాక్తేయులు పూజింతురు. వీరిలో చాలమంది నీతిమాలినవారు. కాని ద్రావిడుల శక్తి దేవతలు భయంకర భూతములు. ఇవి శివుని భార్యయగు పార్వతియొక్క యవతారములందురు. వీరు సర్వత్ర సకలకాలములందు జనులను బాధించెదరు.

వీరికి చేయు పూజ బహు ఘోరమైనది. పంచముడొకడు దున్నపోతు నొకదానిని జంపి, దాని శిరస్సు ఛేదించి, దాని ప్రేగులను మెడకు చుట్టుకొని దాని కారిజమును నోట గరచుకొని, యూరివీధుల వెంబడి జనసమూహముతో నూరేగును. చంపిన దున్నపోతు కాళ్లలో నొకటి దాని నోటనుంచి, దాని ప్రేగులందున్న క్రొవ్వును దాని కన్నులమీద రాయుదురు. శక్తిదేవతలందరిలో కాటి అంకమ్మకు మిగుల భయపడుదురు. ఈ దేవత శవములను తినుచు, స్మశానములందు నివసించును. దొంగశక్తి యను మరియొక దేవత యతిభయంకరమైనందున దాని పూజించునప్పుడు మహా ధైర్యవంతులగు పురుషులుతప్ప మరెవరునుండరు. నరబలులను గోరునట్టి

మరియొక శక్తి గలదు. ఈ దేవతకు ప్రీతిగా నొక మనుష్యుని మెడవరకు భూమిలో పాతిపెట్టి యతనిని పశువులచేత త్రొక్కించి చంపెదరు.

5. **Demon Possession.** దయ్యము పట్టుట.—ఈ ద్రావిడదేవతలందరును పిశాచములే గనుక అతితరుచుగా మనుష్యులనుపట్టి పీడింతురు. ఆర్యమతములో కూడ దయ్యములున్నవి. కాని వాటియుత్పత్తి దైవసంబంధమైనది. ద్రావిడ దేవతలయుత్పత్తి మనుష్యసంబంధమైనది. వారు చనిపోయినవారి జీవాత్మలు. రోగములును, ఇతర బాధలును, దయ్యము పట్టుటవలన వచ్చునను నమ్మకము జనులకుండుటచే వీటిని వెళ్లగొట్టగల భూతవైద్యులు కొందరు కలరు.

**IV. Relation between the Dravidian and the Hindu Gods.** ద్రావిడదేవతలకును, హిందూదేవతలకునుగల సంబంధము.—ద్రావిడదేవతలు స్థలదేవతలేయైనను, బ్రాహ్మణదేవతలనుగూర్చిన యనేక గాథలనుబట్టి వీరికిని, బ్రాహ్మణదేవతలకును సంబంధమున్నట్లు కాన్పించును. ఇందువలన ద్రావిడులను, వారి మతమును, హిందూమతములో గలుపుకొనుటకై బ్రాహ్మణులనేక యత్నములు చేసియుండిరని మనము తెలిసికొనవచ్చును. బ్రాహ్మణుల ప్రయత్నము లట్లుండగా ద్రావిడులుకూడ తాము హిందూమతములో చేరి, యున్నతపదవి నొందవలెనని కోరుచు, తమ గాథలకు నింకను కొన్ని క్రొత్తయంశములనుజేర్చి శృంగారించిరి.

ద్రావిడదేవతలలో ననేకులు శివసంబంధులు. పురాణ కథలలో కొన్ని యీ శక్తిదేవతలు శివుని కుమార్తెలనియు మరికొన్ని పార్వతియొక్క యవతారములగుటచే నతని భార్యలనియు చెప్పుచున్నవి. శివునిగూర్చియు నతని యారాధనను గూర్చియు పురాణములుచెప్పు విషయము లనేకవిధముల బ్రాహ్మణమతమునకు విరుద్ధములైయున్నవి. కావున శివుడు మొట్టమొదట అనార్య సంఘునాయకుడైయుండి, దేవతాపదవి నొందినవాడని నిస్సందేహముగ చెప్పవచ్చును. పార్వతి యనగా పర్వతదేవత, కాళి, దుర్గ యను నామములుగల ఇతని భార్య జంతుబలులను కోరును. కనుక ఈమెకూడ మొదట నొక ద్రావిడదేవతగ నుండియుండవచ్చును. గణేశుని శివుని కుమారుడందురు. ఇతడును హనుమంతుడును బహుశా ప్రథమమున నడవి జాతులకు దేవతలై యుండిరి. అటుపిమ్మట కొంతకాలమునకు హిందువులు వీరిని తమ దేవతావర్గములోనికి జేర్చుకొనియుందురు.

మరికొన్ని కథలవలన ద్రావిడదేవతలకును, విష్ణువునకును సంబంధమున్నట్లు కానవచ్చును. విష్ణువుయొక్క యవతారపురుషులలో నొకడగు పరుశురాముడు జమదగ్ని యను ఋషికి శక్తిదేవతయగు రేణుకవలన బుట్టెనని హిందువులు చెప్పుదురు. మరియు రేణుక సకల శక్తిదేవతలకును మూలమగు ఆదిశక్తియని కొందరనుచున్నారు. బ్రాహ్మణులలో గొందరు మాతంగియెడల నభిమానము కలిగియున్నారు. కనుకనే మాతంగియొక్క దేహము తమ యార్యదేవతయగు రేణుకదనియు, నామె శిరస్సుమాత్రమొక మాదిగస్త్రీదనియు జెప్పెదరు.

ప్రస్తుత హిందూమతములోజేరిన యీ ద్రావిడమత విషయములనుగూర్చిన ఈ క్లుప్తవివరణవలన ఆర్యులు మొదట ద్రావిడదేవతలయెడల గలిగియుండిన తృణీ

కారభావము కాలక్రమమున విడిచివేసిరని మనము గ్రహింపవచ్చును. అట్లుకాక పోతే యిప్పటి బ్రాహ్మణులు వీరి దేవతలకు భయపడుచు వారిని శాంతిపరచుటకై హీనజాతులవారు చేయునట్టి జాతరలలో పాల్గొనుచుండుటకు గారణమేమైయుం డును? ద్రావిడసంబంధమువలన బ్రాహ్మణుల కర్మకాండలోను, ఆర్యుల సంబంధము వలన ద్రావిడబలులలోను విశేషముగ మార్పు కలుగనేలేదు.

V. Dravidian Religious Ideas. ద్రావిడ మతభావములు.—తల నరికిన యెనుబోతునోట దాని కాలుపెట్టి దాని కన్నులమీద క్రొవ్వురాయుట, దేవత తన శత్రువులను జయించెననుటకు సూచనగనున్నది. ఏలననగా రేణుక యను దేవత కూడ తాను జయించిన శత్రువునకట్లే చేసెను. బలులిచ్చినపిమ్మట నా మాంసము వండి తిందురు. అమ్మవారికి నర్పించినది యారగించుటలో రెండు ముఖ్యోద్దేశము లేవనగా:—దేవతను శాంతిపరుచుట, యామె యనుగ్రహము సంపాదించుట. ఆహార ములోని సారము దేవత యారగించి తక్కిన పిప్పిని తమకు విడలివేయునని యీ దేవ తారాధకులు తలంచెదరు. జంతురక్తముతో కలిపిన యన్నము నిండ్లమీదను, గ్రామ పొలిమేరలయందును జల్లుదురు. ఇదియే రక్తప్రియులగు దేవతలకు నైవేద్యము. ఇట్టి నైవేద్యములచే వారు తమ దేవతల ఆగ్రహమును శాంతిపరుపజూతురు. ఈ శక్తి దేవతలకు జేయు పూజలలో స్తోత్రములుగాని కృతజ్ఞతాపూర్వక వందనములుగాని యుండవు. కాలము నిండకుండ బలవంతముగ చనిపోయినవారిట్టి దయ్యములయ్యె దరట! వీరిలో చేరినవారెవరనగా:—ఇతరులవలన బాధలనొంది బలవంతముగ చని పోయినవారును బాలింతలుగ చనిపోయిన స్త్రీలును తమ దుర్మార్గప్రవర్తనవలన ఘోర మరణమునొందినవారును. ఈ ద్రావిడ దేవతారాధన మిగుల క్రూరముగను ఘోరముగ నున్నను బ్రాహ్మణదేవతలకు జేయు యుత్సవములు, యాత్రలు, వేశ్యలు, లింగమును పూజించుట మొదలగువాటివలె నంత హేయకార్యముకాదని చెప్పగలము.

## B. IDOL WORSHIP. హిందువుల విగ్రహారాధనము.

I. History of Hindu Polytheism. బహు దేవతారాధనయొక్క చరిత్ర.—ఋగ్వేదదేవతలు ప్రకృతిశక్తులు. వీటికి మానవగుణము లారోపించి యివి దేవతలని యార్యులారాధించుచుండిరి. ఈ దేవతలు ముప్పదిముగ్గురు. ఋగ్వేద మందలి విగ్రహములను గూర్చిన ప్రస్తాపన బహు తక్కువగానున్నందున, ఆ కాల మున విగ్రహములను బూజించుట విస్తారముగ వ్యాపించియుండనట్లు కనబడుచు న్నది. బ్రాహ్మణములందు పెక్కు దేవతలు కలరు. కాని వారి ప్రవర్తన నీతివిరుద్ధ మైయున్నది. వారు బ్రాహ్మణులిచ్చెడు అర్పణలపై నాధారపడియుండుటయేగాక బ్రాహ్మణులకంటెను తక్కువ ప్రభావముగలవారై యున్నారు. ఉపనిషత్తులలో నిర్గుణబ్రహ్మసిద్ధాంతమే ప్రాముఖ్యమగుటచేత, దేవతలనుగూర్చిన ప్రశంస విశేష ముగ కానరాదు. క్రీ. పూ. 500 సంǁల నాటికి విగ్రహారాధన సర్వసాధారణమై యప్పటినుండి యింకను నెక్కువగా వ్యాపించుచువచ్చెను. మహాభారతములోని దేవతలు లెక్కకు మించియున్నారు. కాని బలపరాక్రమములు గల యుద్ధశూరుడు

వీరికిమించిన ప్రభావశాలియైయున్నాడు. ఈ పురాణములయందలి దేవతలను సర్వ జనులు మిగుల గౌరవించుచున్నారు. ఏక దేవతారాధనము పామరజనులకు లభించుటలేదు. ప్రస్తుతము హిందూదేవతాగణములో ముప్పదిమూడుకోట్ల దేవతలు గలరు.

II. Varieties of Deities and Images. వేరువేరు దేవతలును, వారి విగ్రహములును.

1. ఇదివరకు "త్రిమూర్తులు" అను విషయమును విమర్శించినప్పుడు బ్రహ్మ విష్ణు మహేశ్వరులును, రామకృష్ణుల యవతారములును హైందవ దేవతలలో ప్రధానులని చూపించియుంటిమి. వీరికందరికిని ప్రత్యేకముగ విగ్రహములు గలవు. అక్కడక్కడ త్రిమూర్తులరూపములు ఒకేవిగ్రహమున నుండును. శివునియొక్క సాధారణచిహ్నము లింగము.

2. "శాక్తేయమతము" "హిందూమతాంతర్భాగమగు ద్రావిడమతము" లనుగూర్చిన వివరణలందు కామరూపులును, క్రూరులును నగు స్త్రీదేవతలను వారిని యారాధించెడి విధానములును వర్ణించితిమి. ఈ దేవతలలో గొందరి విగ్రహములు మిగుల భయంకరములైనవి. మరికొందరివి యందములేని రాతిబొమ్మలు.

3. మానవాకారములతో విగ్రహములను చెక్కించి వాటిద్వార శూరులను, దైవభక్తులను నారాధించుట సర్వసాధారణమైయున్నది. ఇట్టివారు అమానుష గుణములో లేక ప్రభావమో గలవారని యెంచి, వీరికి దేవతాపదవి నిచ్చుచున్నారు. ఇట్టి దేవతలసంఖ్యకు లెక్కలేదు. మనువు తన ధర్మశాస్త్రమందు 7: 8 లో రాజులు దైవస్వరూపులే యని చెప్పియున్నాడు. సైన్యాధిపతులును, రామకృష్ణులవంటి విజయులును బ్రతికియుండగానే దేవతాపదవినొందినవారై చనిపోయినతరువాత పరమాత్మునితో సమానులైరి. వీడుమాత్రమేగాక పురోహితులను, గురువులనుకూడ నారాధించెదరు.

4. పితృదేవతారాధనము హిందువులలో బురాతనకాలమునుండియు పారంపర్యముగ వచ్చుచునేయున్నది. దీనినిగురించి ఋగ్వేదము చెప్పుచున్నది. ఆ కాలమున చనిపోయినవారికొరకు చేయుచుండిన ఉత్తరక్రియలు అనగా దహనాదికర్మలు ఇప్పటి శ్రాద్ధములరూపమును దాల్చినవి. మృతులైనవారి జీవాత్మలు పై లోకములకు బోవుటకు సహాయసాధనములని యెంచి శ్రాద్ధకర్మలు చేయుదురు. మొట్టమొదట మరణమొందిన యముడు ఇప్పుడు నరకలోకమునకు రాజైయున్నాడు.

5. జంతుపూజ దేశమంతయు వ్యాపించియున్నది. ఆవును, ఎద్దును, వాటి యుపయోగములనుబట్టియు, పామును దానివలన గలుగు ప్రాణహానినిబట్టియు, యద్భుతమగు సహజజ్ఞానముగలిగియుండుటచే కోతిని, హిందువులు పూజించెదరు. మరియు దేవతలకును, మానవులకును, పశుపక్ష్యాదులకును పరస్పరసంబంధముగలదనియు, మనుష్యుడు తన జన్మాంతరములయందు నొక దేహమునుండి మరియొక దేహములోనికి బహు సులభముగా బ్రవేశింపగలడనియు హిందువులు నమ్ముచుండు

టచే వారు బుద్ధిపూర్వకముగ జంతువులనుగాని పక్షులనుగాని చంపరు. జంతువు లలో హనుమంతుడను పేరుగల కోతిని, నాగుడను పేరుగల త్రాచుపామును, ఆవులను ముఖ్యముగ నారాధించెదరు. ఇవిగాక వీరు పూజించెడు మరికొన్ని దైవములు సగము మనుష్యాకారమును సగము మృగాకారమును కలిగియుండురు. సగము నర రూపమును, సగము సింహరూపమును గల నరసింహమూర్తియు, యేనుగతల గల గణేశుడును, మేకశిరస్సుగల దక్షుడును ఇటువంటివారే. మరికొన్ని జంతువులను దేవతలకు వాహనములగుటవలన ఆరాధించెదరు. ఇట్టి జంతువులేవనగా: విష్ణు వాహనమైన గరుడపక్షి, బ్రహ్మవాహనమగు హంస, ఇంద్రునియొక్క యేనుగ, దుర్గాదేవియొక్క పెద్దపులి, స్కందుని నెమలి, కామదేవుని చిలుక, విష్ణువుయొక్క యవతారములగు చేప, తాబేలు, పంది, యముని దున్నపోతు, గణేశుని యెలుక, అగ్నిదేవునియొక్క పొట్టేలు మొదలైనవి.

6. వృక్షాది నిర్జీవపదార్థముల నారాధించుట.—చెట్లు దేవతలకు నివాసములని నమ్మి, హిందువులు వాటిని పూజించెదరు. తులసిమొక్క విష్ణువునకు ప్రీతికరమైనదగుటచే దానిని కొలిచెదరు. ఏటేట ఈ మొక్కకును, బాలకృష్ణ విగ్రహమునకును వివాహముచేయుదురు. కొన్ని ప్రదేశములలో తులసిమొక్కకును, సాలగ్రామమను నొక నల్లని రాతికిని పెండ్లిచేయుదురు. రావి, మారేడుచెట్లను గొందరారాధించెదరు. జడపదార్థములకు ప్రాణప్రతిష్ఠచేసి వాటిని కొలుచుచున్నారు. కొన్ని పండుగదినములలో గొందరు తమ పనిముట్లకు బూజచేయుదురు. పుణ్యనదులన్నిటిని విశేషముగ గంగానదిని నారాధింతురు.

## C. HINDU FASTS AND FESTIVALS. హిందువుల ఉపవాస వ్రతములును, పండుగలును.

I. Fasts. ఉపవాసము.—వైష్ణవులు ప్రతి యేకాదశిదినమున నుపవాసముందురు. శైవులు ప్రతినెల కృష్ణపక్షములో బదమూడవ లేక పదునాలుగవ దినమునను, శివరాత్రినాడు రాత్రింబగళ్లును ఉపవాసముందురు. యోగసిద్ధులు లభించుటకు, యోగు లాహారము తగ్గించుచు క్రమముగా తమ శరీరమును కృశింపజేయుదురు.

II. Festivals. పండుగలు.—హిందువుల పండుగలలో ముఖ్యములైనవేవనగా.—

1. మకరసంక్రాంతి, లేక సంక్రమణము.—ఇది యుత్తరాయణమునకు నారంభదినము. ఈ పండుగ మూడు రోజులు హిందువులందరికిని మిగుల సంతోషదినములు. ఈ పండుగ జనవరినెల 12-వ తేదికి సమీపమున వెనుకగాని ముందుగాని వచ్చును.

2. వసంతపంచమి.—ఇది వసంత ఋతువున వచ్చును. ఈ దినమున సరస్వతికిని, సిరాబుడ్లకును, కలములకును, కాగితములకును బూజచేయుదురు. ఇది జనవరి, ఫిబ్రవరినెలలమధ్య వచ్చు మాఘమాస శుక్లపక్షములో నయిదవ దినమునగా శుద్ధపంచమి యగును.

3. మహాశివరాత్రి.—ఇది మాఘమాసమందు కృష్ణపక్షములో పదునాల్గవ దినమున అనగా ఫిబ్రవరినెల కడపటి రెండు వారములలో వచ్చును. ఆ నాడు శివలింగము నారాధింతురు.

4. హోళిపండుగ.—దీనికి హుతాశని యనియు, కాముని పండుగయనియు నామములు గలవు. ఇది కామదేవునియొక్కయు, హోళిక యను రాక్షసి యొక్కయు మరణములకు జ్ఞాపకార్థముగ జనసామాన్యులుచేయు సంబరము. ఈ యుత్సవదినములలో బాలురు వీధులలో నాడుచు పాడుచు నుందురు. పెద్దవారొండొరులపై మెత్తని రంగుపొడియు వసంతమును బోసుకొందురు. రాత్రిపూట తప్పత్రాగి యనేక దుష్కార్యములు చేయుదురు. ఈ పండుగ మార్చినెలారంభమునుండి కొన్ని దినములు జరుగును.

5. శ్రీరామనవమి.—ఇది రాముడు జన్మించిన దినమునచేయు పండుగ. విష్ణుభక్తులు రామాలయములన్నిటను దీపములుపెట్టి రామవిగ్రహమును జక్కగ నలంకరించుదురు. ఈ పండుగ మార్చినెలలోగాని ఏప్రెల్ నెలలోగాని వచ్చును.

6. కృష్ణాష్టమి.—ఇది కృష్ణుని జన్మదినమునజేసెడు పండుగ. ఇది జూలై నెలలోగాని యాగస్టునెలలోగాని వచ్చును. ఇది వైష్ణవుల ముఖ్యపండుగలలో నొకటి.

7. వినాయక చతుర్థి.—భాద్రపదమాసము అనగా సెప్టెంబరు, అక్టోబరు నెలలలో శుక్లపక్షమందు నాలుగవ దినమున నీ పండుగ చేయుదురు. తమ కార్యములకు విఘ్నములు కలుగకుండుటకై హిందువు లీదినమున విఘ్నేశ్వరుని లేక గణపతిని పూజింతురు. కొన్నిప్రాంతములయందు ఈ పండుగ బహు శ్రద్ధతో చేయుదురు.

8. దసరా.—ఈ పండుగ సెప్టెంబరునెలలోగాని, యక్టోబరునెలలోగాని వచ్చును. సగరచక్రవర్తియొక్క చనిపోయిన అరువైవేల కుమారులను మరల బ్రతికించుటకై గంగ యాకాశమునుండి దిగివచ్చిన దినమును జ్ఞాపకముచేసికొనుటకు నీ పండుగ నాచరింతురు. ఈ పది దినములలో తొమ్మిది దినములవరకు మహిషాసురుని అనగా దున్నపోతు తల గల రాక్షసుని సంహరించిన దుర్గాదేవిని బూజింతురు. కావున ఈ పండుగ మొదటి తొమ్మిది దినములను దుర్గపూజ లేక నవరాత్రులందురు.

9. దీపావళి.—దీపావళి యనగా దీపముల పండుగ. నవంబరునెలారంభమున వచ్చును. విష్ణు భార్యయగు లక్ష్మికిని శివుని భార్యయగు పార్వతికిని గౌరవార్థముగ నీ పండుగ జేయుదురు.

10. నాగుల చవితి లేక నాగపంచమి.—ఈ పండుగ అక్టోబరునెలలోగాని నవంబరునెలలోగాని వచ్చును. దుష్టదేవతలగు నాగులను దృప్తిపరచుటకు దీనిని ఆచరింతురు. ఈ దినమున మట్టితో పామునుజేసిగాని పుట్టయొద్దకు వెళ్లిగాని పాలు మొదలగునవి నాగుపాములకు నర్పించి పూజింతురు.

# పదియవ యధ్యాయము

# CHAPTER X

## హిందూమతశాఖలు

## The Sects of Hinduism

క్రీ. వె. తొమ్మిదవ శతాబ్దమునసుండిన ఆనందగిరి యను శంకరాచార్య శిష్యుడును, క్రీ. వె. పదునాలుగవ శతాబ్దమున జీవించియుండిన మధ్వాచార్యులును వ్రాసిన గ్రంథములనుబట్టి చూడగా, బూర్వకాలమునం దీదేశమున హైందవమత విరుద్ధములగు ననేక మతశాఖ లుండెనని తెలియుచున్నది. వాటిలో చాలామట్టుకు నిదివరకే యంతరించిపోయెను. ప్రస్తుతకాలమునసున్న శాఖా లాకాలమున లేనేలేవు. ఈ యధ్యాయములో మనము ముఖ్య శాఖలవారినిగూర్చి విచారింతము.

A. THE SMARTAS AND SANKARĀCHĀRYA. శంకరాచార్యులును, స్మార్తులును. — శంకరుడు క్రీ. వె. 788-వ సం॥న మలబారుజిల్లాలో జన్మించెను. ఇతడొక స్మార్తబ్రాహ్మణుడు. ఇతడు బ్రహ్మచారి. ఇతనికి పరమహంస పరివ్రాజకాచార్య యను బిరుదుగలదు, గాని యితని సామాన్య నామము శ్రీ శంకరాచార్య. ఇతడు బ్రాహ్మణ మతాభిమానులలో నగ్రగణ్యుడు. బ్రాహ్మణమతమునకు పునర్జీవము గలిగించినవారిలోగాని వేదాంత వ్యాఖ్యానకర్తలలో గాని ఇతనిని మించినవారు లేనేలేరు. ఇతడు హైందవ మతాచార్యులలో మిగుల ప్రఖ్యాతిగాంచెను. ఇతడు విశేష బుద్ధికుశలతగలవాడగుటచే, తన కెనిమిదియేండ్లు నిండునప్పటికే రామాయణము, మహాభారతాది యనేక పురాణములను జదివి తన పదునారవయేట విద్య ముగించెను. అంతట నతడు సన్యాసియై తన అద్వైత సిద్ధాంతమును బోధించుచు దేశమంతటను సంచారముచేసెను. ఇతడు సాయుజ్యసిద్ధాంతమును అనగా జీవాత్మ కట్టకడపట పరమాత్మలో లీనమైపోవుటను బోధించెను. ఈ దేశమున బౌద్ధమతము రూపుమాయుటకు నితడే ముఖ్యకారకుడు. మైసూరులో శృంగేరియందును, కత్తియవారులో ద్వారకయందును, ఒరిస్సాలో జగన్నాథమందును, హిమాలయములో బదరికాశ్రమమందును, తన మఠములను స్థాపించి, వాటికి తన ముఖ్య శిష్యులను నాచార్యులుగ నియమించెను. ఇతని మతము నవలంబించినవారిని స్మార్తులు అందురు. ఇతడు ఉపనిషత్తులకును, భగవద్గీతకును, వేదాంత సూత్రములకును వ్యాఖ్యానములు వ్రాసి ప్రఖ్యాతినొందెను. ఇతడు తన ముప్పదిరెండవయేట హిమాలయమందు శివుని స్థానమగు కేదర్ నాథ్ అను పర్వతముపై జనిపోయె నందురు.

B. THE VAISHNAVAS. వైష్ణవులు. — వైష్ణవులలో నేడు సుమారు ఇరువది శాఖలున్నను, అందు ముఖ్యమైనవాటినిగూర్చియే యీ ప్రకరణమున వివరింతము.

I. **Rāmanujāchārya.** రామానుజాచార్యులు.—శంకరాచార్యునికి పిమ్మట దాదాపు మూడు శతాబ్దములకు దక్షిణహిందూదేశమందలి వైష్ణవ సంఘమంతటికిని రామానుజాచార్యులే ప్రధానగురువైయుండెను. ఇతడు క్రీ. వె. 1137-వ సం॥మున చనిపోయెను. శంకరుని యద్వైతమునకు నాధారమగు వేదాంతసూత్రములనుండియే ఇతడు వేరొక తత్వ సిద్ధాంతమును గ్రహించి, దానిని శ్రీరంగమందు బోధించెను. ఇతడు అద్వైత సిద్ధాంతములను సవరించి, తన నూతన మతమునకు విశిష్టాద్వైతమను పేరిడెను. ఇదియే నిజమైన యద్వైతమని రామానుజాచార్యుల యభిప్రాయము. పరబ్రహ్మసగుణుడనియు, ప్రకృతి, జీవులకంటెను భిన్నమైనవాడనియు, ప్రకృతియు జీవాత్మయు సత్యములనియు బోధించెను. వేదాంతుల సర్వం బ్రహ్మమయము అను సిద్ధాంతమును పూర్తిగా ఖండించి, పరబ్రహ్మ మాయతో గలిసి సృష్టిని జేసెననుట కేవలము శాస్త్రవిరుద్ధమని వాదించెను. ఇతని మతము ప్రకారము విష్ణువే సగుణమూర్తియగు పరబ్రహ్మ. జీవాత్మ, పరమాత్మయొక్క యంశము. జీవాత్మ కట్టకడపట పరమాత్మయొద్ద చేరిన పిమ్మటకూడ తన స్వరూపజ్ఞానమును గలిగియుండును. ఇతడు అవతారసిద్ధాంత మంగీకరించెను.

రామానుజుని మరణానంతర మాయన శిష్యులు, దేవుని కటాక్ష మెంతవరకు జీవాత్మకు దోడుపడునో యా విషయమునుగూర్చియు, విష్ణువు భార్యయగు లక్ష్మి యొక్క స్వరూపమునుగూర్చియు భిన్నభిన్నాభిప్రాయములు గలవారై రెండు శాఖలైరి. ఉత్తరమందున్న వడగళై యనువారు ముక్తినొందుటకు జీవాత్మకు భగవంతుని కటాక్షముతోబాటు స్వయంకృషికూడ నుండవలెనని వాదించెదరు. లక్ష్మి విష్ణువుతో సమానురాలనియు, శాశ్వతముగానుండుననియు వీరు తలంచుచున్నారు. వీరి ముక్తిమార్గమును మర్కటకిశోరన్యాయమందురు. అనగా పిల్లకోతి తనను గట్టిగా పట్టుకొనగా, తల్లికోతి తన పిల్లకు నే యపాయము రాకుండునట్లు కాపాడురీతిని జీవాత్మకూడ దేవుని యనుగ్రహముతోబాటు స్వప్రయత్నములుకూడ జతచేయవలెను. దక్షిణమందున్న తెంగళై శాఖవారు కేవలము దేవుని నిర్హేతుకకృపయే ముక్తిసాధనమనియు జీవునియొక్క స్వప్రయత్నములవలన లాభములేదనియు, లక్ష్మి ఆద్యంతములుగల మధ్యవర్తినియై యున్నదనియు వాదించెదరు. వీరి ముక్తిమార్గమునకు మార్జాలకిశోరన్యాయమని పేరు, అనగా తన కూనను కష్టపెట్టకయే తల్లిపిల్లి తన పిల్లను నపాయములనుండి కాపాడునట్లు మానవుడు తన ముక్తికొరకు శ్రమపడక దేవుని నిర్హేతుకకటాక్షముమీదనే ఆధారపడియుండవలెను. రామానుజ శిష్యులను శ్రీసాంప్రదాయకులనిగాని శ్రీ వైష్ణవులనిగాని పిలిచెదరు. రామానుజుల మతానుసారముగ ముక్తియనగా దేవునితో నేకమగుటయేయైనను, అద్వైతులు చెప్పు రీతిని పరమాత్మలో లీనమై స్వరూపనాశనమొందుట కాదు. పాలతో గలిసిన నీరు పాలు కాజాలనట్లే భగవంతునితో ఐక్యమైనంత మాత్రమున జీవాత్మ పరమాత్మ కాజాలదు. దీనికే సారూప్యమోక్షమని పేరు. యోహాను 17: 21; రోమా 8: 29; 1 యోహాను 3: 2 చూడుము.

రామానుజుడును, మరికొందరు మతాచార్యులును దేవుని నిర్హేతుక కటాక్ష సిద్ధాంతమును బోధించిరి. ఈ విషయములో వైష్ణవ క్రైస్తవ సిద్ధాంతము లీ క్రింది యంశములలో నేకీభవించుచున్నవి.

1. మనుష్యునికి కష్టకాలము వచ్చినప్పుడు దేవుడవతరించి యా కష్టములను దొలగించును.

2. సుఖభోగములందు మునిగియుండి పాపముచేయువారి జీవితములోను, పాపవిముక్తులైన పరిశుద్ధ జనుల జీవితములోను మిగుల వ్యత్యాసము కనబడుచుండ వలెను. ఉజ్జీవోపదేశములు, పశ్చాత్తాపము, సన్మార్గమందు ప్రవర్తింపవలెనని నిశ్చయించుకొనుట, దీపముండగనే చక్కపెట్టుకొనుట ఇట్టి మాట లీమతాచార్యులు తమ గ్రంథములందు నుపయోగించియున్నారు.

3. మానవుడు తన యర్థప్రాణములు తన సేవనిమిత్తము ధారపోయవలెనని దేవుడాజ్ఞాపించుచున్నాడు.

4. దేవుడు పరిపూర్ణముగ సంకల్పించి కటాక్షించినప్పుడే, మనుష్యమాత్రుడు ఆయనకు ఆత్మ సమర్పణముచేసికొని ధర్మమార్గమందు నడువగలడు.

5. తాను పాపమునకు దాసుడనై చెడిపోవుచున్నాననియు, పాపవిముక్తి మార్గము చూచుకొనుట యత్యావసరమనియు ప్రతివాడు నెరిగియున్న విషయమే.

6. దేవుని కృపకు బాత్రుడై ఆయన యనుగ్రహము పొందుటకు గుడికి పోవుచు దేవుని పూజించుచుండుట, ఆచార కర్మవిధుల ననుసరించుట, సజ్జనుల పాదసేవ చేయుచుండుట—ఇటువంటివాటిని తనకు సాధనములుగ జేసికొని, పనికి మాలిన సంభాషణయందు పాల్గొనక, దేవుని వాక్కగు వేదమును నిత్యము చదువుచు, భగవత్కీర్తనలను బాడుచు, భగవద్ధ్యానము చేయుచు, తన కాలమును గడుపుచుండవలెను.

7. పై జెప్పినవాటిని శ్రద్ధాభక్తులతో నాచరించువాడు, తాను జీవించియుండు కాలముననే మోక్షానంద మనుభవింపగలడు.

II. Madhvacharya. మధ్వాచార్యులు.—కన్నడదేశములోని ఉడిపి యందు పదమూడవ శతాబ్దమున నొక నూతన వైష్ణవమతోద్యమము ప్రారంభ మయ్యెను. దీనికి కారకుడు మధ్వాచార్యులను నొక సన్యాసి. ఇతడు వేదాంత సూత్రముల కొక ప్రసిద్ధమైన వ్యాఖ్యానము రచించెను. ఇతని సిద్ధాంతము కేవలము ద్వైతమే, కనుక దీనికి ద్వైతవాదమని పేరు. పరమాత్మతోబాటుగ జీవాత్మలును, ప్రపంచమును శాశ్వతముగానుండునని యుపదేశించెను. ముక్తినొందిన జీవాత్మ పరమాత్మ సమీపముననుండు స్థితికి సాలోక్యమని పేరు. ఇతడు కులభేదములు, విగ్రహారాధన, ధరించు వస్త్రములను శుచిగానుంచుట—ఇవి విధికృత్యములని విశదముగ చెప్పెను. ఇతని యిష్టదేవత కృష్ణుడు. శ్రీమాధ్వులు, బ్రహ్మ సంప్రదాయకులను నామములతో ఇతని శిష్యులు పశ్చిమ హిందూదేశమున చాల ప్రబలియున్నారు.

**III. Vallabhacharya.** వల్లభాచార్యులు.—దాదాపు పదునారవ శతాబ్దారంభమున వల్లభాచార్యులు తన బాల్యమును కృష్ణుని జన్మస్థానమగు మధురాపురమునకు సమీపముననున్న గోకులమున గడిపి, యటుపిమ్మట కాశీలో తన మతసిద్ధాంతముల నుపదేశించెను. ఇతడు వివాహము చేసికొనెను. మహారాజులను పేరుగల గోసాయనులు అనగా ఆచార్యులుకూడా గృహస్థులే. రుద్రసంప్రదాయకులు, గోకులస్థ గోసాయనులు అను నామములితని శిష్యులు ధరించియుందురు. ఇతడు వేదాంతసూత్రముల ననుసరించి యద్వైత సిద్ధాంతమును, బాలకృష్ణారాధనమును బోధించెను. ఇంతేగాక ఇతడు పుష్టిమార్గము నవలంబించెను. అనగా ఇంద్రియభోగము లనుభవించుట. ఈ మతగురువులగు మహారాజులు కృష్ణునియొక్క యవతారములనియు, భక్తురాండ్రగు స్త్రీలకు ఈ గురువులతో సంగమముచేయుటవలన పరమానందసుఖము లభించుననియు ఈ మతస్థులు నమ్ముదురు. వల్లభమత గురువులగు మహారాజులు సుమారు డెబ్బదిమంది హిందూదేశమందు నచ్చటచ్చట గలరు.

**IV. Chaitanya, or Gauranga.** చైతన్యుడు లేక గౌరాంగుడు.—ఇతడు 1484-వ సం॥న బంగాళదేశములోని నాదియ యను పట్టణమున జన్మించి, 1527-వ సం॥ పూరియందు కాలముచేసెను. ఈ మహాపండితుడు సన్యాసియై దేశసంచారముచేసెను. ఇతడు 1510-వ సంవత్సరము మొదలుకొని మరణమగువరకు, అనగా పదునెనిమిదేండ్లు పూరియందున్న ప్రసిద్ధమగు జగన్నాథాలయసమీపమున గడపెను. ఇతడు పలుమారు పరవశుడై తన్నుతాను మరచియుండుట కలదు. ఇతడు తనకు కృష్ణుడును, అతని భార్యలును ప్రత్యక్షులగుచుండిరని నమ్మియుండెను. ఇట్టి యావేశదశలో నొకప్పుడు కృష్ణుడును, గోపికలును సముద్రకెరటములమీద జలక్రీడలాడుచున్నారని భ్రమించి, తానును జలక్రీడకై సముద్రములో దిగి ప్రాణమును బోగొట్టుకొనెనని కొన్ని గ్రంథములలో గలదు. ఇతడు కులభేదములను బాటింపలేదు. మధుమాంసాహారములను నిషేధించెను. ఇతడు విధవాపునర్వివాహములను, భిక్షావృత్తిని విధించెను. ఇతడు విష్ణువుయొక్క యవతారమగు కృష్ణుని నారాధింపవలెనని బోధించెను. ధ్యానము, దాస్యము, స్నేహము, పితృప్రేమ, భార్యకు భర్తయందువలెనే జీవాత్మకు బరమాత్మయందనురాగము అను నీ విధములతో కూడిన భక్తితో కృష్ణుని సేవించువారికి మోక్షము లభించునని యితడుపదేశించెను. ఇతడు తన సిద్ధాంతమునకు ద్వైతాద్వైతమని పేరుపెట్టెను. ఇట్టి యారాధనత్వరలోనే క్షీణదశకు వచ్చి యపవిత్రకృత్యములకు దారిజూపెను. ఇతనికి బంగాళము, ఒరిస్సాదేశములలో ననేకమంది శిష్యులుగలరు. చైతన్యుడు హిందూదేశములో భక్తిమార్గమును బోధించుచుండినకాలముననే, మార్టిన్ లూథర్ అను క్రైస్తవుడు విశ్వాసమే రక్షణకు మార్గమని జర్మనీదేశమున ప్రకటించుచుండెను.

**V. Ramananda.** రామానందుడు.—క్రీ. వె. దాదాపు పదునైదవ శతాబ్దమున రామానుజుని శిష్యుడగు రామానందుడు రామానుజుని సిద్ధాంతములవంటివే కొన్నిటిని బోధించి ఉత్తరహిందూస్థానమున కొందరు శిష్యులను సంపాదించుకొనెను.

ఇతని శిష్యులకు రామానందులని పేరు. ఇతడు తన మాతృభాషయగు హిందీభాష తన మతప్రచారమునందును ఆరాధనవిధానమందు నుపయోగించెను. ఇతడు కుల భేదములను కొట్టివేసెను. ఇతనికి విష్ణువే పరమాత్ముడు.

VI. Kabir. కబీరు.—రామానందుడు కులభేదమును రూపుమాపి, సమస్త కులములవారిని తన మతములో నొకటిగా చేర్చుకొనుట యత్నించినట్లే యతని శిష్యులలో నొకడగు కబీరు హిందువులను, మహమ్మదీయులను నెట్టి భేదమును జూపక తన తెగలో జేర్చుకొన జూచెను. ఇతడు మహమ్మదీయుల అల్లాకును, హిందువుల రామునకును అంతర్యామి యనగా లోపలనుండువాడను పేరుపెట్టెను. ఇతని మతమువారగు కబీరు పంథులు తమ యారాధనలో విష్ణువుయొక్క నామములలో దేనినైన నుపయోగించెదరు. కాని విగ్రహారాధనను, కులభేదములను మూఢవిశ్వాసములతో కూడిన బాహ్యాచారములను నిషేధించి నీతిమార్గమును బోధించెదరు.

## C. THE SAIVAS. శైవులు.

I. Nilakanthacharya. నీలకంఠాచార్యులు.—ఇతడొక గొప్ప శైవమతాచార్యుడు. శంకర, రామానుజ, మధ్వాచార్యులవలె నితడును వేదాంతసూత్రములకు వ్యాఖ్యానములు రచియించెను. శివుడే పరబ్రహ్మమనియు, అతడు సగుణుడనియు అవతారము లెత్తకపోయినను పలువిధములుగా తన భక్తులకు ప్రత్యక్షమగు చుండుననియు నుపదేశించెను. ఇతని సిద్ధాంతము చాలామట్టుకు అద్వైతమే యనవచ్చును. జీవాత్మకు పరమాత్మకు భేదముండినను, అది పరమాత్మతో పూర్తిగా నైక్యమై స్వరూపజ్ఞానము లేక పరిపూర్ణ బ్రహ్మజ్ఞానముతో నిండియుండును.

II. The Saiva Siddhantists. శైవసిద్ధాంతులు.—శైవసిద్ధాంతము ఆగమ శాస్త్రములలో గాన్పించును. అరవభాషలో రచితములైన యీ గ్రంథములు శివుని యద్భుతకార్యములను వివరించుచు, శివభక్తియే ప్రధానమని బోధించుచున్నవి. శివగీతములును, ఆగమములును నీ క్రింది విషయములను పక్కాణించును. శివుడు నిత్యుడును పరమేశ్వరుడునై యున్నాడు. ఇట్టి శివునికి పతి యని పేరు. ఈ పతియగు శివుడును, పశువులగు జీవసముదాయమును, పాశమను సంసారబంధకమును—వీటిలో ప్రతిదియు ఆద్యంతములులేక నిత్యమునుండును. మరల జన్మములెత్తకుండుటయే మోక్షము. శివునితో నైక్యమై స్వరూపజ్ఞానము కలిగియుండుటయే ముక్తి. చర్య యనగా దేవాలయము నూడ్చుట, నిగ్రహములను పూలదండలతో నలంకరించుట మొదలగు సేవలన్నిటిచే సాలోక్యపదవియు, అనగా శివలోకమున నివసించుట, క్రియ యనగా శివుని స్తుతించుచు కీర్తనలు పాడుచు నాట్యమాడుటవలన సామీప్య పదవియు అనగా శివుని సన్నిధిని నుండుట కలుగును. యోగమువలనను, ధ్యానమువలనను సారూప్యమును అనగా శివుని స్వరూపమునుబొందుట, జ్ఞానము వలన శివసాయుజ్యమును అనగా శివునిలో సంపూర్ణముగ నైక్యమగుట లభించును. క్రీ. వె. పదనొకండవ శతాబ్దమున అరవదేశీయుడగు మాణిక్యవాసగర్ అను నతడు శివునియందు గాఢభక్తిని తెలుపు గీతము లనేకములను వ్రాసెను.

III. The Jangamas, Lingavats, Lingayats, or Vira Saivas. జంగములు, లింగావతులు, లింగాయతులు, లేక వీరశైవులు.—ఈ శైవమతశాఖలన్నిటికిని నాయకుడగు బసవయ్య యనేక యద్భుతములు చేసెనని చెప్పెదరు. ఈ శాఖ వారందరును మెడలో లింగమును ధరించెదరు. తెలుగుదేశమంతటను మైసూరు దక్కను ప్రదేశములందును వీరు విస్తారముగ కలరు.

IV. Yogis and Sanyasis. యోగులు, సన్యాసులు. శైవవిరాగులలో ననేక తెగలవారు కలరు. వీరిలో ముఖ్యులెవరనగా:—(1) సన్యాసి. సన్యాసులు పది విధములు; (2) దండధారి యనగా దండము లేక కర్ర చేతపట్టుకొనువాడు; (3) బ్రహ్మచారి యనగా గురుసేవ చేయువాడు; (4) పరమహంస యనగా పంద్రెండేండ్లు సాధనచేసిన సాధువు; (5) లింగాయతి యనగా లింగమును ధరించువాడు. (6) అఘోరి యనగా నరశవమాంసమును, మలమును దినువాడు; (7) యోగియనగా యోగాభ్యాసము చేయువాడు; (8) ఊర్ధ్వబాహుడు అనగా నిరంతరము హస్తమును పైకెత్తియుంచుకొనువాడు; (9) ఆకాశముఖి యనగా సదా ఆకాశమువైపునకే ముఖము త్రిప్పుకొనియుండువాడు. అందువలన మెడనరములు బిగుసుకొనిపోయి భూమివైపునకు తిరుగుట యసాధ్యముగనుండును; (10) నఖి ఎల్లప్పుడు పిడికిలి పట్టుకొనియుండుటచే గోళ్లు దీర్ఘములుగా పెరిగియుండువాడు. (11) ఉఖారు, సుఖారు వీరు సాధువులలో పరమనీచులు. ఈ పైవివరించినవారుగాక యింక ననేకులు కలరు. వీరందరు నతి ఘోరతపస్సు చేయుచున్నట్లు నటించెదరు. తమ్మును మహాత్ములనుకొని, మోసపోయి జనులు సమర్పించు ధనమువలన జీవింతురు. వైష్ణవ, జైన, సిక్కుమతశాఖలలోకూడ ననేక తరగతుల సన్యాసులుగలరు.

V. The Saktas. శాక్తేయులు.—పురుషదేవతలలో సమానముగా స్త్రీదేవతలనుకూడా నారాధించుట యతి ప్రాచీన యాచారమైయున్నది. శాక్తేయుల ప్రమాణ గ్రంథములగు తంత్రములలో శివుడు అర్ధనారీశ్వరుడు అనగా సగముస్త్రీ, సగము పురుషుడని వ్రాసియున్నది. కావున లింగము, పానవట్టము—ఈ రూపములచే శివుని నారాధించెదరు. శివుని సాధులక్షణములుగల అతని భార్యయగు ఉమా లేక పార్వతియు, శివుని రౌద్రస్వభావముతోపాటు రక్తమందు ప్రీతియుగల దుర్గా, కాళి మారియమ్మ యనువారును వీరికి ఇష్టదేవతలు. ఈ శాక్తేయులు లేనిపోని హేతువులు కల్పించి శక్తిపూజయే సర్వోత్తమమైనదని వాదించెదరు. శివునియొక్క శక్తిరూపమగు ఆదిశక్తినిగాని అతని భార్యయగు పార్వతినిగాని నారాధించుటచే వీరికి శాక్తేయులను నామముకలిగెను. శైవమతశాఖవారిలో ననేకులు క్రూరులును, నీచాతినీచులును, అతిహేయులుగను నున్నారు.

శాక్తేయులలో మూడు శాఖలు గలవు. అవేవనగా:—

1. దక్షిణాచారులు.—వీరు కుడిహస్తముతో నారాధించెదరు. వీరు కాళికాదేవికి రక్తముగాని, పాలతోను చక్కెరతోను కలిపిన అన్నమునుగాని యర్పింతురు. ఈ దేవికి కలకత్తాసమీపమున కాళీఘట్టమను చోట నొక దేవాలయము కలదు. ప్రతిసంవత్సర మచ్చట వేలకొలది మేకలను బలియిత్తురు.

2. వామాచారులు.—వీరు ఎడమచేతితో నారాధించువారు. నరస్త్రీలుగాని, రాక్షస స్త్రీలుగాని కాళి ఉమలయొక్క యవతారములని వీరి యభిప్రాయము. ఈ దేవతకు సంభోగమునందెక్కువ యాశగలదని నమ్మి యామెను తృప్తిపరుచుటకు ఈ దేవత నారాధించు స్త్రీపురుషు లొండొరులతో సంభోగించెదరు. పంచమకారము లావశ్యకములని వీరు బోధించెదరు. అవేవనగా, మాంసము, మత్స్యము, మద్యము, ముద్ర, యనగా చేతులతో నాయాస్థలములను తాకుట, మైథునము అనగా సంభోగము.

3. కాలికులు.—వీరు నీతినియమములు రవ్వంతయు లక్ష్యముచేయరు. వీరిలో నొకడు ఏబదిమంది స్త్రీల నొకసారిగ పెండ్లాడవచ్చును.

D. THE SIKHS. సిక్కులు.—పంజాబుదేశమందు సిక్కుతెగవారు విశేషముగ నున్నారు. సిక్కులా దేశమందు నెక్కువ పలుకుబడిగలవారు. క్రీ. వె. 1469-వ సం॥ మొదలు 1539-వ సం॥ వరకు జీవించియుండిన బాబా నానకు అను నతడు ఈ మతశాఖను స్థాపించి దానికి మొదటి గురువైయుండెను. ఇతడు లాహొారుపట్టణ సమీపమున జన్మించెను. ఇతడు మహమ్మదీయ ప్రాబల్యముగల ప్రదేశమునబుట్టి పెరిగినందున ఏకదేవతారాధనమందు పూర్ణవిశ్వాసముగలవాడై సత్య స్వరూపియు, సృష్టికర్తయు, దయాళువును, సర్వవ్యాపియు, నిరాకారుడును, చావు పుట్టుకలులేనివాడును నగు దేవుడొక్కడే యనియును, మానవులందరును దేవుని దృష్టికి సమానులనియు, వారు సన్యాసులుకాకూడదనియు, వారు తమ వ్యాపారము లందును, వేడుకలందును, దోషరహితులైయుండవలెననియును బోధించెను. క్రీ. వె. 1574-వ సం॥ మొదలు 1581-వ సం॥ వరకు సిక్కులకు నాలుగవ గురువుగానుండిన రామదాసు అమృతసరములోని బంగారు దేవాలయమును గట్టించి దానిని సిక్కులకు నారాధనమందిరముగ స్థాపించెను. క్రీ. వె. 1581—1606-వ సం॥ వరకు అయిదవ గురువుగానుండిన అర్జునుడు సిక్కుమత చట్టములనేర్పరచి సిక్కుల మొదటి గురువగు నానకు, రామానందుడు, కబీరు, వీరి మతభావములను సంగ్రహించి గ్రంథ్ సాహిబ్ అను నొక వేదగ్రంథమును రచించెను. ఈ సిక్కుమతగ్రంథము గురుముఖియను భాషలో వ్రాసియున్నారు. ఇది అమృతసరములో బంగారుదేవాలయమునందుండును. దీనిని సిక్కులు పూజించెదరు.

అర్జునునికి పిమ్మట వచ్చిన గురువులలో మొదటి ముగ్గురును యుద్ధవీరులు. తొమ్మిదవ గురువు చోరనాయకుడు. అతనిని మొగలాయిచక్రవర్తి తల గొట్టించెను. క్రీ. వె. 1675-వ సం॥ మొదలు 1708-వ సం॥ వరకు సిక్కులకు పదియవ గురువుగా నుండిన గోవిందసింగు చక్కని పండితుడును, ప్రజ్ఞావంతుడును, యుద్ధశూరుడునై యుండెను. ఇతడు మహమ్మదీయమతమునకు విరుద్ధముగా సిక్కుల నందరిని సమ కూర్చి సిక్కుమతమునకు స్థిరమగు బునాదివేసెను. సిక్కుమతము వీరమతమాయెను. గోవిందసింగు గురుపీఠమున నుండినప్పటినుండి సిక్కులందరును సింగు అను బిరుదును వహించిరి. సింగు అనగా సింహము. సిక్కుమతగ్రంథమునకు గోవిందసింగుకూడ కొన్నిభాగములను జేర్చెను.

అటుపిమ్మట ముప్పది సంవత్సరముల కాలములో మహమ్మదీయులు వందలకొలది సిక్కులను జంపివేసిరి. కాని 1738-వ సం॥ పారసీకులు హిందూదేశముపై దండెత్తిన తర్వాత సిక్కుల ప్రభావము మరల హెచ్చెను. రంజిత్ సింగు పంజాబు, పెషావరు, కాశ్మీరము, ముల్తానుల నాక్రమించి యొక గొప్ప సిక్కురాజ్యమును స్థాపించెను. ఇతడు 1839-వ సం॥న మృతినొందెను. తరువాత జరిగిన రెండు సిక్కుయుద్ధముల యనంతరము బ్రిటిష్‌వారు పంజాబుదేశమును స్వాధీనపరచుకొనిరి. బ్రిటీషువారి సేనలయందుండు శూరశిఖామణులలో సిక్కుపటాలములుకూడ చేరియున్నవి.

పదునొకండవ యధ్యాయము

# CHAPTER XI

## నూతన హిందూమతోద్యమములు

## Modern Movements in Hinduism

A. THE MODERN AWAKENING IN INDIA. హిందూదేశోజ్జీవము.—1800-వ సం॥ నుండి హిందూదేశము నిద్రమేలుకొని కన్నులు బాగుగ విప్పిచూడ నారంభించినందున, ననేక సంస్కరణకర్తలు దేశమందు బయలుదేరిరి. ఇట్టి మార్పులకు గారణములేవనగా:—(1) హిందూదేశమున బ్రిటీషు పరిపాలకుల ద్వార పశ్చిమదేశీయుల నవనాగరికభావములు హిందువుల హృదయములను పరిశోధించుటయేగాక సంఘమును మతమును చాలామట్టుకు మార్చివేసెను. (2) ప్రొటెస్టెంటు మిషనెరీవారు చేయుచున్న మతప్రచారము. 1706-వ సం॥న డేనిష్ మిషనెరీలు ట్రాంకుబారునందు తమ మతమును వ్యాపింపజేయుచుండినను, హిందూదేశమంతటను ప్రొటెస్టెంటు సంఘములకన్నిటికిని నిజముగ ప్రోత్సాహము కలిగించినవాడు 1793-వ సం॥ నుండి శ్రీరామపురముననుండిన విలియం కేరీ యనునతడే. (3) భారతీయుల ప్రాచీన చరిత్రలను, గ్రంథములను, మతసిద్ధాంతములను, తత్వశాస్త్రములను పడమటిదేశీయులు పరిశోధింప నారంభించిరి. ప్రఖ్యాతిగాంచిన యూరోపు, అమెరికా విద్వాంసులు సంస్కృతమును నేర్చుకొని హైందవమతగ్రంథములను జక్కగ విమర్శించి యందు నంగీకరింపదగిన వేవో లోకమునకు వెల్లడిచేసిరి. పూర్వాచారములందు నభిమానముగల హైందవపండితులయొక్క హృదయము నల్లకల్లోలములుగి జేసి, వారిని సత్యాసత్య విమర్శనకు బురికొల్పుటయే పశ్చిమదేశీయుల విమర్శవలన కలిగిన ఫలితము.

కాలక్రమమున మాతృదేశాభిమాన బీజములు భారతీయుల హృదయక్షేత్రములందు నూతనముగ నంకురింప నారంభించెను. ఇట్టి సంఘీభావము మత, జాతి, కుల భేదములను రూపుమాపించి, దేశమునకు నుజ్జీవము కలుగజేయుటకు దారి చూపించెను. మరియు దేశమునందచ్చటచ్చట కులాచార విమర్శక మహా సభలు జరుగుచున్నవి. 1902-వ సం॥న భారతధర్మమహామండలి యను నొక గొప్ప సమాజమేర్పడి వేదమత ధర్మములనన్నిటిని కాపాడి నిలువబెట్టుటకు బూనుకొనెను. అంతేగాక యిటీవల సంఘసంస్కర్తలును, దేశసేవాపరులును మిగుల నుత్సాహముతో బనిచేయుచున్నారు. స్త్రీ శిశుహత్యలు, బాల్యవివాహములు, బహుమంది స్త్రీలను వివాహమాడుట, స్త్రీ పునర్వివాహనిషేధము, విధవలయెడల ననాదరణజూపుట, ఘోషాయాచారము, వివాహకార్యములయం దతివ్యయము, మూఢవిశ్వాసములు, విగ్రహారాధనము, బాలికలను దేవదాసీలనుగా అనగా వేశ్యలనుగాజేయుట, విద్యావిహీనులగు బాలికల మాధ్యము,

త్రాగుబోతుతనము—వీటినన్నిటినిగూర్చి యనేకులు వార్తాపత్రికల మూలమునను, ఉపన్యాసములమూలమునను, ఖండించినందున వీటిలో గొన్ని కొంచెమంతరించినవి. మరికొన్ని పూర్ణముగ నడుగంటిపోయెను. గాంధీ మొదలగు నగ్రజాతులవారిలో ననేకు లిప్పుడిప్పుడు కులబాహ్యులును, కులహీనులును, అంటరాని జాతులవారి నున్నతస్థితికి దెచ్చుటకు బ్రయత్నించుచున్నారు. ఈ నూతన సంస్కరణకర్తలు తమ మతాచార్యులును, సంఘనాయకులును, క్రైస్తవమత ప్రచారకులవలె క్రమశిక్షితులై, దయాధర్మాది సద్గుణమూర్తులై యుండవలెనని కోరుచున్నారు. మరియు వారు క్రైస్తవమతాచార్యుల పద్ధతులనే అనుసరించుచున్నారు. ఈ నూతన మతోద్యమములలో ముఖ్యములైనవాటినిగూర్చి యీ యధ్యాయమందు విచారింతము.

## B. MODERN REFORM MOVEMENTS IN HINDUISM.

## నూతన హిందూమత సంస్కరణములు.

I. The Brahma Samaj. బ్రహ్మసమాజము.—నూతన సంస్కరణోద్యమము లన్నిటిలో నిది మిగుల ప్రాబల్యమైనది. బ్రహ్మసమాజము అనగా బ్రహ్మోపాసనసంఘము. ఈ బ్రహ్మ యుపనిషత్తులు వర్ణించు నిర్గుణబ్రహ్మయే. ఈ సమాజమువారు ఏకదేవతారాధకులగుటచే విగ్రహములను బూజించుట మానివేసిరి. క్రైస్తవమత సిద్ధాంతములు, వారి సదాచారములు, మానసికారాధనవిధానము—ఇవి యీ సంఘస్థాపకులయొక్కయు, నాయకులయొక్కయు హృదయముల నాకర్షించుటచే, తమ యాత్మాభివృద్ధికి దోడుపడు సత్యాసత్యమత విమర్శనమునుజేసి, సత్యమతము స్థాపించుటయే యీ సమాజముయొక్క ముఖ్యోద్దేశము.

1. Ram Mohan Rai. రామ మోహన రాయలు.—బ్రహ్మసమాజ స్థాపకుడగు రామ మోహన రాయలు గొప్ప సంస్కరణకర్త. ఇతడు కలకత్తాసమీపమున 1772-న సం॥న జన్మించెను. ఇతడు బ్రాహ్మణుడు. ఇతడు శ్రీరామపురమందలి క్రైస్తవమిషనెరీలతో స్నేహముచేసి, వారి ద్వార క్రైస్తవమతమునుగూర్చి బాగుగ గ్రహించెను. ఇతడు 1820-వ సం॥న "శాంతిసుఖములనిచ్చెడు క్రైస్తవసిద్ధాంతములు" అను నొక గ్రంథమును రచించెను. ఇతడు సహగమనమును, విగ్రహారాధనమును, బహుభార్యలను వివాహమాడుటయు, సర్వం బ్రహ్మమయ మను సిద్ధాంతమును, కులభేదములను, జన్మాంతరసిద్ధాంతమును ఖండించెను.

1828-వ సం॥ ఇతడు కొందరు బ్రాహ్మణ విద్వాంసులను, తదితరులను, చేర్చి కలకత్తాలో బ్రహ్మసమాజమును స్థాపించెను. ప్రతి శనివారము రాత్రి యీ సమాజమందిరములో నెట్టి యాడంబరములేక దేవుని నారాధించుచుండిరి. కొన్ని యుపనిషత్తు శ్లోకములను స్వరయుక్తముగా పఠించి వాటికి బంగాళీభాషలో నర్థము చెప్పుటయు, ఆ భాషలోనే ప్రసంగముచేయుటయు, సంస్కృత బంగాళీ భజన, గీతములను బాడుటయు, వారియొక్క యారాధనవిధానమై యుండెను. అట్లు బహిరంగముగ దేవుని నారాధించుటయు, అందరును గలిసి ప్రార్థనచేయుటయు, హిందువుల దృష్టికి బహు విచిత్రముగ గాన్పించెను. దేవుడు సగుణు

డనియు, జీవాత్మ నిత్యుడనియు, మరణానంతరము పాపవిముక్తునమగుననియు, దేవుడున్నాడనియు, ఇతనియొక్క సిద్ధాంతములు. ఇతడు క్రైస్తవ నీతివిధులనుకూడ స్వీకరించెను.

2. Debendra Nath Tagore. దేవేంద్రనాథ ఠాకూరు.—ఇతని యాధిపత్యముక్రింద బ్రహ్మసమాజము కొంత యభివృద్ధిలోనికి వచ్చెను. ఇది యీ సంఘమునకు రెండవ దశ. 1842-వ సం॥న ఇతడు బ్రహ్మసమాజములో జేరి కొలదికాలములోనే దానికి నాయకుడును, నాచార్యుడునయ్యెను. అంతట నితడు ఒక మాసపత్రికను, బ్రహ్మమతబోధకులను తర్బీతుచేయుటకు నొక పాఠశాలను స్థాపించెను. ఇతడు 1845-వ సం॥న ఈ సమాజమునకు స్థిరముగ బునాదివేయుటకు కొన్ని నిబంధనలను జేసెను. నూతనముగా జేరిన సభికుడు వాటి నంగీకరించెదనని ప్రమాణము చేయవలసియుండెను. ఇతడు బ్రహ్మోపాసనపద్ధతిని సమాజమువారికి నేర్పెను. దానిలో బహు క్లుప్తముగ దేవుని నారాధించుటకును, ప్రార్థన చేయుటకును మార్గమును జూపెను. ఈ మార్పులవలనను, బంగాళములో బ్రహ్మమత ప్రచారకుల బోధలవలనను నీ సంఘ మభివృద్ధినొంద నారంభించెను. వీరు నలుగురు యౌవనస్థులను కాశీకి బంపిరి. వారిలో నొక్కొక్కడు ఒక్కొక్క వేదమును స్వయముగా వ్రాసి, చదువుకొనుటవలన వేదమందు దోషములులేవను సిద్ధాంతము సత్యముకాదని గ్రహించిరి. కావున 1850-వ సం॥న విగ్రహారాధనతోబాటుగ వేదములు సాక్షాత్తుగ దేవుని వాక్కులగుటచే నిర్దోషములను సిద్ధాంతమును ఈ సమాజమువారు పూర్తిగా నిరాకరించిరి.

దేవేంద్రుడు తన జన్నిదములు తీసివేసినను, సమాజములో జేరినవారు కుల భేదములేక వివాహమాడుటకు నంగీకరింపలేదు. ఈ కారణముచే సమాజము రెండు శాఖలయ్యెను.

3. Kesava Chandra Sena. కేశవచంద్రసేనుడు.—1857-వ సం॥ నుండి బ్రహ్మసమాజము పరిపూర్ణస్థితికి రానారంభించెను. ఇది యీ సంఘమునకు మూడవ దశ. ఆ సంవత్సరమున నద్భుత ప్రజ్ఞాసంపన్నుడగు కేశవచంద్రసేనుడను కలకత్తా విద్యార్థి యీ సమాజములో జేరెను. ఇతడు వైశ్యుడు. మూఢవిశ్వాసములు, మానసికారాధనకు విరుద్ధమగు బాహ్యపూజావిధానములు — ఈ రెండు విషబీజములను మూలమట్టముగ బెరికివేసి, సమాజముయొక్క యాచారవిధులను సంస్కారములను శుద్ధిచేసెను. కులభేదములేదని చాటించెను. క్రైస్తవ పరోపకారసంఘమువలె నీ సమాజమువారుకూడ ధనము, ఆహారము మొదలైనవి పోగుచేసి కరువువలన బాధపడువారికి బంచిపెట్టుచుండిరి. 1864-వ సం॥న నితడు చెన్నపట్టణమునను, బొంబాయిలోను ఇచ్చిన మతోపన్యాసములవలన మదరాసులో బ్రహ్మసమాజమును, బొంబాయిలో ప్రార్థనసమాజమును స్థాపితములయ్యెను.

కేశవచంద్రుడును, అతని పక్షమువారును, సంపూర్ణముగ సంఘసంస్కరణమునుజేయ బూనుకొనిరి. కనుక దేవేంద్రనాథుడును, అతనితోబాటు మరికొందరు

వృద్ధసామాజికులును వీరితో నేకీభవించకపోయిరి. అందువలన 1865-వ సంవత్సరారంభమున కేశవచంద్రసేనుడును, అతని పక్షమువారును సమాజమునుండి వేరైపోయిరి.

కేశవచంద్రునియందు గాలక్రమమున క్రైస్తవ సత్యసిద్ధాంతములును, సదోపదేశములును మరింత వేరు నాటుకొనసాగెను. పరమపవిత్రముగ జీవయాత్ర గడుపవలెననెడి ఉత్సాహమును, మానవకోటిని రక్షింపవలెనను నాసక్తియు కేశవచంద్రునియందును, అతని బ్రహ్మమతప్రచారకులయందును నభివృద్ధియగుచుండెను.

1869-వ సం॥న కేశవచంద్రుడు ఇంగ్లాండుదేశమునకు బోయినప్పుడు, సదాచారసంపన్నుడగు క్రైస్తవుని కుటుంబజీవితమువలన గలిగెడు గొప్ప లాభములను బాగుగ గ్రహించెను. అంతట నతడు నూతనసంస్కరణవిధానములను దనలో తర్కించుకొనుచు తన దేశమునకు దిరిగివచ్చెను. స్త్రీ స్వాతంత్ర్యముకొరకును, బాలికావిద్యనుగూర్చియు నతడు విశేషముగ బాటుపడెను. కుల, జాతిభేదములు లేక వివాహములు జరుగుచుండెను. పరోపకారములను యథాప్రకారముగా జేయుచుండిరి. అతడొక నూతన వివాహపద్ధతిని నేర్పరచెను. దానిప్రకారము వివాహమాడు స్త్రీ పురుషులు క్రైస్తవ దంపతులవలె నొండొరులు ప్రమాణములు చేయవలసియుండెను. కాని యతని సంస్కరణ పద్ధతుల కిష్టపడని ప్రతి కక్షయొకటి వృద్ధియగుచుండెను.

ఈ కాలమున కేశవచంద్రుడు తన కుమార్తెను కూచీ బీహారు సంస్థాన రాజకుమారునికిచ్చి పెండ్లిచేసెను. ఈ రాజకుమారుడు బ్రహ్మసామాజికుడు కాడు గనుక ఈ వివాహము బ్రహ్మవివాహచట్టములకు విరుద్ధమైనది. ఈ కారణమున సమాజమువారిలో ననేకులితని సంఘముతోటి సంబంధమును జాలించుకొనిరి.

1878-వ సం॥న బ్రహ్మసమాజముయొక్క నాలుగవదశ ప్రారంభమాయెను అప్పటికి బ్రహ్మసమాజము మూడు ప్రత్యేకశాఖలుగ జీలిపోయెను. వీటిలో మొదటిది దేవేంద్రనాథ ఠాకూరుతో కూడిన చిన్న శాఖ. దీనికి ఆదిబ్రహ్మసమాజమని పేరు.

రెండవశాఖను సాధారణ బ్రహ్మసమాజమందురు. ఇది స్థాపితమైననాటి నుండియు క్రమక్రమముగా వృద్ధియగుచునేయున్నది. కేశవచంద్రునితో నిలిచియుండినవారు మూడవశాఖగా నేర్పడిరి. అసమానప్రజ్ఞయు, పవిత్రగుణవిశేషములునుగల ఈ మతాచార్యుడు వీరికి 1884-వ సం॥న మరణించువరకును మార్గదర్శిగా నుండెను. తన సమాజమునకు "నవవిధానము" అను నామమిడెను. అతడీ క్రొత్త సమాజమునకు క్రైస్తవుల సిలువయు, హిందువుల త్రిశూలమును, మహమ్మదీయుల చంద్రవంకయు కలిసిన యొక క్రొత్త గురుతును గల్పించెను. మతములన్నియు సత్యములైనవని యతడు నమ్మెను. కాని దివ్యగుణసంపన్నుడును, దివ్యపురుషుడు నగు శ్రీ యేసుక్రీస్తుప్రభువే యతని దృష్టికి సర్వోత్కృష్టుడై యుండెను. ఆత్మస్వరూపుడగు దేవుని మానసికముగా నారాధించువారిలో జేరినవాడై యుండినను,

విగ్రహారాధనను, బహుదేవతారాధనను ఖండింపకుండెను. ఇతనికి క్రీస్తుప్రభువు నందుగల యభిమానమును, అనురాగమును వర్ణింప శక్యముగాదు. బాప్తిస్మము ప్రభురాత్రిభోజనము ఈ రెండు సంస్కారములను తన సమాజమునందు ప్రవేశ పెట్టెను.

ఇతడును, ఇతని ప్రాణస్నేహితుడగు ప్రతాపచంద్ర ముజందారుడును క్రీస్తు నందు నిష్కపటభక్తియు, విశ్వాసమునుగలవారేగాని తాము బాహాటముగ బాప్తిస్మ దీక్ష నొందినంతమాత్రమున ఒక్కదినములో నతాత్తుగ తమ మాతృదేశముయొక్క యజ్ఞానబంధవిముక్తిగావించుట యసాధ్యమని వారికి దోచినంగున, బ్రహ్మోపదేశము వలననే క్రమక్రమముగా భారతీయుల హృదయము శుద్ధిచేసి క్రీస్తువైపునకు మరలించు టయే కాలానుకూలమగు మార్గమనుకొని, చనిపోవువరకును అంతరంగములో క్రీస్తు భక్తులుగనే యుండ నిశ్చయించుకొనిరి. కేశవచంద్రసేనునకు యేసుప్రభువునందెంత గాఢవిశ్వాసము గలిగియుండెనో, అతడు పలికిన యీ క్రింది మాటలనుబట్టి మనము గ్రహింపవచ్చును. "యేసే, ముమ్మాటికిని యేసే, కాని మరెవ్వరును దేదీప్యమానమై వెలుగుచుండు నీ యమూల్య కిరీటమగు భరతదేశమును ధరించుటకు యోగ్యులుకారు సుమండి. ఈ దేశమాయన సొత్తేయగును." ఇతడు చనిపోయినపిమ్మట నితని సమాజ మునకు తగిన నాయకుడు లేకపోవుటచే నది మూడు చిన్నచిన్న సంఘములుగ జీలి పోయెను. ఇతని మూలసిద్ధాంతములు చాలమట్టుకు క్రైస్తవుల మతసిద్ధాంతముల ననుసరించియేయుండును, గాని కొన్ని విషయములలో నేకీభవించుటలేదు.

4. The Doctrines of the Three Samajas. మూడు సమాజములు వారియొక్క మూలసిద్ధాంతములు. ఫార్క్వర్ అను పండితుడు బ్రహ్మసమాజసిద్ధాం తముల నీక్రిందివిధముగ విశదపరచియున్నాడు.

(*a*) పరబ్రహ్మ ముత్కృష్ట గుణసంపన్నుడగు సగుణమూర్తి.

(*b*) భగవంతుడెన్నడు నీ భూలోకమున నవతరింపలేదు.

(*c*) ప్రేమాస్వరూపియగు దేవుడు మన ప్రార్థనల నాలకించి మనము కోరినవాటి ననుగ్రహించును.

(*d*) ఆత్మస్వరూపుడగు పరమాత్మను మానసికముగనే ఆరాధింపవలెను. ఎట్టి జాతి, మత, కులభేదములునులేక యందరును ఆ పరమపితను నారాధించుటకు నధి కారముగలవారే.

(*e*) పశ్చాత్తాపము, పాపకార్యముల విసర్జించుట, పాపక్షమాపణకును, ముక్తి నొందుటకును మార్గములు.

(*f*) మానవుడు తన సహజజ్ఞానమువలనను సృష్టిపదార్థ విమర్శనమువలనను, అగోచరుడగు పరబ్రహ్మయొక్క స్వభావగుణలక్షణములను స్వయముగనే గ్రహించు కొనగలడు. ఏ మతగ్రంథమును పరమప్రమాణమని యెంచరాదు.

(*g*) దేవుడు మానవకోటికి తండ్రి. మానవులందరును సోదరులే,

(*h*) ఆత్మ నశించుపదార్థము కాదు. దాని యభివృద్ధికి నంతములేదు.

(*i*) కృపానిధియగు దేవుడు సజ్జనులను కటాక్షించి, దుర్జనులను శిక్షించును. తన ప్రజలను సన్మార్గమందు నడిపించుటకే శిక్షించును గాని శాశ్వతముగ యాతనల పాలుచేయడు.

(*j*) పరబ్రహ్మము, తండ్రి, కుమారుడు, పరిశుద్ధాత్మయను త్రిత్వముతో కూడు కొనిన యద్వితీయపదార్థము. దేవునియందు తండ్రి స్వభావముమాత్రమేగాక తల్లి స్వభావముకూడ గలదు.

(*k*) బ్రహ్మమతము సర్వలోకసమ్మతమగు దివ్యమతము. దేవుడు స్థాపించిన నవవిధానమును బోధించునది ఈ బ్రహ్మసమాజమే. ఈ మతప్రచారకులు దేవు డేర్పరచిన బ్రహ్మోపదేశకులు.

(*l*) దైవప్రేరితులగు వారి యుపదేశములద్వారను, సృష్టిపదార్థవిమర్శనము వలనను, మానవ సహజజ్ఞానముమూలమునను పరమాత్మయొక్క యుత్కృష్టగుణవిశేష ములను గ్రహించగలము. దేవుడప్పుడప్పుడు తన సంకల్పములను తన సేవకులకు ఆజ్ఞలరూపమున బయలుపరచుచుండును. దీనికి ఆదేశమని పేరు.

పైన వివరించిన సిద్ధాంతములలో *a–f* వరకు ఆదిసమాజముయొక్క మూల సిద్ధాంతములును, *a–i* వరకు సాధారణ సమాజముయొక్క ప్రత్యేకసిద్ధాంతములును *a–l* వరకు నవవిధానముయొక్క ప్రత్యేకసిద్ధాంతములునై యున్నవి.

II. The Prarthana Samaj. ప్రార్థన సమాజము.—ప్రార్థన సమాజము 1867-వ సం॥న ఏకదేవతారాధకులు స్థాపించిరి. దానికి డాక్టర్ ఆత్మారాం పాండు రంగ యను నతడు నాయకుడాయెను. దీనియందలి సభికులు చాలమంది బొంబాయి, పూన, సూరతు పట్టణవాసులగు మహారాష్ట్రులై యున్నారు. ఈ సామాజికులు వారమున కొకసారి ప్రార్థనకూటము జరుపుదురు. ఈ సమాజమువారొక యాలో చనసభను నేర్పరచిరి. వీరు నియమితచట్టముల ననుసరించి, సంఘకార్యములను జరుపుకొందురు. ఈ సమాజము విగ్రహారాధన నిషేధించుచున్నది. అంతేగాక వేదము దేవునివాక్కు కాదందురు. పునర్జన్మసిద్ధాంతమును కొట్టివేసిరి. ఏకదేవ తారాధనయు, సంఘసంస్కరణమును జేయుటకును జనులను ప్రేరేపించుచుందురు. 1868-వ సం॥ కేశవ చంద్రసేను బొంబాయికి రెండవసారి వచ్చి ఈ నూతన సమా జమునకు మరింత ప్రోత్సాహము కలిగించెను. 1872-వ సం॥న కలకత్తావాసుడగు పి. సి. ముజందారను నతడు బొంబాయికి వచ్చి, యారునెలలుండి, ఈ సమాజము నింకను అభివృద్ధిపరచి కూలివారికి జదువు చెప్పుటకు రాత్రిబడుల స్థాపించెను. ఈ సమాజము వారి యుద్దేశములను, కార్యములను బ్రచురపరచుటకై సుబోధపత్రిక యను నొక వార్తాపత్రిక నారంభించిరి. పండిత దయానంద సరస్వతియు ఈ సమాజ నాయకులును వేదార్థములనుగూర్చి భిన్నాభిప్రాయముగలవారైరి. అందుచే దయా నంద సరస్వతి 1865-వ సం॥న ఆర్యసమాజమును స్థాపించెను. ప్రార్థన సమాజ ప్రచారకులు కొలదిమందియేయగుటచే, నిది దేశమంతయు విశేషముగ వ్యాపించలేదు.

III. The Arya Samaj. ఆర్యసమాజము. — కత్తియవార్ దేశమునందలి టంకార యను పట్టణమున 1824-వ సం॥న మూలశంకరుడు అను బ్రాహ్మణుడు జన్మించెను. ఇతడు తన పదునాల్గవ సంవత్సరము నిండునప్పటికే సంస్కృతము బాగుగ నేర్చుకొనెను. ఆ సంవత్సరము శివరాత్రినాడు మూలశంకరుడు శివవిగ్రహముమీదుగా చిట్టెలుకలు పరుగెత్తుట చూచెను. ఆ విగ్రహము తనమీదినుండి వాటిని తోలివేసుకొన శక్తిలేకయుండుట చూచి నిర్జీవవిగ్రహములయందు తనకుండిన విశ్వాసమును విడిచిపెట్టెను.

అటుపిమ్మట నతడు సన్యసించెను. 1848-వ సం॥న గురువు అతనికి దయానందుడను పేరుపెట్టెను. అప్పటినుండి యతనిని స్వామి దయానందసరస్వతి యని పిలుచుచున్నారు. కొంతకాలమువరకు వేదాంతయోగసిద్ధాంతములను గౌరవించెను. కాని తుదకు వాటిని విసర్జించెను. దివ్యజ్ఞానోపదేశముచేయగల నాచార్యులకొరకు సంచారము చేయుచుండగా మధురనగరమున సంస్కృత పండితుడును, సర్వశాస్త్రవేత్త యునగు విరజానందులను నొక యంధబ్రాహ్మణుని దర్శనముచేసెను. ఈ యాచార్యుడు తన యద్భుతప్రభావముచే దయానందుని హృదయము నాకర్షించి, తన పాదసేవకునిగ జేసికొనకలిగెను. దయానందస్వామి హరిద్వారమున విగ్రహారాధనమును పుణ్యతీర్థయాత్రలను ఖండించుచు ఉపన్యసించెను. ఇతడు భాగవతపురాణము దుర్నీతి బోధకమని చెప్పెను.

1868-వ సం॥న దయానందుడు తన సిద్ధాంతములను బ్రకటింప నారంభించెను. తన యభిప్రాయములనుగూర్చి యనేక ఉపన్యాసములు చేయుటయేగాక పెక్కు గ్రంథములనుకూడ రచించెను. అతడు విద్వాంసులనేకులతో సంస్కృతమున మత విషయములనుగూర్చి తర్కించెను.

1874-వ సం॥న అతడు తన మతసిద్ధాంతములుగల "సత్యార్థప్రకాశ్" అను గ్రంథమును బూర్తిచేసెను. ఆ సంవత్సరమే యితడు బొంబాయికి వెళ్లెను గాని తన సిద్ధాంతములు ప్రార్థనసమాజపువా రంగీకరింపకుండుటచేత నతడు వారితో నేకీభవింపలేకపోయెను. ఆ మరుసటి సంవత్సరమే యతడు బొంబాయిలో నార్యసమాజమును స్థాపించెను. అయితే కొంతకాలమునకు నతడు లాహొరుపట్టణము తన సమాజమునకు ముఖ్యస్థానముగజేసెను. అచ్చట నార్యసమాజ మతిత్వరలోనే అభివృద్ధినొందెను.

క్రైస్తవులును, మహమ్మదీయులును, ఆవులను, ఎద్దులను జంపుచుండుటచే నతడు హిందువులను వారిమీదికి రేపెను. ఇతడు 1883-వ సంవత్సరము అక్టోబరు నెలలో కాలముచేసెను.

"వేదములనుమాత్రమే యనుసరింపుడు. భరతదేశము భారతీయులకే" యని దయానందుడు మాటిమాటికి పలుకుచుండువాడు. ఇతని మూలసిద్ధాంతము లేవనగా:

1. దేవుడొక్కడే. ఆయనను మానసికముగ నారాధింపవలెను.

2. నాలుగు వేదములును దేవుని జ్ఞానస్వరూపములు. వీటియందు సర్వతత్వ, ప్రకృతిశాస్త్రబీజము లిమిడియున్నవి.

3. జన్మాంతరము, ప్రారబ్ధకర్మసిద్ధాంతములను వేదములు బోధించుచున్నవి.

4. భగవంతుడు పాపాత్ములను క్షమించుననుట నమ్మతగినదికాదు.

5. జన్మలు రహితముజేసికొనుటయే మోక్షము.

6. ఇతడు బహు విపరీతముగ వేదములకు వ్యాఖ్యానములు వ్రాసెను. కాని యితని యభిప్రాయములు సరియైనవికావు. వేదసంహితలే పరమప్రమాణ శ్రుతులు గాని బ్రాహ్మణములును, ఆరణ్యకములును, ఉపనిషత్తులును ప్రమాణములు కావని ఈయన యభిప్రాయము. ఇట్లితడు ప్రాచీనపండితులతో నేకీభవించుట లేదు. ఈయన బ్రహ్మము, జీవులును, ప్రకృతియు నిత్యములని భావించెను. అవతార సిద్ధాంతములును దానితో బాటుగ పితృదేవతల నారాధించుటయు విసర్జించెను. హిందూమతశాఖలన్నిటిని, ఆ కాలమున హిందూదేశమందు వ్యాపించియున్న సర్వమతములను దయాదాక్షిణ్యములెంచక పూర్తిగ ఖండించెను.

1892-వ సం॥న ఆర్యసమాజము రెండు సంఘములాయెను. అవేవనగా:— 1. విద్వాంసులశాఖ. వీరు విద్యావిషయములలోను, ఆహారనియమములందును కాలానుసారముగ మార్పులు చేయుచుందురు. సర్వలోకము శిరసావహించవలసిన మతము ఆర్యమతమే యని యీ శాఖవారు చెప్పుచున్నారు. 2. శాకాహారులు లేక మహాత్ములశాఖ. వీరు పూర్వాచారముల ననుసరించుచుందురు. ఆర్యసమాజము ప్రస్తుతము విశేషముగ నభివృద్ధినొందుటలేదు.

## C. MODERN REVIVAL MOVEMENTS IN HINDUISM.

**హైందవమతనూతనోజ్జీవము.**—1870-వ సం॥న మొదలుకొని హైందవమతము వారును తదితర మతస్థులును తమ ప్రాచీనమత సిద్ధాంతములను, మూఢవిశ్వాసములను, విసర్జించక వాటి పక్షమున వాదించుటకు సాహసించుచున్నారు. తూర్పుఖండవాసుల మతసిద్ధాంతములన్నియు నాత్మాభివృద్ధికి తోడ్పడునని వాటిని పొగడుదురు. పశ్చిమదేశీయుల యాచారములు సిద్ధాంతములు కేవలము ప్రకృతిసంబంధములును లౌకికములునై యున్నవని వాటిని ఖండించుచు హిందూమతమును నిలుపబెట్టుటకు ననేక నూతన సంఘములు బయలుదేరెను.

I. Ramakrishna Paramahamsa. రామకృష్ణ పరమహంస.—1834-వ సంవత్సరము ఫిబ్రవరినెల యిరువైయో తేదీని బంగాళాదేశమందలి కామర్పుకూరను నొక గ్రామమున గదాధరచటర్జీ యను నతడొక బ్రాహ్మణగృహమున జన్మించెను. ఇతనికి విద్యాభ్యాసమేమియులేదు. దాదాపు 1855-వ సం॥న నితడును, నితని యన్నయు కలకత్తాసమీపమున హుగ్లీ నదీతీరముననున్న దక్షిణేశ్వరమను నొక యూరిలో ప్రతిష్ఠించిన నూతన దేవాలయమునకు పూజారులైరి. కొలదికాలమునకు గదాధరుడు రక్తపానప్రియయగు కాళీదేవి విగ్రహము నారాధింపవలెనను గొప్ప యాశగలవాడయ్యెను. ఈ కాళి తనకుమాత్రమేగాక ప్రపంచమంతటికి తల్లి యని

యితడు భావించెను. ఇట్టి మతావేశముచే మైమరచి యొక్కొక్కప్పుడు యోగ సమాధిలో ప్రవేశించి గంటలకొలది యుండువాడు. ఇతడు తన యిరువదైదవ యేట నారేండ్ల బాలికను వివాహమాడెను. కాని యామెను కొద్దికాలములోనే విడిచిపెట్టి తన గుడికి తిరిగివెళ్లి పూజారిగనుండెను. ఇతడు భగవంతుని కనుగొనుటకు ప్రబలప్రయత్నములు చేయుచుండెను. ఇతడు పలుమారు పరవశుడగుచు నదేరీతిని చాలకాలమునుండుట సంభవించుచున్నందున తన నియమితకార్యములు సక్రమముగ జేయలేకపోయెను. కావున నితనిని పూజారిపనినుండి తీసివేసిరి. అప్పటినుండి యితడు పండ్రెండేండ్లు దైవధ్యానమందును, ఇంద్రియములను జయించుటయందును గడిపెను. పరమాత్మలో నైక్యమగుటకు యత్నించుచుండెను. పిమ్మట కొంతకాలమునకు నితడు రామకృష్ణుడను పేరు పెట్టుకొనెను. ఇతడు మహాజ్ఞానియు పరిశుద్ధుడునై యుండుటచే పరమహంస యను బిరుదు సంపాదించెను. తదనంతర మితడు వైష్ణవుల యిష్టదేవతయు, ప్రేమసాగరుడునగు కృష్ణుని నారాధింప నారంభించెను. తుదకు తన పరవశదశలో కృష్ణునిచూచెను. దేవుని కన్నులార గాంచవలెననే యాశ యితనికి బహు తీవ్రముగనుండెను.

ఇతనికొకమారు శ్రీ యేసుభగవానుల దర్శనము లభింపగ మూడు దినముల వరకు మరి యేసంగతినిగూర్చియు మాట్లాడుట కిష్టపడలేదు. తుదకితడు మతము లన్నియు సత్యములేయనియు, సర్వమతములొకే గమ్యస్థానము జేర్చు వివిధమార్గము లనియు సిద్ధాంతముచేసెను. అయినను హైందవుల మతభావములను, ఆచారములను నిలువబెట్టుటకే తన యావచ్ఛక్తిని వినియోగించెను.

దయానందసరస్వతి, కేశవచంద్రసేను మున్నగువా రనేకులితని దర్శింప వచ్చుచుండిరి. ఇతని శిష్యులలో మిగుల ప్రఖ్యాతిగాంచినవాడు నరేంద్రనాథదత్తు అను నతడు. అతనికి వివేకానందస్వామి యను మరియొక నామముగలదు. పరమహంస యొక్క యుపదేశముల నతని శిష్యులు సంగ్రహించి వ్రాసిరి.

II. Swami Vivekananda. వివేకానందస్వామి.— నరేంద్రనాథదత్తు అను మొదటి నామముగల వివేకానందస్వామి 1862-వ సం॥న జనవరినెల 9-వ తేదిని కలకత్తాలో కాయస్థకులమున పుట్టెను. ఇతడాంగ్లవిద్యల జక్కగ నభ్యసించెను. 1882-వ సం॥న నితడు రామకృష్ణుని మొదటిసారి దర్శించి మాట్లాడెను. ఈ సంభాషణచే నితని జీవితవిధానమంతయు బూర్తిగ మారిపోయెను. రామకృష్ణుడు చనిపోయినపిమ్మట వివేకానందుడు సన్యసించి కొన్నివత్సరములు హిమాలయప్రాంతమున ధ్యానయోగమందు గడిపెను. ఇతడు అద్వైతసిద్ధాంతముతో మరికొన్ని హిందూ మతసిద్ధాంతములనుకూడ జేర్చి యుపన్యసించెను. హిందూదేశమంతటను సంచారము చేసెను. పిమ్మట 1893-వ సం॥లో అమెరికాలోని షికాగోలో సర్వమతములను బరిష్కరించుటకు నొక మహాసభ జరిగెను. హిందువులితనిని తమ మతమునకు బ్రతినిధిగా ఆ సభకు బంపిరి. తన వాక్చాతుర్యముచే అమెరికావారి హృదయముల నాకర్షించెను. అతడా దేశమునుండి తన దేశమునకు దిరిగి వచ్చినతరువాత రెండు

మతములను స్థాపించెను. ఈ మతములలో రామకృష్ణ మత ప్రచారముజేయ గోరు సన్యాసులు తర్ఫీతునొందెదరు. వివేకానందస్వామి 1902-వ సం॥న చనిపోయెను. ఇతడు మరణించినప్పటినుండియు రామకృష్ణమతసంఘము క్రమక్రమముగ నభివృద్ధియగుచు నేయున్నది.

III. Theosophy. దివ్యజ్ఞాన సమాజము.—దివ్యజ్ఞానమనగా నొకవిధమైన తత్వవిచారణ. ఈ దివ్యజ్ఞానముతో ప్రకృతిశాస్త్రజ్ఞానముకూడ కలిసియుండును. ఈ మతాచార్యులు తమ సిద్ధాంతము సర్వ తత్వజ్ఞానసారమనియు, తమకు మించిన తత్వవిమర్శకులిక నుండబోరనియు జెప్పుదురు. ఇది యొక గొప్పసంఘము. దీనికి దివ్యజ్ఞాన సమాజమని పేరు.

ఈ యుద్యమమును గ్రహించుటకు మనమీ మతాధ్యక్షురాండ్రిద్దరిని గూర్చియు, వారితోగలసి పనిచేసిన పురుషులనుగూర్చియు ముందుగ తెలిసికొనవలసియున్నది.

1. Madame Blavatsky. మేడం బ్లవాట్స్కి.—ఈమె మొదటిపేరు హెలీన పెట్రోవ్న. ఈమె 1831-వ సం॥ ఆగస్టునెల 12-వ తేదీని రష్యాదేశములో జన్మించెను. ఈమె 1848-వ సం॥న బ్లవాట్స్కి యను నతని పెండ్లాడి మూడు మాసములకే యతనిని వదలివేసి పారిపోయెను. ఈమె యనేక దేశములలో సంచరించెను. ఈమె యెచ్చటికిపోయినను నీమెకు నద్భుత భూతపిశాచములు కనబడుచుండెనట. 1873-వ సం॥న ఈమె అమెరికాదేశమునకువెళ్లి కర్నల్ ఆల్కాట్ అనువానితో జేరెను. వీరిద్దరును భూతవిద్యలచే జనుల నాకర్షించి, తద్వార ధనము సంపాదించు నుద్దేశముతో అమెరికాలోని న్యూయార్కుపట్టణమందు దివ్యజ్ఞాన సమాజమును స్థాపించిరి. ఆ దినములలో నీ దివ్యజ్ఞానము ప్రాచీన ఐగుప్తు యూదమతములందలి రహస్య మంత్రతంత్రజ్ఞానముతో మిశ్రమమైయుండెను. 1877-వ సం॥న నీమె "ఐసిస్ యను దేవతను బయలుపరచుట" యను గ్రంథమును బ్రచురించెను. ఆమె దానియందు భూతమంత్ర విద్యలనుగూర్చి యనేక విషయములు విశదీకరించెను. 1878-వ సం॥న నీమె కర్నల్ ఆల్కాట్ తో గలసి హిందూదేశమునకు వచ్చెను. అప్పటినుండి వారు తమ మతసిద్ధాంతములను వ్యాపింప జేయుచుండిరి. 1882-వ సం॥ నుండి నేటివరకును చెన్నపట్టణమందలి అడయారు దివ్యజ్ఞానసమాజమునకు ముఖ్యస్థానముగ నున్నది. అచ్చట యనేక యద్భుతకార్యములు జరిగెనట. వీటిని హిందువులనేకులు నమ్మిరి. ఈ సమాజమువారు తమ యార్యమతపక్షమును వహించి, దాని యభివృద్ధికి దోడుపడుదురని హైందవులు తలంచిరి. మేడం బ్లవాట్స్కియును, కర్నల్ ఆల్కాట్ను, ఐరోపాదేశమునకు వెళ్లియుండగా దివ్యజ్ఞానసమాజనాయకులలో కలహములు పుట్టెను. ఈ సమాజ నాయకురాలగు కులోమ్ అను నామె నలువది యుత్తరములు చెన్నపురి క్రైస్తవకళాశాల పత్రికాధిపతికి నిచ్చెను. అతడు వీటిలో కొన్నిభాగములను ప్రచురించెను. ఈ యుత్తరములనుబట్టి యీ సమాజికుల మాయతంత్రములు బయటపడెను. అప్పుడు బ్లవాట్స్కియును, ఆల్కాట్ యును,

మరల మదరాసునకు వచ్చి తమ చర్యలకుతగు సమాధానము చెప్పలేకపోయిరి. వీరితోబాటు తక్కిన నాయకులును నచ్చటినుంచి పారిపోయిరి. బ్లవాట్‌స్కి 1891-వ సంవత్సరమున చనిపోయెను.

2. Mrs. Annie Besant. ఆని బెసాంట్.—ఈమె యింగ్లాండుదేశమున జన్మించెను. ఈమె యొక క్రైస్తవసంఘనాయకుని వివాహమాడెను. పిమ్మట క్రైస్తవ మతమునందు విశ్వాసములేకపోవుటచేత భర్తను వదలివేసెను. ఈమె కొన్నియేండ్ల వరకు సామాన్యజనుల యభివృద్ధిగోరుచు బాటుపడుచుండెను. ఈమె 15 సంవత్సరములు నాస్తికమతము నవలంబించియుండెను. 1888-వ సంవత్సరమున నీమె బ్లవాట్‌స్కి వ్రాసిన "రహస్య సిద్ధాంతము" అను గ్రంథము చదివి, వెంటనే తన నిరీశ్వరవాదమును వదలిపెట్టి, దివ్యజ్ఞానసిద్ధాంతముల నంగీకరించెను.

1893-వ సం॥ నుండి బెసాంటమ్మ మిక్కిలి శ్రద్ధతో హిందూమతపక్షమున నుపన్యాసములు చేయుటవలనను, మతవిషయముల చర్చించుచు ననేక పుస్తకములు వ్రాసి ప్రచురించుటవలనను, రహస్యవిద్యలను బ్రచారముచేయుటవలనను, దివ్య జ్ఞానసమాజము నభివృద్ధిలోకి దెచ్చుటయేగాక, హిందూమతమునకు కుడిభుజముగ నుండెను.

జి. నారాయణ అయ్యరుగారను చెన్నపురి బ్రాహ్మణుడొకడు విద్యాభివృద్ధికై తన యిద్దరు కుమారులను ఆని బెసాంటున కప్పగించెను. ఆ యిద్దరిలో పెద్దవా డగు కృష్ణమూర్తికి బెసాంటమ్మ "ఆల్‌సియోను" అను పేరుపెట్టెను. బెసాం టమ్మ రాబోవు జగద్గురువు ఈ కృష్ణమూర్తియే యని తలంచెను. ఇతనిని దివ్యజ్ఞాన సమాజికులు క్రీస్తు అనియు, మైత్రేయుడు అనియు పిలుచుచున్నారు. ఈ యిద్ద రన్నదమ్ములను బెసాంటమ్మ లెడ్‌బీటర్ అను నతని యధీనమునందుంచెను. కాని నారాయణయ్యరుగారిందున కంగీకరించక, వారివిషయమై తన యనుమతిలేక చేసిన కార్యమునకై ఆని బెసాంటమ్మమీద వ్యాజ్యముచేసెను. ఆ దావాలో నతడు గెల్చెను. అంతట ఆని బెసాంటమ్మ ఇంగ్లాండులోని ప్రీవి కౌన్సిలుకు అప్పీలుచేసి వ్యాజ్యము తనపక్షమగునట్లు చేసికొనెను.

హిందువులలో నీమెకు గల గౌరవము నానాటికి తగ్గిపోవుచుండుటచే, ఈమె యీ దేశమున కొన్ని సంఘసంస్కరణములను జేయ బూనుకొనెను. రాజ్యాంగ విషయములలోకూడ నీమె పాల్గొనుచుండెను. 1933-వ సం॥న ఈమె చనిపోవు వరకు నీమెయెడల హిందువులకు గొప్ప గౌరవముండెను.

3. The Principal Doctrines of Theosophy. దివ్యజ్ఞానసమాజము వారి మూలసిద్ధాంతములు.—ఇవి యేవనగా:—(*a*) బ్రహ్మము నిర్గుణుడు; (*b*) విశ్వమే బ్రహ్మము; (*c*) మొదట జీవులు సూక్ష్మదశనుండి క్రమక్రమముగా నభివృద్ధినొందుచు, నున్నతస్థితికి వచ్చుట; (*d*) ప్రారబ్ధకర్మ, పునర్జన్మసిద్ధాంతములు; (*e*) బ్రహ్మజ్ఞానము సమాధియోగమువలన లభించును; (*f*) దివ్యజ్ఞానసంపన్నులకు నీతి జాతి నిబంధనలు లేవు. వారు అమానుషకృత్యములనుజేయ సమర్థులు; (*g*) ప్రతి మానవునికి ననేక

దేహములున్నవి. మరియుం నతనిచుట్టు నొక యగోచరమేఘమువంటిది యుండును. ఆ మేఘమునకు తగలకుండుటకు గులహీనులను సమీపమునకు రానియ్యకూడదు. ఇట్టివిధమున నీ సామాజికులు కులభేదములను నిలువబెట్ట జూతురు; (*h*) దేవుడందరికిని తండ్రి. మానవులందరును సోదరులు; (*i*) రహస్యవిద్యలు, మంత్రతంత్రములు, జ్ఞానదృష్టి యనునవి దివ్యజ్ఞానసమాజమునకు మూలాధారములు.

క్రైస్తవుడు తన మతమును వదలిపెట్టకయే దివ్యజ్ఞానసమాజికుడుగ కూడ నుండవచ్చునని బెసాంటమ్మ చెప్పెను. కాని సత్క్రైస్తవుడు యిట్లుండుట సాధ్యము కాజాలదని ఈ సమాజసిద్ధాంతములకును క్రైస్తవసిద్ధాంతములకు గల పరస్పరభేదములను విమర్శించుటవలన తేటతెల్లమగును.

# అనుబంధములు.

# Appendices.

## I. CRITICISM OF THE DOCTRINE OF KARMA.

### ప్రారబ్ధకర్మ సిద్ధాంతఖండనము.

కర్మ యను పదమునకు నీ క్రింది యర్థములు గలవు. (1) ఈ జన్మములో జనులు చేయుచున్న మామూలు కార్యములు; (2) యజ్ఞయాగాది కర్మకాండ; (3) కనికరములేక ప్రతీకారము చేయు చట్టము; (4) సుకృత దుష్కృత క్రియల సముదాయము, వాటి ఫలితము. ఈ జన్మపరంపర సంసారచక్ర మద్దగింప శక్యముకాని యగోచర యదృష్టవశముచే నెడతెగక తిరుగుచు నేయుండును. నిర్జీవ నిర్దయ ప్రకృతియొక్క శక్తి యమితమైనదిగదా. అది దేవతలకు మించిన ప్రభావము గలది. "పరబ్రహ్మము సహితము దానిని మార్పజాలడు" అని శంకరాచార్యులు చెప్పియుండెను. ప్రతి మనుష్యునియొక్క స్థితిగతులకు నతని కార్యములే కారణములగుచున్నవి. అవి మార్పునొందజాలవు. కర్మకు పాపమునుగాని స్వల్ప తప్పులనుగాని క్షమించుస్వభావము లేనేలేదు. జననమరణ దుఃఖములలో నీ లోకమును ముంచివేయుచుండుటయే కర్మయొక్క పని. లౌకిక పరిస్థితులకును, శరీర స్థితిగతులకును, మనోశక్తులకును, అంతరంగ గుణసంపత్తునకును నీ యదృష్టకర్మయే కారణమగుచున్నది.

కర్మ సిద్ధాంతమందలి సత్యములు.

(1) పాపమునకు వెంబడి దుఃఖమురాక తప్పదు. పాపఫలిత మనుభవింపక తీరదు.

(2) న్యాయమునకు భంగము కలుగదు.

(3) జీవాత్మ శరీరముతో నశించదని బోధించుచున్నది.

కీర్తనల గ్రంథము 62: 12; యిర్మీయా 17: 10; 2 కొరింథీ 5: 10; గలతీ 6: 7, 8—ఇవి పాపము ఫలించుననను పాపప్రతీకార సిద్ధాంతమును బోధించుచున్నవి, గాని ధర్మమూర్తియు, కరుణాకరుడు, ప్రేమాస్వరూపియు, పరమపితయునగు దేవునకును నీ సిద్ధాంతమునకును బరస్పరసంబంధము గలదు. కనుక శరీరాత్మలకు మిగుల నష్టముకలుగజేయు పాపశక్తికి బదులుగా నూతనజీవమునిచ్చు దివ్యశక్తిని పరమపిత యిచును గ్రహించును. తద్వారా పాపమునకు దాసుడైనవాడు తన మనస్సు మార్చుకొని, సన్మార్గమందు నెల్లప్పుడు నడువగలుగుటకు అద్భుతశక్తి గలవాడగును. ఈ విషయమై 2 కొరింథీ 5: 17; ఎఫెసీ 4: 23, 24; కొలొస్సైన్స 3: 9, 10 లలో జూడుము.

ఈ సిద్ధాంతఖండనము.

(1) ఈ సిద్ధాంతము సర్వపాపవిమోచనముచేయు శ్రాద్ధములకును, దేవుడు కృపానిధియను హిందువుల నమ్మకమునకును భంగము తెచ్చుచున్నది.

(2) జన్మాంతర సిద్ధాంతఖండనయందు వ్రాసిన యంశములే క్రింద తిరిగి యెత్తి వ్రాయుచున్నాము. అవేవనగా: మానవుల గుణములలోను, స్థితిగతులలోను గన పడుచుండు హెచ్చుతగ్గులు చాలామట్టుకు వంశపారంపర్యముగా వచ్చుచుండును. ఇంతేగాక భిన్నభిన్న దేశములవారిలో ననేక తారతమ్యములున్నను, వారికందరికి బరస్పరసంబంధముండుటవలన హెచ్చుతగ్గులు, సుఖదుఃఖములు, శరీరవ్యాధులు మొదలగునవి యితరులద్వార నందరికిని వ్యాపించును. ఈ పై రెండును లోక మందలి యెగుడు దిగుడు పరిస్థితులకు సమాధానము చెప్పునంత యుక్తియుక్తముగా, ఈ ప్రారబ్ధకర్మ సిద్ధాంతము చెప్పజాలదు.

(3) దయాదాక్షిణ్యారహితమగు అదృష్టము సర్వశక్తిగలదనే నమ్మకము మన స్సాక్షియొక్క నోరు నొక్కుటయేగాక, పాపాత్ములను శిక్షించు ధర్మమూర్తియగు బరిశుద్ధదేవుడున్నాడను విశ్వాసమునుకూడ నాశనముచేయును.

(4) ఒకని జీవితములోని స్థితిగతులన్నియు విధివశములే యైనపక్షమున నీ సిద్ధాంతము కులభేదమునకు ప్రబలాధారమై యుండును. జనులందరు తాము న్యాయానుసారముగ ననుభవింపవలసిన ఫలితములే యనుభవించుచున్నారు. కనుక పరోపకారచింత పూర్ణముగా నశించిపోవును.

(5) ప్రకృతి కేవలము నిర్జీవయంత్రమువంటిదియైనను, సర్వము నిర్వహించు దేవునియొక్క యపారప్రేమ, పక్షపాతరహిత ధర్మపరిపాలనము—ఈ రెండు పునా దులమీదనే ప్రపంచవిధానమంతయు నాధారపడియుండును. అట్టి సగుణమూర్తి తోడనే పాపాత్ముల వ్యాపారమంతయు సంబంధించియుండును.

(6) మానవులకు గలిగెడు వ్యాధిబాధలద్వారను, దుఃఖములద్వారను, దేవుడు వారిని పవిత్రులనుగ జేయుచున్నాడు. ఒక్కొక్క తరమువారికి వచ్చెడు కష్ట నిష్ఠురములచే జనుల యాత్మశక్తి మరికొంత వేగముగా వృద్ధియగుచున్నది. మానవుల యాత్మశక్తి మరింత యత్యున్నతపదవికి దెచ్చుటకు దేవుడు సంకల్పించి, సకల దుఃఖా క్రాంతుడను బిరుదువహించిన తన కుమారుని భూలోకమునకు బంపెను. భూలోక మున దేవుని రాజ్యమును విస్తరింపజేసి, మానవకోటికి శాంతినిచ్చుటకై నిర్హేతుకముగ దుఃఖములను మనఃపూర్వకముగ ననుభవించుటయే దేవుడు చేయదగిన కార్యము లన్నిటిలో గొప్పది.

## II. CRITICISM OF THE DOCTRINE OF TRANSMIGRATION. పునర్జన్మ సిద్ధాంతఖండనము.

క్రీ. పూ. 600 సం॥ల నాటికి బునర్జన్మ ప్రారబ్ధకర్మసిద్ధాంతములు రెండును ఉపనిషత్తులలో సంపూర్ణస్థితికి వచ్చియుండెను. జన్మాంతరమునుగూర్చిన నమ్మకము అనేకజాతులలో వ్యాపించియుండినను, ఆర్యుల యతి పురాతనగ్రంథములలో నిట్టి సిద్ధాంతము కానవచ్చుటలేదు. ఇది మొట్టమొదట కొద్దిగ అథర్వవేదములోను పిమ్మట శతపథబ్రాహ్మణములోను కనబడుచున్నది. కావున నార్యులు హిందూదేశ యాదిమవాసుల మతమునుండియే యీ అభిప్రాయమును గ్రహించియుండవచ్చును.

ఈ సిద్ధాంతమును ఆదినుండి క్షత్రియులు నమ్మిరనియు, వారు మొదట దీనిని బ్రాహ్మణులకే ఉపదేశించిరనియు, అప్పుడే బ్రాహ్మణులు దీనిని మొదట తెలిసికొనిరనియు ఛాందోగ్యోపనిషత్తు తెలుపుచున్నది.

సృష్టికాలమునుండియు మానవులకు నగోచరమగు నీ క్రింది ప్రశ్నలకు తగిన సమాధానమును జెప్పుటకే యీ జన్మాంతర సిద్ధాంతమును గల్పించియుండిరి. అవే వనగా: మరణానంతరము జీవుడెట్టిమార్పులు జెందును? శరీరవ్యాధులు, సంసార దుఃఖములెట్లు సంభవించును? ఈ జీవితములో హెచ్చుతగ్గు స్థితులకు గారణమేమి? ప్రస్తుత జన్మము పూర్వజన్మకర్మయొక్క ఫలితమని భావించినయెడల లోకములో నన్యాయమనునదియే యుండజాలదు. ఏలననగా జీవుడు చేసిన సుకృత దుష్కృతములు, వాటియొక్క ఫలితములు, పరస్పరసంబంధము కలిగియుండును. అందువలన ఇప్పటి జన్మమునకు నింతకుముందటి జన్మము కారణమగుచుండును.

ఈ సిద్ధాంతప్రకార మొక మనుష్యునకు ఎనుబదినాలుగులక్షల జన్మలుండ వచ్చునని సామాన్యముగ నమ్ముదురు. కాని మానవ ధర్మశాస్త్రము 6: 63 లో నొక జీవుడు నూరుకోట్లసార్లు వరుసగా జన్మింపవచ్చునని చెప్పుచున్నది. ప్రపంచమును, జీవులును శాశ్వతములు గనుక పునర్జన్మమనగా సంసారముకూడా శాశ్వతమే.

క్రైస్తవ పునర్జన్మ సిద్ధాంతము (1) యోహాను 3: 3—5; రోమా 6: 13; 2 కొరింథీ 5: 17 లో వ్రాసియున్నట్లు పరిశుద్ధాత్మమూలమున కలుగు మారుమనస్సును నూతన జన్మమును. (2) రోమా 8: 23; 1 కొరింథీ 15: 42—44, 50—54 లో నున్నట్లు శరీర పునరుత్థానమును సూచించుచున్నది.

ఈ సిద్ధాంత ఖండనములు.

(1) ఈ సిద్ధాంతుల వాదములకు నెట్టి ప్రత్యక్షరుజువులును గానవచ్చుట లేదు.

(2) మనమింతకుబూర్వ మనేకసార్లు జన్మించియుంటిమను విషయము మనకు జ్ఞాపకముండుటలేదు. ఈ కారణముచే ఇంతకు; బూర్వజన్మమందు నొకానొక దేహమునందు నివసించిన యాత్మయు, ఈ జన్మమునందు మరియొక దేహమునుదాల్చిన యాత్మయు నొకటేనైయు యున్నవనుటయు అసంభవము. మరియు బూర్వజన్మములో జేసిన పాపము లీ జన్మములో జ్ఞప్తికి రాకుండుటచే, అకారణముగ వాటి ఫలిత మిప్పుడు దుఃఖరూపముగ ననుభవించుచున్నామని సమాధానము చెప్పుట గోరుచుట్టు మీద రోకటిపోటువంటిదిగ నుండక మానునా? ఇంతేగాక యిట్టి దుఃఖములకు మూల కారకుడగు దేవుడు మన దృష్టికి క్రూరుడు గాక ధర్మస్వరూపుడెట్లగును?

(3) జీవులు తమకంటె బవిత్రులగువారితో గలిసియున్నప్పుడే, వారి సాంగత్యమువలన పరిశుద్ధులగుచు, ఉన్నతదశను బొందగలరు గాని తమకంటె హీనములైన పందులు, నక్కలు మొదలైన జంతుదేహములలోనుండి అట్టి పరిశుద్ధతను పొందగల రనుమాట సాధ్యముకాదు.

(4) ఏ జీవాత్మయు నొక జంతుశరీరములో నుండుకాలమున తన మానవస్వభావమును వెల్లడిచేసియుండలేదు.

(5) మనుష్యులు చేయుమహాపాతకములకు ఫలితముగా మృగపక్ష్యాదిజన్మము లెత్తుటయే నిజమగునెడల లోకములోని జనసంఖ్య నానాటికి తగ్గుచునుండవలెను గాని లోకమంతట జనసంఖ్య హెచ్చుచునేయుండుట యనుభవసిద్ధమేగదా?

(6) మానవకోటియందు గాన్పించు తారతమ్యములు సంసారయాత్రకును, లౌకికకార్యములు జరుపుటకును నవసరములైయున్నవి. మరియు దేవుడు మానవజీవితమందలి సుఖదుఃఖములద్వారా అనేకులను నీతిమార్గమున నడిపించి తనయొద్ద జేర్చుకొనును. మానవుల గుణములలోను, స్థితిగతులలోను చాలవఱకు వంశపారంపర్యముగా వచ్చుచుండును. ఇంతేగాక భిన్నభిన్నదేశముల వారిలో ననేక తారతమ్యములున్నను, వారికందరికి బరస్పర సంబంధముండుటవలన హెచ్చుతగ్గులు, సుఖదుఃఖములు, శరీరవ్యాధులు మొదలగునవి యితరులద్వార నందరికి వ్యాపించుచుండునని యనుభవపూర్వకముగ జెప్పవచ్చును.

(7) నెల్లూరుపురమునందు గౌరవనీయులగు హీ్వలర్ బొగస్ గారు అను క్రైస్తవమతప్రచారకులీ క్రింది యంశములను దెలియజేసిరి. జంతువులకు బ్రాణము మాత్రమే కలదు గాని యాత్మలు లేవు. మనుష్యులతోబాటుగ జంతువులకుకూడ ప్రేమ, కోపము, భయము అను గుణములు గలవు. కాని మానవులకుమాత్రమే ఈ క్రిందివి నాలుగును ఎక్కువగా నున్నవి. (*a*) దేవునిగూర్చిన జ్ఞానముండుటచే దేవుని నారాధించి, ఆయనతో సహవాసము చేయవలెననెడి యాశ; (*b*) మంచిచెడ్డలను గుర్తించు మనస్సాక్షి; (*c*) తాను జ్ఞానాభివృద్ధినొందుటయేగాక ఇతరులనుగూడ జ్ఞానసంపన్నులు జేయవలయుననియు, వారికి తత్వజ్ఞానము బోధింపవలెననియు గోరుచుండుట; (*d*) మానవులు భూలోకమందేగాక, మరణానంతరము స్వర్గలోకమందుగాని నరకలోకమందుగాని నివసించుదురని సర్వజనాంగములు నమ్ముట.

## III. CRITICISM OF THE BHAGAVAD GITA.
## భగవద్గీతయందలి లోపములు.

1. పాపమెంత ఘోరమైనదో గీత బోధించుటలేదు. పాపమును జేయుచున్నవాడు ప్రపంచమును ధర్మముగ పరిపాలించుచున్న దేవునియొక్క యధికారమును తిరస్కరించుచున్నాడని భగవద్గీత గ్రంథకర్త గ్రహించుటలేదు.

2. ఈ గ్రంథము కేవలము జన్మములనుండి విముక్తుడైన చాలుననిమాత్ర ముపదేశించుచున్నదేగాని పాపమునుండియు, దాని ప్రభావమునుండియు విడుదలయగు నుపాయమునుగాని పాపాత్ముడు శుద్ధుడై, నూతనజన్మ సంభూతుడై, పవిత్రముగ జీవయాత్ర జేయగలుగుటకు దగినమార్గమునుగాని చూపించుటలేదు.

3. ఇందు కృష్ణుడు నిర్దయాత్ముడై యుద్ధముచేయుటయు, మానవులను వధించుటయు బరమధర్మములని బోధచేయుచున్నాడు. ఈ విషయము భగవద్గీత 2: 17—20, 31, 33, 37 చూడుము.

4. ఈ గ్రంథకర్త కులభేదముల నంగీకరించుచున్నాడు.

5. ఈ గ్రంథము పరస్పర విరుద్ధములగు సిద్ధాంతముల నుపదేశించుచున్నదని యీ క్రింది యంశములనుబట్టి తేటపడుచున్నది.

(1) విశ్వమే దేవుడను మతమును, ఇందలి 7: 6, 7, 10 లలో గనబడు నుపనిషత్సంబంధమగు నద్వైతమతమును, కృష్ణుని యవతారపురుషునిగ నెంచు ఆస్తికమును, బహు దేవతారాధన మతమును సమర్థింపజూచుట.

(2) సాంఖ్య, యోగ, వేదాంత సిద్ధాంతములను పొందికపరుప యత్నించుట.

(3) ఇందలి 7: 12 లో నుండులాగున సమస్తగుణములును, అనగా సద్గుణములును, దుర్గుణములును, కృష్ణునినుండియే పుట్టెనని చెప్పి గుణదోషములను మరుగు జేయుట.

6. ఇది ప్రారబ్ధకర్మ, పునర్జన్మ సిద్ధాంతములను బోధించుచున్నది. ఈ విషయము 14: 18; 18: 60, 61; 3: 36, 37 లలో చూడుము.

7. ఈ గ్రంథము నిష్కామబుద్ధితో జేయు సత్కార్యముగాని దుష్కార్యముగాని ఫలింపదని బోధించుచున్నది. పాపపుణ్యములు కర్తకునంటవు అనగా పుణ్యము చేయుట బూడిదలో హోమము చేసినట్లే యగును. ఇకను పాపమునకు శిక్షే లేదు. గీత 3: 19; 4: 12 లో చూడుము.

8. మహాభారతము చెప్పునట్లు అసత్యమాడుటకు బురికొల్పినవాడును, పురాణములు వర్ణించునట్లు నీతిలేనివాడునునగు కృష్ణుని నారాధింపుమని యీ గ్రంథము ముపదేశించుచున్నది.

## IV. CRITICISM OF CASTE. కులభేద ఖండనములు.

హైందవజాతిని, నాగరికతను, వర్తకవ్యాపారములను, వృత్తులను కాపాడినది కులభేదమే యైనను, హిందువులలో నైకమత్యములేకుండజేసెను. శిల్పాదికళలు వృద్ధి నొందకుండుటకును గారణమీ కులకట్టుబాట్లే. ఇంతేగాక జనుల స్వేచ్ఛనుకూడ నపహరించెను. పంచములను బశువులకంటెను హీనమైనస్థితికి ద్రోసివేసిరి. ఒక కులమువారు తదితరకులము వారి కష్టములలోను, దుఃఖములలోను పాలుగొనుట యంతగ వీలులేకున్నది.

హిందువులు పునర్జన్మ సిద్ధాంతము నమ్ముచున్నారుగదా? కాని వీరు తమ పూర్వజన్మములో ఫలాని కులస్థులమై యుంటిమనిగాని రాబోవుజన్మములో ఫలాని కులములో బుట్టుదుమనిగాని చెప్పగలరా?

పంచములను దాకుటచే తమ కులధర్మములకు భంగముకలుగుననిగదా బ్రాహ్మణులు వాదింతురు. కాని కుక్కనుగాని కోడినిగాని అంటరాని తదితర జంతువులనుగాని బానిసనుగాని వ్యభిచారినిగాని మరియొకరీతిగా మైలపడిన మనుష్యునిగాని తాకినవెంటనే స్నానముచేయని పాపాత్ముని నెల్లప్పుడు వానలో త్రోసియుంచునందు

లకు బ్రహ్మపై యముడు నేరము మోపెనని రుక్మాంగదచరిత్రలో కలదుగదా? అయితే దుష్టప్రవర్తనగల మఠాచార్యులయొక్క కులమేమయ్యెను?

ఋగ్వేదములోని పురుషసూక్తము బ్రహ్మముఖమునుండియు, భుజములనుండియు తొడలనుండియు, పాదములనుండియు వరుసగా బ్రాహ్మణాది నాలుగు వర్ణముల వారును పుట్టిరని చెప్పుచున్నను, (1) బ్రహ్మ యే కులస్థుడునుకాడు, గనుక యతని సంతానమునకుకూడ కులభేదముండుట యసంభవమనియు, (2) ఒకవేళ బ్రహ్మ ఫలాని కులమువాడై యుండినప్పటికిని, అతని బిడ్డలు నాలుగు భిన్నభిన్న వర్ణములువారుగ నుండక, వేపచెట్టు ప్రతి చిన్న రెమ్మయు కాండమువలె చేదుగానే యుండునట్లు, ఒకటే వర్ణములోచేరి యుండవలెననియు, (3) ప్రాచీనబ్రాహ్మణులు బ్రహ్మముఖము నుండి పుట్టినవారగుటచే బ్రహ్మపాదములనుండి పుట్టిన శూద్రులకంటె గొప్పవారై యుండినను, ఇప్పుడు బ్రాహ్మణులును, వారితోబాటుగ శూద్రులును ఒకవిధముగ నరమాత్రులగు తల్లిదండ్రులకు పుట్టుచుండుటచే, ఈ యిరువర్ణములవారును, సమానులై యుండవలెననియును, మనము సులభముగ గ్రహింపగలము.

గంగానది విష్ణుపాదములనుండి పుట్టినందున, అది శూద్రునివంటిదే గనుక ఆ నదీజలమును తాకుటగాని అందులో స్నానముచేయుటగాని బ్రాహ్మణాది త్రివర్ణములవారికిని తగదుగదా?

గోవులను వధింపకున్నను, గోమాంస భక్షకులనియెడి నీచజాతులు భ్రష్టులైన యెడల, ప్రాయశ్చిత్తకాలమున గోమూత్రము మొదలగువాటిని పుచ్చుకొను బ్రాహ్మణులెట్టివారని చెప్పవచ్చును?

కుక్కమాంసము తిను పంచముడైనను, మనస్సునందును, వాక్కునందును, కార్యములయందును పరిశుద్ధుడుగ నుండినయెడల, అతడు నిర్మలజ్ఞానమును, దాతృత్వమును, సత్యసంధతయు, ఓర్పును గలిగి, అసూయలేక యుండునట్టియు; యజ్ఞము చేయునట్టియు, తపస్సుచేయునట్టియు, బ్రాహ్మణునికంటె మిగుల శ్రేష్ఠుడని భాగవతపురాణము చెప్పుచుండగా, అసత్యవాదియు స్వలాభప్రియుడును, దుర్నీతిపరుడునునగు నొక బ్రాహ్మణుని పాదములు కడిగి, ఆ జలమును త్రాగెడువాని స్థితి యెంత నీచమైయుండవలెను.

మానవునికంటెను హీనములగు జంతువులలో ప్రత్యేకజాతులు గలవు. మన మొక జంతువుయొక్క యడుగుజాడలనుబట్టి, ఇది ఫలానిజాతి జంతువు అని సులభముగ గ్రహింపగలము; గాని నరులలో గుణభేదములును, శరీరవర్ణభేదములున్నను, ఒకని కాలిగుర్తులనుబట్టి బ్రాహ్మణుడా శూద్రుడా యని గుర్తింపజాలముగదా?

జంతువులు భిన్నభిన్న జాతులైయుండుటచే, వాటిలో గుర్రములకును, గాడిదెలకును తప్ప, తక్కిన మృగములలో జాతి సంకరమగుట యసాధ్యముగాని మానవ జాతిలోనట్లు గాదు. నరులలో జాతిభేదములును, శరీరఛాయాభేదములును, అవయవ నిర్మాణమందు భేదములును కాన్పించుచుండినను, వీరిని ప్రత్యేక కులములుగ విభజించెడు దైవశాసన మేదేశమందును వినవచ్చుటలేదు. వేరువేరు జనాంగము

లలోని స్త్రీపురుషులు మరియొక జనాంగములోనివారిని పెండ్లాడి సంతానవంతులగుచుండుట చూడగా, మానవులను వేరువేరు కులములుగ దేవుడు సృష్టించియుండలేదని తేటతెల్లమగుచున్నది.

మానవులలో కులజాతిభేదములు పైచూపులకైతే కనబడుచుండినను శరీరయంత్రనిర్మాణములో నెట్టి భేదమగుపడుటలేదు. అందరిలోను అంతరింద్రియములు సమానములుగానున్నవి. అందరును న్యాయాన్యాయ వివేకము గలిగియున్నారు. అందరికి నేవోయొక మతమున్నది. వీటినన్నిటిని విచారించి చూడగా, మానవజాతియంతయు నొకటే యని విశదమగుచున్నది.

మానవులలో రెండు కులములుమాత్రమే కలవు. అవేవనగా (1) దేవుని కుటుంబమునకు సంబంధించిన సజ్జనసంఘమును, (2) అపవాది సంతతివారైన దుర్జన సంఘమును.

## V. CRITICISM OF THE RAMAYANA. రామాయణ గుణదోష విమర్శనము.

(*a*) రాముడు దైవభక్తిగలవాడును, సద్గుణవంతుడును, కార్పణ్యములేనివాడును, నిష్కల్మషమగు పితృభక్తిగలవాడునగుటచే నితడు మహాపురుషులలో గొప్పవాడని చెప్పవచ్చును. కాని యేసుప్రభువునందువలె దేవునిలక్షణము లితనియందు స్పష్టముగ బ్రతిఫలించుటలేదు. నీవు రావణుని సంహరించుటకు నవతరించిన విష్ణుమూర్తివి యని బ్రహ్మ యొకానొకప్పుడు రామునితో చెప్పెను. అయినను రాముడు కేవలమొక మనుష్యమాత్రునివలెనే తన జీవితమంతయు గడిపెను. కాని అతడు తాను సాక్షాత్తుగ దేవుడనని చూపగల అద్భుతకృత్యము లెన్నడును చేసినవాడు కాడు. తనకు సంభవింపబోవువాటిని నెరిగియుండలేదు. ప్రారబ్ధకర్మ ననుభవింపక తీరదని నమ్మియుండెను. అతడు నిజముగ దేవునియొక్క యంశముగలవాడైయుండిన పక్షమున సీత నగ్నిపరీక్షచేయకయే యామె పతివ్రతయో కాదో యను విషయము గ్రహించియుండకుండునా?

(*b*) రాము డొకసమయమున నసత్యమాడెనని రామాయణము చెప్పుచున్నది. రాముడు రాజ్యమునుండి వెడలి కొంతదూరము పోయినపుడు తన తల్లిదండ్రులు దుఃఖముతోనిండినవారై తన్ను వెంబడించుట చూచి తనకు వారి యేడ్పులు వినబడలేదని సుమంతునిద్వార చెప్పించెను.

(*c*) ఇతని పితృవాక్యపరిపాలనము హద్దుమీరెను. మనుష్యుడట్టి పరమవిధేయత దేవునియెడలమాత్రమే జూపవలసినవా డగుచున్నాడు. తన తండ్రియాజ్ఞాపించియుండినయెడల రాముడాత్మహత్యనుకూడ చేసికొనియుండును.

"విషపానము చేయుమనిగాని, సముద్రములో దుమికి ప్రాణత్యాగము చేయుమనిగాని మా తండ్రి యాజ్ఞాపించినయెడల నట్లుచేయుట నాకిష్టమే" అని రాముడే చెప్పియున్నాడు. "కాండుమందు డను ఋషి తన తండ్రి యాజ్ఞచే నొక యావునుకూడ చంపెను. పరశురాముడు తన తండ్రిమాట ద్రోసివేయక తన

తల్లి శిరస్సును నరికివేసెను. ఇట్టి దైవాంశసంభూతులు పోయిన మార్గముననే నేనును నడిచెదను'' అని రాముడు పలికియుండెను. కనుక అతడు తన తండ్రి యాజ్ఞయైనయెడల తన తల్లినికూడ చంపియుండును.

(*d*) రామాయణమందలి భూగోళశాస్త్ర విషయములు నిజమైనవికావు. ఇండియాదేశమునకును, సింహళద్వీపమునకును 700 మైళ్లు దూరమని రామాయణము చెప్పుచున్నది. కాని యీ దేశమునకును లంకకు నూరామడ దూరముమాత్రమే. సుషేనుడనువాడు 70 మైళ్లు యెత్తుగల రత్నపర్వతమును, మేరుపర్వతమును అరువదివేల బంగారుకొండలను చూచినట్లీ గ్రంథమందు గలదు. కాని యివి యిప్పుడు భూలోకమున నెచ్చటను కానబడవు.

VI. CRITICISM OF THE MAHABHARATA. మహాభారతమందలి గుణదోషములు.—మహాభారత శ్లోకమొకటి చదువుటచేతనే మనుష్యుడు తాను పాపవిముక్తుడగుననియు దేవతలు త్రాసునం దొకప్రక్క భారతమును మరియొకప్రక్క నాలుగు వేదములనుంచి తూచినప్పుడు భారతమే యెక్కువ బరువైయుండెననియు వ్రాయుచున్నారుగాని భారతములో కొన్ని యసందర్భములను బట్టి యాలోచించినట్లయిన ఇట్టి విషయములను నమ్ముట కష్టము.

ఉదారగుణ సంపన్నులగు పాండవులను ప్రస్తుతకాలమున దేవతాపురుషులని యెంచుచున్నారు, గాని దివ్యగుణసంపూర్ణుడగు యేసుప్రభువుతో వీరిని పోల్చి చూచితిమా, వీరియందలి దోషములు వెల్లడియగును. ఒక స్త్రీ యనేక పురుషులను బెండ్లాడుట వీరిలో నాచారమైయుండెను. ధర్మమూర్తియు, పరాక్రమశాలియునగు యుధిష్ఠిరుడు జూదమాడెను, అసత్యమాడెను, ఇట్టి కళంకములను గలిగియుండెను. యుద్ధవీరుడును, క్షమించు స్వభావముగలవాడును, కరుణాహృదయుడు నగు అర్జునుడు కృష్ణుని చెల్లెలగు సుభద్రను ఇంద్రప్రస్థమునకు బలాత్కారముగ దోడుకొని పోయెను. తోడేలికడుపుతో సమానమైన పెద్ద కడుపును విపరీత తిండి పుష్టియు గలిగియుండుటచే భీముడు వృకోదరుడను నామమును, ఏనుగుబలమును విశేషధైర్యమును, క్రౌర్యమును గలిగియుండుటచే భీకరుడను నామమును ధరించియుండెను. ఇతడు దుశ్శాసనుని చంపి యతని శిరస్సును నరికివేసి, రొమ్మునుజీల్చి వేడిరక్తమును బానముచేసినందున, ఇతడు రాక్షసుడై యుండవలెనని కొందరు తలంచిరి. ఇతడు కీచకుని చంపినప్పుడు నాట్యమందిర ద్వారపాలకులతో కీచకుని వధించినవాడు గంధర్వరుడగు తన భర్త యని ద్రౌపది యసత్యమాడెను.

సమస్త మతాచారములును, సర్వకర్మలును, నిరర్థకములనియు, సత్యమే యుత్తమ ధర్మమనియు, అబద్ధమాడుట ఘోరపాపమనియు భారతమే బోధించుచున్నది. ఇటువంటి ధర్మోపదేశము భారతమందు గనపడుచున్నను, స్త్రీలవిషయమునను, వివాహసంబంధము తేర్పరుచుటయందును, ప్రాణమునకు, ధనమునకు, గౌరవమునకు, భంగము కలుగునప్పుడును, గోవులను, బ్రాహ్మణులను గాపాడుటకును బొంకవచ్చునని యీ గ్రంథమే చెప్పుచుండుట యాశ్చర్యముకాదా? ఈ పురాణములో నొక బ్రాహ్మ

ణుడు తనచేతజిక్కిన శత్రువుయెడల నెంతమాత్రమును దయచూపక అతనిని చంప దగునని యుపదేశించెను. ఒకడు తన పాపములనుగూర్చి పశ్చాత్తాపము లేనివాడై నను తాను చేయు యజ్ఞాదికర్మలవలనను, మంత్రోచ్చారణవలనను, దేవతలవలన వర ములనొందవచ్చుననికూడ నీ పురాణము చెప్పుచున్నది.

VII. COMPARISON BETWEEN KRISHNA AND CHRIST. కృష్ణునికిని క్రీస్తునకునుగల తారతమ్యములు.—హిందువులు పలుమారు కృష్ణుని క్రీస్తుతోపోల్చి, వీరిరువురును నొకరేయని రుజువుపరుపజూతురు. కావున ఈ విషయమును విమర్శించుటకు నీ యిద్దరు పురుషులనుగూర్చిన యీ క్రింది యంశములను చర్చింతము—అనగా వీరి నామములు, జీవచరిత్రలు, ఉపదేశములు, గుణవిశేషములు, వీరి యవతారములయొక్క యుద్దేశములు.

1. Their Names. వీరి నామములు.—కృష్ణుడు అనగా నల్లనివాడు, లేక యాకర్షించువాడు. యేసుక్రీస్తు అనగా అభిషిక్తుడగు రక్షకుడు.

2. Their Histories. వీరి జీవితచరిత్రలు.—కృష్ణునిగురించిన కథలు భాగ వతపురాణము దశమస్కంధమందు అనగా ప్రేమసాగరమందు గలవు. వీటిలో కొన్ని మిగుల అసహ్యాకరమైనవి.

ఇట్టి దుశ్చరితుడగు కృష్ణుడు ఎక్కడ? పరిశుద్ధాత్మ ప్రభావముచేత నొక కన్య కకు జన్మించి కేవలము పాపరహితుడుగా జీవించిన యేసుప్రభువు ఎక్కడ? ఈ ప్రభువు సదా మేలుచేయుచును, రోగులను స్వస్థపరచుచును, బీదలకు సహాయము చేయుచును, పరలోకపితనుగూర్చియు, పాపక్షమాపణనుగూర్చియు, నిత్యజీవమును గూర్చియు జనులకు బోధించుచును సంచారము చేయుచుండెను. చివరకు ఆయన జనులందరి రక్షణార్థము సిలువపై తన ప్రాణము నర్పించి మూడవదినమున మరల సజీవుడై లేచి పరలోకమునకు వెళ్లిపోయెను.

3. Their Teachings. వీరుచేసిన యుపదేశములు.—భగవద్గీతలో కృష్ణుడు ఈ క్రిందివిధమున బోధించుచున్నాడు. ఒకడు తన బంధువులను జంపుట పాపము కాదు. నిష్కామబుద్ధితో ననగా కోరికలేకుండ నొక డెట్టికార్యములు చేసినను అతనిని పాపములంటుకొనవు గనుక ఇట్టి భావముతో సకలకార్యములు చేయవలెను. దీనినిబట్టి పాపపుణ్యములు సమానములగునుగదా? పాపక్షమాపణ, ఆత్మశుద్ధియను వాటివలనగాక కృష్ణుని నామోచ్చారణమువలననే మోక్షముకలుగును. కృష్ణుడు సర్వం బ్రహ్మమయమను సిద్ధాంతము సత్యమే యని యొప్పుకొనెను. నీతివిధుల నతిక్రమించినను కులధర్మములమాత్రము విడిచివేయకుండిన చాలును. జ్ఞానమే ముక్తిసాధనము. జ్ఞానమే సర్వకల్మషరహితునిగను, పరమపవిత్రునిగను జేయగలదు. మరియు ఐదు సందర్భములలో అసత్యమాడవచ్చునని బోధించెను.

క్రీస్తు సర్వదా పరలోకపితనుగూర్చియు, ఆయనకు పాపాత్ములందుగల ప్రేమనుగూర్చియు, పాపపశ్చాత్తాపమునుగూర్చియు, నూతనజన్మమునుగూర్చియు, పాపక్షమాపణనుగూర్చియు, పవిత్రజీవితమునుగూర్చియు, ప్రేమ, సేవ, త్యాగము

అనువాటినిగూర్చియు, సిలువమీద తన ప్రాణమర్పించుటద్వారా సకల మానవులకు రక్షణ కలుగుటనుగూర్చియు బోధించెను.

4. Their Characters. వీరి గుణభేదములు.—కృష్ణుడు దొంగిలించుట, అబద్ధమాడుట, వ్యభిచరించుట, హత్యచేయుట అను పాపములు చేసెను. "ఏ మానవుడును చేయలేని యిన్ని దుష్కార్యములుచేసిన కృష్ణుడు దేవుడుగాక మరియెవడు? అని యొక సామితె చెప్పుచున్నది. దేవుని యిష్టానుసారముగ మానవజీవిత విధాన మెట్లుండవలెనో యది లోకమునకు జూపించిన యవతారపురుషుడు యేసుప్రభువు ఒక్కడే. ఆయన సర్వకాలములయందు సంపూర్ణ సత్యసంధుడును, సంపూర్ణ పవిత్రుడును, సంపూర్ణ స్వార్థపరిత్యాగియు, సంపూర్ణ ప్రేమగలవాడునై యుండెను. దేవుడెటువంటి గుణలక్షణములు గలవాడని మనము తెలిసికొనగోరినయెడల, ఆయన యేసుప్రభువువంటివాడని చెప్పుటకన్న మరియెక్కువగా నేమిచెప్పగలము?

5. The Purpose of Their Respective Incarnations. ఈ యిద్దరు నెట్టి యుద్దేశములతో నవతరించిరి.—లోకమున ధర్మము క్షీణించినప్పుడు దుష్టులను నశింపజేసి ధర్మమును స్థాపించుటకు కృష్ణుడవతరించును గాని దుర్మార్గవర్తనులగు పాపాత్ములను వెదకి కనుగొని వారి పాపప్రాయశ్చిత్తార్థము తన ప్రాణాదానముచేసి వారిని రక్షించుటకే యేసుప్రభువు అవతరించెను.

## VIII. CHRISTIAN AND HINDU INCARNATIONS CONTRASTED. క్రీస్తుయొక్క సత్యావతారమునకును విష్ణువుయొక్క యవతారములకును గల వ్యత్యాసములు.

(*a*) యేసుప్రభువు సర్వవిషయములందు సామాన్యమానవునివంటివాడే యని యోహాను 1: 14; ఫిలిప్పీ 2: 5—8 వచనములనుబట్టియు, ఆయనయొక్క సిలువ మరణమునుబట్టి కేవలము మానవస్వభావముగల సంపూర్ణ నరుడనియు మనకు విశదము కాగలదు. ఒక రాజుగాని, ధర్మబుద్ధిగల యొక కోటీశ్వరుడుగాని బీదలయొక్కయు, దుష్టనరులయొక్కయు స్థితిగతులు కన్నులారచూచి, వారికి వలసిన సహాయముచేయు సదుద్దేశముతో నొక మారువేషము ధరించి తిరుగుచుండగా, తన నిజస్థితి నెరుగక యొక కిరాతకుడు కత్తిదూసి చంపుటకు తనమీదికి వేగముగా వచ్చుట చూచినప్పుడు తటాలున ముసుగుతీసి, తన నిజరూపముజూపి, వానిని బెదరించి తన ప్రాణరక్షణ చేసికొనవచ్చునుగదా? కాని యేసుప్రభువు పాపనరులను రక్షింప సంకల్పించి నరావతారము ధరించియుండగా, తనను ఘోరముగ సిలువవేసి చంపుసమయమున తప్పించుకొనుటకు తన దివ్యరూపము తన శత్రువులకు చూపక, సంతోషపూర్వకముగ తన ప్రాణములు పాపప్రాయశ్చిత్తార్థము ధారపోసెను సుమండీ. మాయాసిద్ధాంతము ప్రకారము బ్రహ్మయొక్కడే సత్యపదార్థము. తక్కినదంతయు మాయయే. సగుణుడగు ప్రతి దేవుడును మాయాస్వరూపియు, అసత్యమూర్తియు నగుటచే అట్టి దేవుని ప్రతి యవతారమును మాయ వేషముగానే యుండవలెను. అవతారము మాయాస్వరూపియగు సగుణమూర్తియొక్క మాయాప్రతిబింబమైయే యుండవలెనుగదా.

(b) యేసుప్రభువుయొక్క యవతారము విష్ణువుయొక్క యవతారములవలె ఈ లోకములో అంతమొందలేదు. ఆయన శాశ్వతుడు, నేడు, రేపు, ఎల్లప్పుడును, సత్యస్వరూపియై, సంపూర్ణ నరరూపమునే ధరించియుండును. విష్ణువుయొక్క యవతారములైతే తాత్కాలికములేయైనందున ఈ యవతారపురుషులు చేయవచ్చిన కార్యము ముగిసినపిమ్మట చనిపోయిరి.

(c) ఫిలిప్పీ 2: 5—11; కొలొస్సై 2: 9 లలో చెప్పియుండునట్లు యేసుప్రభువైతే దేవునియొక్క పరిపూర్ణ స్వరూపముగలవాడు. అవతారములలో జంతు రూపములన్నియు విష్ణువుయొక్క స్వల్పాంశముమాత్రమే కలవి. పరశురాముడు దేవుని కొంత యంశముతోమాత్రమే పుట్టియుండెను. విష్ణునియొక్క సంపూర్ణ యంశములో నర్థభాగము రామునిలోను, తక్కిన సగము అతని తమ్ములలోనుండెను. కృష్ణుడు పరబ్రహ్మయొక్క అంశాంశమని విష్ణుపురాణము 5: 1 చెప్పుచున్నది. ఈ గ్రంథమే కలికావతారమున విష్ణువుయొక్క తేజస్సులో నొక భాగముమాత్రము భూలోకమున నవతరించునని చెప్పుచున్నది. ఈ విషయములన్నియు దేవుడు అఖండుడు అను సిద్ధాంతమునకు విరుద్ధములై యున్నవికాదా?

(d) యేసుప్రభువే దేవునియొక్క సంపూర్ణ ప్రత్యక్షరూపము. దేవుడే స్వయముగ తన నిజరూపమును పరిపూర్ణముగ ప్రత్యక్షము చేయగలడు. యేసు ప్రభువు తాను దేవుని రాజ్యమును స్థాపించువాడననియు, రాజననియు, నీతిచట్టములను విధించువాడననియు, పాపరహితుడననియు, ఇప్పుడును యుగాంతమునందును, మానవులకందరికిని న్యాయాధికారిననియు, పాపవిమోచకుడననియు, నిత్యజీవము నను గ్రహించువాడననియు, యోహాను 11: 25; ప్రకటన 1: 18 లలో నున్నట్లు మరణ నరకములను వశపరచుకొన్నవాడననియు, రాబోవుకాలమున తన సంఘమునకు గతి తానేయనియు, సృష్టియంతటిమీద నధికారముగలవాడననియు, దేవుని అద్వితీయ కుమారుడననియు, తాను సాక్షాత్తుగ దేవుడననియు, ఈ యంశములన్నియు పరిపూర్ణముగ నెరిగియుండెను.. ఆయన తన దివ్య స్వభావమునకుగాని తాను చేసిన యుపదేశములకుగాని విరుద్ధముగ నడిచియుండలేదు. విపరీతముగ బోధించియుండలేదు. తాను దేవుడనని చెప్పుకొనిన యే యితర మానవునిగూర్చియైనను నిట్లు చెప్పగలమా? ఇంతేగాక దివ్యప్రేమయు, అపారకృపయు, ధైర్యస్థైర్యములును, నిర్భయముగ ధర్మమును బరిపాలించుటయు, సంపూర్ణ త్రికరణశుద్ధియు, పరిపూర్ణ నీతి, ఇవి యీ మహాపురుషునియందెంత చక్కగ బ్రకాశించెనో చూడుడి. దేవుడు యేసుప్రభువు వంటివాడని చెప్పుటకన్న భగవంతుని స్వభావగుణలక్షణాదులనుగూర్చి యింతకంటె

విస్తరించి చెప్పజాలను సుమండి. యేసుక్రీస్తు ప్రభువునుగురించి వర్ణింపగలదాని కంటె నెక్కువగా దేవునిగురించి వర్ణించుట సాధ్యము కాదు. ప్రభువునందే పర మాత్మయొక్క యుత్కృష్టగుణములన్నియును ప్రతిఫలించుచున్నవి. పరిశుద్ధేశ్వరుని స్వభావమునకు విరుద్ధమగు గుణములు క్రీస్తునందు కనుపించనే కనుపించవు.

(e) యేసుక్రీస్తు అవతారయుద్దేశము తన శ్రమలద్వారా మానవులను రక్షించవలెననియే. క్రీస్తుప్రభువు తన సిలువ మరణముద్వారా దేవుడు ప్రేమాస్వరూపి యని లోకమునకు నూతనముగ బ్రకటించెను. ఆయన మరణమునకు బూర్వము దేవుడు సర్వశక్తుడనియు, సర్వవ్యాపియనియు, అనంతుడనియు, నిర్వికారుడనియు మానవులు భావించెడివారు. కాని సిలువమీద తన ప్రాణము ధారపోసిన యేసు ప్రభువు సాక్షాత్తుగ దేవుడే యని వాదించుటకు ఆయన చూపిన ప్రేమయు, ఆయన దీనత్వము, విమోచనాశక్తియు ప్రబలహేతువులై యున్నవి. కనుక ఈ మూడును దేవునియొక్క ప్రాముఖ్యగుణములని యిప్పుడు లోకమునకు విశద మయ్యెను. శాశ్వతముగ బ్రకాశించుచుండు దేవుని దివ్యగుణములలోనెల్ల నుత్కృష్టమైనది పాపవిమోచన చేయునట్టి ప్రేమయే. పాపాత్ములను రక్షించి, పరమపవిత్రులుగజేసి, వారిని ధర్మస్వరూపుడగు పరిశుద్ధేశ్వరుని సన్నిధిని చేర్చుటకే క్రీస్తు ప్రభువు భూలోకమున నవతరించెను. కావున యేసుక్రీస్తు ప్రభువుయొక్క యవతారమునకు నీతియు, ప్రేమయు ప్రాధానములైయున్నవి.

విష్ణువుయొక్క యవతారములలో నమానుషశక్తియు, బలపరాక్రమములును కనబడుచున్నవి. కాని దేవునియొక్క ప్రాముఖ్యగుణములగు పరిశుద్ధత, ప్రేమ, కృప, దీనత్వము అనునవి యీ యవతారములలో ప్రసిద్ధములుగ కాన్పించవు. మానవుల రక్షణార్థమైన శ్రమ హిందూ అవతారములలో నొకదాని యుద్దేశమును గాదు. దేవుడు స్వయముగ తన్నుతాను ప్రత్యక్షపరచుకొనశక్తిగలిగియుండగా, అల్పజంతువులెట్లు ఆయన దివ్యగుణములనుప్రకటించగలవు? పరమపావనుడగు దేవుని పరిశుద్ధులు కాని యవతారపురుషులెట్లు ప్రత్యక్షపరుపగలరు.

హిందువుల దృష్టికి ధర్మాధర్మములు మాయాస్వరూపములే గాని సత్యములు కావు. కాబట్టి భగవద్గీత 4: 36 లో చెప్పియున్నట్లు మోక్షమునొందగోరువాడు అధర్మముతోబాటు ధర్మమునుకూడ విసర్జించవలెను. అనగా పరిపూర్ణసిద్ధునకు ధర్మాధర్మచింత యుండ నక్కరయేలేదు. కాని క్రైస్తవునిదృష్టికి దేవుడు నీతిస్వరూపుడును పవిత్రమూర్తియునై యున్నాడు. అనగా ధర్మాధర్మములు మాయగాక శాశ్వతముగ నుండునట్టివే.

నీతిచట్టములు మానవలోకమునకుమాత్రమే నిర్ణీతములై యుండినవని వాదించెదరా? అట్లయితే ఈ లోకమున పుట్టెడు ప్రతి నరుడును ఈ నీతివిధులకు లోబడి యుండితీరవలెను. మనమధ్య నవతరించిన దేవుడు మానవ నీతిచట్టములను పాటింపకుండినయెడల, అతడు మనలో నొక సత్పురుషునికంటెను నధముడైయుండును. యేసుప్రభువు దేవునియొక్క అవతారమైయుండినను, తానుకూడ నీతివిధులను పరిపూర్ణముగ ననుసరింప బద్ధుడనని యెరిగియుండినట్లు మత్తయి 3: 15 వచనము చూచిన మనకు విశదము కాగలదు.

(*f*) తన అపారప్రేమచే ప్రేరేపింపబడి, స్వేచ్ఛాపూర్వకముగా యేసుప్రభువు ఒనరించిన మహోత్తరమగు కార్యము, మానవులను, పాపవిముక్తులగావించి, శాశ్వతముగ మోక్షరాజ్యవాసులుగ జేయుటకై సిలువమీద తన పుణ్యప్రాణము ధారపోయుటయే; కాని శాపవశముచే, విష్ణువు రాక్షసులను సంహరించి, ధర్మము స్థాపించుటకే భూలోకమున నవతరించినను, ఒక యవతారములో దుర్మార్గులను అధర్మమార్గమునకే పురికొల్పెను. అదియుగాక విష్ణువు యేసుప్రభువువలె సర్వలోకమును రక్షించుటకుగాక హిందూదేశమందుననో లేక ఒక చిన్నప్రదేశమందుననో యున్నవారినిమాత్రమే రాక్షసులనుండి రక్షించుటకు నవతరించినాడు. అధర్మమును నాశనముచేసి ధర్మమును స్థాపించుటకు కృష్ణుడవతరించినట్లు భగవద్గీత 4: 7 చెప్పుచున్నది. అయినను ఈ యవతారపురుషులు తమ ప్రభావమువలన హైందవులు నానాటికి హీనస్థితికిరాకుండ చేయజాలరైరి. అనగా అధర్మవృద్ధికాకుండ చేయలేకపోయిరి, ఇందుకు గారణము ఈ యవతారమూర్తులందరును మానవుల పాపమునకు దాసులు కాకుండ తప్పించుకొనుమార్గము వారికి కనుపరప సమర్థులు కాకపోవుటయే.

(*g*) యేసుక్రీస్తుప్రభువు లోకములోని సకల పాపబీజములను నిర్మూలముచేసి, ధర్మపరిపాలన చేయుటకు మరల రాబోవుచున్నాడు. ఇకమీదట రాబోవు నిష్కళంకమగు కలికావతారమునకును యేసుప్రభువుయొక్క సత్యావతారమునకును కొంతమట్టుకు పోలికయున్నదని చెప్పవచ్చును.

## IX. CRITICISM OF IDOLATRY. విగ్రహారాధన ఖండనలు.

1. నిరాకారుడగు పరబ్రహ్మమునకును, సాకారుడగు మానవునకును పరస్పర సంబంధము గలిగించుటయే సర్వమతములవారియొక్క ముఖ్యోద్దేశమైయున్నది. కాని పరమాత్మ నిర్గుణుడైనందున, సాకారదేవతారాధన లేనిది యట్టి సంబంధముకలిగి యుండుట యసాధ్యము. సగుణులగు దేవతలందరు నిర్గుణపరబ్రహ్మముయొక్క

యంశారూపములే యగుటచే, వారిని నారాధించుట, నిర్గుణమూర్తిని నారాధించుటకు ద్రోవచూపగలదని హిందువులు వాదించెదరు.

(*a*) ఇట్టి వాదములకు క్రైస్తవుడుచేయు ప్రతివాదము లేవనగా:—పరమాత్మ సర్వజ్ఞుడును, సర్వశక్తిమంతుడును, పరిశుద్ధుడును, ప్రేమాస్వరూపియు నగుటచే ఆయన సగుణుడేగాని నిర్గుణుడు కాజాలడు.

(*b*) పిల్లలు తమ తల్లిదండ్రుల స్వభావగుణవిశేషములను పొందునట్లు, నిర్గుణ బ్రహ్మయొక్కయు, నిర్గుణ మూలప్రకృతియొక్కయు పరస్పర సంయోగమువలన బుట్టిన దేవతలుకూడ తమ తల్లిదండ్రులవలె నిర్గుణులైయుండవలెను.

(*c*) ఈ దేవతలు సగుణుడును, నిత్యుడును, నిర్వికారుడునగు భగవంతునిలో నుండి పుట్టినవారేయైనపక్షమున వీరి స్థితిగతులనుగూర్చియు, గుణములనుగూర్చియు వేరువేరు హిందూమతగ్రంథములలో వేరువేరువిధములుగ నుండుట యేల? మరియు దేవతలందరు నిత్యుడును, నిర్వికారుడునగు నొకే దేవునిలోనుండి వచ్చినయెడల, వీరందరి గుణము లొకేరీతిగ నుండవలెనుగదా. నరమాత్రులగు తల్లిదండ్రుల ప్రధాన గుణములకు భిన్నభిన్న కాలములలో భేదములు కలుగవచ్చును. కావున, ఆయా కాలములలో వారికి గలిగిన బిడ్డల గుణములలో భేదములుండవచ్చును. కాని దేవుడైతే నిర్వికారుడగుటచే దేవతలుకూడ మార్పులేనివారైయుండవలెను.

2. హిందువులు తమ దేవతలు దేవుడు నియమించిన లోకపాలకులనిగాని దేవునికిని మానవునకును మధ్యవర్తులనిగాని చెప్పుదురు. కావున ప్రజలు తమకు రాజుతోగల వ్యవహారములతని ప్రతినిధులద్వార జరుపుకొనునట్లే, నరులుకూడ దేవుని బాధపెట్టక దివ్యశక్తులు గల ఈ దేవతలద్వార తమ కోరికల నెరవేర్చుకొనవచ్చుననియు, ఆ కారణముచే విగ్రహారాధన మగత్యమనియు మరియొక హేతువు చెప్పుదురు.

ఈ విషయమై క్రైస్తవుడుచేయు ఖండన లేవనగా:—

(*a*) మధ్యవర్తి యవసరమేగాని మహాపవిత్రుడగు దేవునిసన్నిధికి పాపాత్ములను దోడుకొనిపోవు మధ్యవర్తి తానును పరిశుద్ధుడును, అనంత శక్తిమంతుడును, ధర్మమూర్తియు, మహాత్మ్యముగలవాడును, సమర్థుడునునై యుండవలెనని అందరు నెరిగిన విషయమేగదా.

(*b*) దేవుడు నరమాత్రుడగు రాజువలెగాక సర్వవ్యాపియు, సర్వశక్తుడును, ప్రేమాస్వరూపియునై యుండుటచే మనమాయనయొద్దకు బోవుటకు ప్రతినిధులతో గాని మధ్యవర్తులతోగాని పనిలేదు.

(c) ఉద్యోగస్థులును, మధ్యవర్తులును తరుచుగా నన్యాయకారులు క్రూరులునైయుందురు. కనుక మనము సర్వకాలములయందును సులువుగా సమీపింపగల రాజుతో ముఖాముఖిగా మన కార్యములు జరిగించుకొనుట యుక్తముకాదా?

(d) దేవుడు మనకు తండ్రి, గనుక తన పిల్లలు మధ్యవర్తుల నవసరములేకయే తనయొద్దకు చనువుగావచ్చుట చూచి, యెంతో సంతోషించును సుమండి.

(e) రాజప్రతినిధి తనకు ప్రజలు భక్తిపూర్వకముగ జేసిన సేవనుగూర్చి రాజుతో జెప్పగలడు గాని మధ్యవర్తులగు రాతివిగ్రహములలో నేదైన దేవునితో నిట్టి సంగతులనుగురించి తెలుపజాలునా?

3. విగ్రహములు దేవుని ప్రతిబింబములని హిందువులు వాదింతురు. ఇందుకు క్రైస్తవుడు ఈ క్రిందివిధమున జవాబియ్యవచ్చును.

(a) దేవుని ప్రతిరూపములగు విగ్రహములు దేవుని తత్వమునుగాని, గుణాతిశయములనుగాని చూపలేవు. అవి కేవలము మాయాస్వరూపములును, దేవుని ప్రతిబింబములగుటకు నయోగ్యములునైయున్నవి. ప్రతి దేవతయు ప్రత్యేక గుణలక్షణాదులు గలిగియుండుటచే, అట్టి దేవతయొక్క ప్రతిరూపమగు విగ్రహము మన హృదయములో దేవుని స్వభావమునకు విరుద్ధములగు భావములను బుట్టించును. కృష్ణవిగ్రహమును చూచినప్పుడు దొంగతనము, వ్యభిచారము, నరహత్య యనునవి మనకు జ్ఞాపకమువచ్చుట సహజమేగదా? ద్రౌపదియొక్క విగ్రహము చూచినప్పుడు అనేక భర్తలను కలిగియుండుటయు, భీమువిగ్రహమును చూచినప్పుడు అతని భయంకరాకారము, ధైర్యము స్మరణకు రాకుండునా? కాళీవిగ్రహము, ఆ దేవతయొక్క రౌద్రమును, రక్తమందలి ప్రీతిని ప్రకటించుచునేయుండును. శివునియొక్క లింగమును, పానవట్టమును అతని దుర్నడతకు సంభవించిన శాపమును తలంపుకు తేక మానవు.

(b) విగ్రహములు దేవునిగుణములలో దేనిని మనకు తెలుపజాలవు. ఒకనికి నక్కను జూపి, అది యేనుగనినయెడల, మనకు పిచ్చిపట్టినదని తలంపడా? పిల్లలకు జంతువుల బొమ్మలనుజూపి, వాటి లక్షణములను కొంతవరకు గ్రహింపుచేయగలము. దూరదేశమందున్న మన బంధువుల ఛాయాపటములను జూచి, వారిట్టివారని జ్ఞాపకముచేసికొందుము. మన ఛాయాపటములు మనలను కొంతవరకు పోలియుండును. అయితే విపరీతరూపములు గలిగి నిర్జీవములు, అనిత్యములు నగు విగ్రహములు నిత్యుడును, పరిశుద్ధుడును, స్వయంభువును, ఆత్మస్వరూపియు అనంతుడు నగు దేవుని పోలియుండునా?

(c) పామరజనులందరును విగ్రహములు నిజముగ దేవతలనియే భావింతురు. కాని యవి వట్టి ఛాయారూపములే యని యెరుగరు.

(d) సాక్షాత్తుగ ఈ విగ్రహములు దేవుని ప్రతిబింబములేయైనయెడల, మనుష్యులు కల్పించి, నాశనముచేయగల యీ రాతిదేవతలను జూచినప్పుడు, దేవుని యొక్క యే యుత్కృష్టగుణములు మనకు తేటగా బోధపడగలవు?

(e) ఒక కుమారుడు తన తండ్రికి బదులుగా నొక వ్యంగరూపముగల బొమ్మను తనయెదుట పెట్టుకొన్నయెడల, దానివలన తండ్రి నెంతమట్టుకు జ్ఞాపకము చేసికొనగలడు? ఆ బొమ్మ అతనిలో తండ్రినిగూర్చి విపరీతభావములు పుట్టించకుండునా? అట్లే విగ్రహములవలన దేవునిగూర్చి తప్పు అభిప్రాయములేగాక మరి యే గంభీరభావములు మనకు కలుగగలవు?

(f) తండ్రీయని తన కుమారుడు తన్ను పిలిచినప్పుడు, అతడు సంతోషించునుగాని యా చిన్నవాడు తన్ను గాడిదాయని పిలిచినయెడల, అతనికి కోపము రాకుండునా? అట్లే మనము యుక్తమగు నామములతో దేవుని పిలిచితిమా, ఆయన సంతోషించునుగాని ఆయనకంటె తక్కువస్థితిలోనున్న దేవతల పేర్లతో బిలిచినట్లయిన, ఆయన కోపించడా? కనుక మనమాయన నెట్టినామముతో పిలువవలెనో జాగ్రత్తగ నాలోచింపవలెను.

4. మానసికారాధనకు ద్రోవచూపుటకు విగ్రహపూజ మొదటిమెట్టని హిందువులు తలంచెదరు. ఈ విషయమై క్రైస్తవుల యాక్షేపణలేవనగా:—

(a) ఇది కేవల మనుభవవిరుద్ధమైనది. ఎట్లనగా విగ్రహారాధనకు లెప్పటికిని తమ విగ్రహములనే నమ్ముకొనియుండుటచే, వాటికంటె పైస్థితికి రాజాలరు. వారికి దేవునివిషయమై యథార్థజ్ఞాన మెన్నటికిని లభింపదు.

(b) విగ్రహపూజవలన నొకడు దానికంటె నత్యుత్తమమగు మానసికారాధనము చేయగల స్థితికి వచ్చుటకు బదులుగా క్రమక్రమముగా మరింత యజ్ఞానములో మునిగి, దేవుని భయములేనివాడై దుష్టకార్యములు చేయుచుండును. హిందువులిప్పటికి మూడువేల సంవత్సరములనుండి విగ్రహారాధన చేయుచుండినను మరింత యున్నతదశకు వచ్చుటకు బదులుగా అంతకంతకు క్షీణస్థితికి వచ్చుచునే యున్నారని చరిత్రలవలన తెలియగలదు.

(c) హిందువులు తమ యారాధనకు విగ్రహములవసరములని చెప్పుటచే, తాము విగ్రహారాధకులుగాని కోట్లకొలది క్రైస్తవులకంటెను, మహమ్మదీయులకంటెను మందబుద్ధిగలవారమని యొప్పుకొనునట్లే యగును. కాని హిందువులు సహజముగా మిగుల బుద్ధిశాలురని మనమందర మెరిగినవిషయమే.

5. దేవుడు సర్వాంతర్యామి గనుక ఆయన విగ్రహములలోమాత్ర ముండక పోవునాయని భ్రమించుచు, విగ్రహపూజ తప్పుకాదని మతాచార్యులుపదేశింతురు. క్రైస్తవుడీ యుపదేశము నంగీకరింపకుండుటకు గారణములేవనగా:—

(*a*) ఒక రాయి శీతోష్ణగుణములు కలిగియున్నను, ఆ రాయియే శీతమని గాని యుష్ణమనిగాని యెవడును చెప్పలేడు. అట్లే యొకవేళ దేవుడు విగ్రహ మందున్నాడనుకొనినను, విగ్రహమే దేవుడైయుండుట యసంభవము.

(*b*) దేవుడు సర్వవ్యాపియేయైనయెడల, నిర్జీవ విగ్రహమునకు జీవముపోయు టకు ప్రాణప్రతిష్ఠచేయుటేల?

(*c*) దేవుడాత్మస్వరూపియు, సర్వాంతరాత్మయునై యున్నాడు గనుక మనము విగ్రహములక్కరలేకయే యాత్మాభివృద్ధికి దోడుపడు మానసికారాధనము సాధింప వచ్చును. సగుణుడును, సులభముగ నందువాడునునగు దేవుని దర్శనము చేయ కోరెడు మానవుల హృదయాభిలాషను తీర్చుటకైయే, దేవుడు, యేసుప్రభువు నామ మున మన భూలోకమందు నవతరించి ముప్పదిమూడేండ్లకాలము జీవించియుండెను. ఆయనయందు నగోచరుడును, పరిశుద్ధుడును, ప్రేమాస్వరూపియునగు దేవునియొక్క దివ్యలక్షణములన్నియు మనము చూడవచ్చును. ఈ యంశములనుగూర్చి యోహాను 12: 44, 45; 14: 9, 10; కొలొస్సై 1: 15; హెబ్రీ 1: 3 చూడుము.

6. దేవుడంతటను నిండియుండుటచే మనము దేనిని కొలిచినను, దేవుని కొలిచినట్లేయగును, గనుక మన పూజలన్నియు, ఆయనకే చెందును గావున ఆయనే మన కోరికలన్నియు నెరవేర్పగలడని హిందువులు చెప్పుదురు. ఇందుకు క్రైస్తవుడు చెప్పు సమాధానమేమనగా:—

(*a*) మనము విగ్రహముల నారాధించుచుంటిమేని దేవుడు మనకు నెట్లు ప్రతిఫలితమీయగలడు? మనము కొలిచెడి యజమానులేగదా మనకు నుపకారము చేయవలెను.

(*b*) రాజును సేవింపక తిరస్కరించిన రాజద్రోహిగతి యేమగును? రాజతని జంపివేయించునుగదా? అట్లే విగ్రహారాధకులు దైవద్రోహులగుటవలన రారాజగు దేవుడుకూడ వారికి అట్టిశిక్షయే విధించును సుమండి.

(*c*) ఎవని కుమారుడైనను తన తండ్రియొద్దనుండి పారిపోయి, మరియొకని యొద్ద చేరి, అతనిని తండ్రిగా భావించినచో, ఆ చిన్నవాని తండ్రి యేమిచేయును? అట్లే పరమపితయగు దేవుడు తన్ను నిరసనచేసి విగ్రహముల నాశ్రయించువారి నేమి చేయునో యోచింపుడు.

(*d*) ఎవని భార్యయైనను దన చీరెలు, నగలు మొదలైనవి తీసికొని, తన పెనిమిటిని విడిచిపెట్టి, మరియొక పురుషునితో సాంగత్యముచేయ నారంభించి నప్పుడు, ఆమె భర్త యట్టి స్త్రీని యేమిచేయును? కావున మనలను బుట్టించి, మన యక్కరలను దీర్చి మనలను పాలించుచుండు దేవుని విడిచి, అన్యదేవతల యండజేరుట యెట్టికార్యమో యాలోచింపుడు.

## X. CRITICISM OF PANTHEISM. వేదాంత సిద్ధాంత ఖండనము.

1. ఈ సిద్ధాంతము దేవుడు గుణరహితుడనుచున్నది. కాని గుణములుగల జీవులను బుట్టించినవాడు తానుకూడ గుణములు గలిగియుండవలెను గావున నిర్జీవమగు జడపదార్థము వివేకజ్ఞానముగల జీవులకు హేతువై యుండజాలదుగదా.

2. ధర్మాధర్మ గుణభేదము లనిత్యములు గనుక సుగుణ దుర్గుణములు పరబ్రహ్మమును బంధించలేవు. కావున పుణ్యమువలెనే పాపముకూడ బ్రహ్మముయొక్క కార్యమై యుండవలెను. ఇట్టి భావము ధర్మబుద్ధిని, మనసాక్షిని, నాశనము చేయుటచే మానవుడు దేనికి నుత్తరవాది కాజాలడు.

3. ఈ సిద్ధాంతము ప్రకృతితోబాటు మానవునియొక్క యనుభవజ్ఞానము కూడ మాయ యని బోధించును. యింద్రియములవలన లభించు జ్ఞానము సత్యము కాదనును. ప్రకృతిశాస్త్రజ్ఞానమును, బుద్ధి సంపదయు వేదాంతిదృష్టికి గడ్డి పరకలవంటివి; గాని ఇట్టి సిద్ధాంతము లోకానుభవమునకు విరుద్ధమైయుండును.

4. ఈ సిద్ధాంతమునకు బ్రహ్మముతప్ప మరేదియును సత్యముకాదను సూత్రము మూలపునాదిగ నున్నది. ఈ సంగతి యెట్టి రుజువులకు నందని పట్టిభ్రమ. ఏల ననగా లోకములో ననేకులు ఎండమావులవంటి మాయాస్వరూపములను జూచి నప్పుడు, అవి వారి దృష్టికి సత్యములుగనే తోచుచుండును. ముక్తినిచ్చు బ్రహ్మమునుగూర్చిన జ్ఞానముగల మనుష్యుని మనస్సును, ఆ పరబ్రహ్మమును భిన్నములై యుండుట నిశ్చయముగ ద్వైతమే.

5. వేదాంతులు ధ్యానమునకు నందరాని బ్రహ్మస్వరూపమును జూపుచున్నారు. ఈ బ్రహ్మము కేవలము జడపదార్థమువంటివాడు. బ్రహ్మస్వరూపము ఫలానిగుణములుగలదని చెప్పుటకు బదులుగా నేతి, నేతి యనగా ఫలానిగుణములు లేనిది యనియే వర్ణింపవలెను. జీవాత్మ నిజముగా బ్రహ్మమేయై యుండినపక్షమున బ్రహ్మము నారాధించుట తన్నుతానే యారాధించుకొనుటయై యుండునుగదా? ఒకవేళ సగుణబ్రహ్మను నారాధింప యత్నించునా, అదికూడ వ్యర్థప్రయాసమే.

ఎట్లనగా సగుణబ్రహ్మయు మాయాస్వరూపమే. నిర్గుణబ్రహ్మము లోకముతో సంబంధములేనివాడు కావున నతడు మనకెట్టిసహాయమును చేయజాలడు.

6. నిరుపయోగమగు నసత్యలోకమును బుట్టించి, మానవకోటిని మాయ చేయుచున్న వేదాంతుల పరబ్రహ్మమును కేవలము మోసగాడనవలసి వచ్చునుగదా. ప్రేమాస్వరూపియగు దేవుడిట్టివాడని తలంచుట న్యాయవిరుద్ధమును, అసహ్యమునై యుండును.

7. ఈ సిద్ధాంతప్రకారము మోక్షమనగా స్వరూపనాశనమే. యనగా తన స్వరూపమును మరచి యెట్టి జడమగుటయే.

8. వేదాంతమతప్రకారము క్రియాశూన్యుడగు నిర్గుణబ్రహ్మమునందు లీనమగుటయే మోక్షము. కాని ఇందునకొక యాక్షేపణ గలదు. అదేదనగా మాయ, విరామములేక సృష్టిచేయుచుండుటచేతను, దాని ప్రభావముచే బ్రహ్మముకూడ జీవులను నిరంతరము పుట్టింపవలసినవాడగుటచేతను, ఒక్క క్షణమైనను విశ్రాంతి లేక యుండును. అట్లు సృష్టికార్యమునందు సదా మునిగియుండు బ్రహ్మములో లీనమై తెంపులేకుండా మోక్షానందమనుభవించుట సాధ్యముకాదు. కావున వేదాంతము చూపుచున్న మోక్షము శాశ్వతము కాజాలదుగదా? ఇంతేగాక విమోచననొంది బ్రహ్మమునందు జీవాత్మలలో గొన్నిమాత్రమే లీనమగును. కావున బ్రహ్మమునందు లీనములైన యాత్మలుగల యొక భాగమును, మాయకు నింకను లోబడియుండు జీవాత్మలుగల మరియొకభాగమును వేరువేరుగ నుండవలెను. అనగా అఖండస్వరూపమగు బ్రహ్మము ఖండితుడగును. మాయ తన సృష్టికార్యమును నెన్నడును మానకుండుటచే జన్మలకును అంతమే యుండదు.

9. బ్రహ్మము మాయకు నెల్లప్పుడును లోబడినవాడేయైనట్లయితే, అతడు శాశ్వతముగ ప్రకృతిగుణములకు లోనైయుండవలెను. కావున గుణరహితుడగు నిర్గుణబ్రహ్మ మున్నాడనుట కలలోవార్తయే. ఇట్టి ప్రకృతి బ్రహ్మవాదము కేవలము ద్వైతమేగాని అద్వైతమెట్లగును?

10. జననమరణములు గలవాడును, అజ్ఞానియు, శక్తిహీనుడును, పాపాత్ముడును నగు మానవుడు తా నాద్యంతములు లేనివాడును, సర్వజ్ఞుడును, సర్వశక్తుడును, పాపరహితుడును నగు పరబ్రహ్మము నని చెప్పుకొనుట తెలివితక్కువయే గాక దైవదూషణయు నగును.

---

# XI. TABLE OF EVENTS.

## చరిత్ర విషయిక కాలనిర్ణయపట్టీ.

| హిందూదేశమందలి సంగతులు. | | హిందూదేశమునకు వెలుపటి సంగతులు. | |
|---|---|---|---|
| క్రీ. ము. | | క్రీ. ము. | |
| 2000—1500 | ఆర్యులు హిందూదేశమున బ్రవేశించుట. | 1928 | అబ్రహాము కనానులో ప్రవేశించుట. |
| | | 1643 | యోసేపు ఐగుప్తులో మరణించుట. |
| 1500—1000 | పురాతన వేద గీతములు. | 1498 | ఐగుప్తునుండి ఇశ్రాయేలీయుల నిర్గమము. |
| 1000 | ఆర్యులు కురుక్షేత్రము చేరుట. | 1063 | దావీదు యూదాదేశమునకు రాజగుట. |
| 1000—800 | వేద సంహితములు. | 982 | యూదా ఇశ్రాయేలు రాజ్యముల విభాగము. |
| | | 900 | ప్రవక్తయైన ఏలియా. |
| 800—500 | బ్రాహ్మణములు. | 790 | ఆమోసు, హోషేయ ప్రవక్తలు. |
| | యజ్ఞములు అభివృద్ధినొందుట. | 753 | రోమాపట్టణమును కట్టుట. |
| | | 740 | యెషయా ప్రవచించుట. |
| | | 722 | షోమ్రోను నాశనమవుట, ఇశ్రాయేలు అష్షూరు చెరకు పోవుట. |
| 544 | గౌతమ బుద్ధుని జననము. | 660—583 | జోరాస్టర్, జెండ్ అవెస్త. |
| 600—500 | సాంఖ్యయోగము. | 626 | యిర్మీయా ప్రవచించుట. |

| | |
|---|---|
| 600—200 | సూత్రములును, ఉపనిషత్తులును. |
| 516 | దర్యావేషు పంజాబుపై దండెత్తుట. |
| 500—క్రీ. వె. 200 | మానవ ధర్మశాస్త్రము. |
| 500 | ఇప్పటినుండి ఆర్యుల మతనాగరికతలు దక్షిణ హిందూస్థానమందు వ్యాపించుట. |
| 400—300 | పాణిని సంస్కృతవ్యాకరణమును వ్రాయుట. |
| 500—క్రీ. వె. 200 | రామాయణము. |
| 400—క్రీ. వె. 500 | మహాభారతము. |
| 327—325 | మహా అలెగ్జాండరు హిందూదేశముపై దండెత్తుట. |
| 321 | చంద్రగుప్తుడు. |
| 300—క్రీ. వె. 800 | భగవద్గీత. |
| 272 | అశోకుడు. |
| 150 | పతంజలి యోగశాస్త్రము వ్రాయుట. |

| | |
|---|---|
| 593 | యెహెజ్కేలు ప్రవచించుట. |
| 587 | నెబుకద్నెజరు యెరూషలేమును నాశనముచేయుట. |
| 551—478 | కన్‌ఫ్యూషియస్. |
| 538 | పారసీకరాజైన కోరేషు. |
| 430 | మలాఖీ ప్రవచించుట. |
| 427—322 | సాక్రటీస్, ప్లేటో, అరిస్టాటల్ అను గ్రీకు తత్వజ్ఞులు. |
| 323 | మహా అలెగ్జాండరుయొక్క మరణము. |
| 142 | మాకబీయుల పరిపాలనలో యూదా స్వతంత్రరాజ్యమగుట. |
| 40 | హేరోదు యూదాకు రాజగుట. |
| 31 | కైసరౌగూస్తు రోమా చక్రవర్తియగుట. |
| 4 | యేసుక్రీస్తు జన్మము. |

క్రీ. శ.

| | |
|---|---|
| 29 | క్రీస్తు మరణము. |
| 47—95 | నూతన నిబంధనను రచించుట. |
| 70 | తీతు యెరూషలేమును నాశనముచేయుట. |

(వెనుకటి పుటలోని తరువాయి)

| క్రీ. శ. | హిందూదేశమందలి సంగతులు. | క్రీ. శ. | హిందూదేశమునకు వెలుపటి సంగతులు. |
|---|---|---|---|
| 200—300 | మలబారులో క్రైస్తవమతము స్థాపింపబడుట. | | |
| 300—500 | న్యాయశాస్త్రమును వైశేషికశాస్త్రమును. | 323 | కాన్‌స్టంటైన రోమా చక్రవర్తియగుట. |
| 320 | ఉత్తర హిందూస్థానములో గుప్తరాజ్యము స్థాపింపబడుట. | | |
| 400 | కాళిదాస. | | |
| 400—800 | ప్రథమ పురాణములు. | | |
| | | 476 | పశ్చిమ రోమారాజ్యము నాశనమవుట. |
| 606 | కనోజరాజగు హర్షుడు. | 570 | మహమ్మదు జన్మము. |
| 711 | మహమ్మదు కాసిం సింధుదేశమును జయించుట. | | |
| 800 | శంకరాచార్యులు వేదాంతశాస్త్రము వ్రాయుట. | | |
| 800—1700 | కడపటి పురాణములును, పాంచరాత్ర సంహితములును, వైష్ణవాగమములును, శైవాగమములును. | 800 | షార్లమేన్. |
| 1000 | మాణిక్యవాసగర్. | | |
| 1001—1030 | మహమ్మదు ఘజినీ మధుర సోమనాథములను జయించుట. | 1076 | పోపైన యేడవ గ్రెగరీ. |
| | | 1096 | మొదటి సిలువదండయాత్ర. |
| 1137 | రామానుజాచార్యుల మరణము. | | |

| | |
|---|---|
| 1250 | మధ్వాచార్యులు. |
| 1300 | రామానందుడు. |
| 1398 | తైమూర్ హిందూదేశముపై దండెత్తుట. |
| 1500 | వల్లభాచారి. |
| 1518 | కబీర్ మరణము. |
| 1532—1623 | తులసిదాస్. |
| 1533 | చైతన్యుని మరణము. |
| 1538 | నానక్ మరణము. |
| 1566—1605 | అక్బర్. |
| 1608—1649 | తుకారామ్. |
| 1658—1707 | ఔరంగజేబ్. |
| 1757 | ప్లాసీ యుద్ధము. |
| 1792 | విలియంకేరీ హిందూదేశమునకు వచ్చుట. |
| 1828 | బ్రహ్మసమాజ స్థాపనము. |
| 1834 | రామకృష్ణ పరమహంస జననము. |
| 1867 | ప్రార్థన సమాజస్థాపనము. |
| 1875 | ఆర్య సమాజస్థాపనము. |
| 1878 | దివ్యజ్ఞాన సమాజమును ఈ దేశములో స్థాపించుట. |
| 1931—1933 | హిందూదేశములోని నూతన రాజ్యాంగ శాసనముల నాలోచించుటకై లండనులో సమావేశమైన మూడు రౌండుటేబిల్ మహాసభలు జరుగుట. |
| 1492 | అమెరికాను నూతనముగ కనుగొనుట. |
| 1521 | వర్మ్సు మహాసభలో మార్టిన్‌లూథర్ సాక్ష్యమిచ్చుట. |
| 1815 | వాటర్లూయుద్ధమందు నెపోలియను అపజయమునొందుట. |
| 1914—1918 | గొప్ప యుద్ధము. |